# పెరిగే పిల్లలకి కావాలి కాంప్లాన్

## కేవలం కాంప్లాన్ లోనే వాళ్ళకు ప్రతి రోజూ అవసరమయ్యే 23 కీలక ఆహార పదార్థాలున్నాయి.

పిల్లల పెరుగుదల సామాన్యంగా, వాళ్ళకి 15, 16 ఏళ్ళొచ్చేసరికి రమారమి పూర్తవుతుంది.

ప్రోటీన్లు, పెరుగుదలకు నేరుగా తోడ్పడే పోషక పదార్థాలు. అందుకే, మీ పిల్లలకు అవసరం, కాంప్లాన్—యిప్పుడు. కాంప్లాన్‌లో అత్యుత్తమమైన ప్రోటీన్లు–పాల ప్రోటీన్లు (20%) ఉన్నాయి. దాంతోబాటే దాన్లో 22 యితర కీలక ఆహారపదార్థాలు ఉన్నాయి.

కాంప్లాన్ రుచికరమైన సువాసనల్లో దొరుకుతుంది.




23

కీలక ఆహార పదార్థాలు
ఆరోగ్యబద్ధమైన పాళ్ళలో

| | |
|---|---|
| ప్రొటీన్ | రిబోఫ్లావిన్ |
| కొవ్వు పదార్థాలు | నికొటినమైడ్ |
| కార్బొహైడ్రేట్ | కాల్షియమ్ |
| కేల్షియమ్ | పాంటొథెనేట్ |
| ఫాస్ఫరస్ | కోలిన్ |
| సోడియం, క్లోరైడ్ | పైరిడాక్సిన్ (బి6) |
| (సిఎల్ రూపంలో) | విటమిన్ బి12 |
| పొటాషియమ్ | ఫోలిక్ ఏసిడ్ |
| ఐరన్ | విటమిన్ సి |
| అయోడిన్ | విటమిన్ డి |
| విటమిన్ ఎ | విటమిన్ ఇ |
| విటమిన్ బి1 | విటమిన్ కె |

పాలు కలపనవసరం లేదు.



**కాంప్లాన్®** – సంపూర్ణంగా ఆరోగ్యబద్ధమైన ఆహారం

GK&E B84 GLC 120 Tg

# SEPSOND (SEPSONIL-D)

## రెండు పరిమళాలలో ఎంపిక చేసుకోవటానికి అపూర్వమైన డియోడారెంట్ ద్రవ్యం




మల్లెలు



మంచి గంధం



**SEPSOND**

సెప్సాండ్‌తో

కొన్ని అద్భుతమైన ఆశ్చర్యాలను కనుగొనండి.
కొన్ని చుక్కలు నీటిలో కలపండి అంతే.
తత్ఫలితంగా ఉద్భవించే పరిమళం మీ పరిసరాలను మల్లెల లేక మంచిగంధం పరిమళభరితం చేస్తుంది.
ఎక్కడైనా వాడండి. అన్ని వేళల వాడండి. మధురమైన జ్ఞాపకాలను మేలుకొలుపుతుంది సెప్సాండ్ (సెప్సోనిల్-D)

సెప్సాండ్ **SEPSOND**

ప్రత్యేకంగా ఎయిర్-కూలర్లకు మరియు ఎయిర్-కండీషనర్లకు సిఫారసు చేయబడింది. అది మీ స్థలాన్ని ఆహ్లాదంగా ఉంచుతుంది. గృహములకు, దేవుని మందిరములకు, ఆఫీసులకు, హోటళ్లకు, క్లబ్బులకు, బ్యూటీ పార్లర్‌లకు మరియు సినిమా థియేటర్లకు మిక్కిలి అనుకూలమైనది. మీరు ఎక్కడ ఎంపికచేసిన మీ విశేష - వాడకానికి సెప్సాండ్ (సెప్సోనిల్-D) అడగండి.

 ప్రత్యేకమైన నాణ్యతకు చిహ్నం.

మరింత ఆనందదాయకమైన జీవితానికి ఆరోగ్యకరమైనవి మరియు శుద్ధమైన ఉత్పాదనలు. **SPECIFIC** స్పెసిఫిక్ యొక్క ఇతర విశిష్టమైన నాణ్యమైన తయారీలు.

సెప్సోనిల్ Sepsonil

ఏంటిసెప్టిక్ జర్మిసైడ్ లోషన్, బ్రిటిష్ ఫార్మా కోపియ ప్రమాణాల ననుసరించి ప్రత్యేకంగా తయారు చేయబడి ధృవీకరించబడిన ఏంటిసెప్టిక్ జర్మిసైడ్.

స్ఫెనైల్ **SPHENYL**

అత్యధికంగా కాన్‌సెంట్రేటెడ్ నల్లని డిస్ ఇన్‌ఫెక్టంట్ ద్రవం. స్ఫెనైల్-డిస్‌ఇన్‌ఫెక్టంట్ జర్మిసైడ్ మరియు పరిమళ మిశ్రితమైన అసలైన ఫెనాయిల్



# Specific Laboratories

**197, Nicholson Road, Tarbund**
**Secunderabad 500003 Ph:823215**

**Now available in your shop**

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు:

దేశోద్ధారక కాశీనాథుని

నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు :

(1938 - 1972)

శుక్రవారం : 29 మార్చి-4 ఏప్రిల్, '85

శ్రీక్రోధన నామ సం. చైత్ర శు. అష్టమి

**సంపుటము 77 : సంచిక 30**

సంపాదకుడు :

శివలెంక రాధాకృష్ణ

ఆరు మాసాల చందా రు. 55-90

పోస్టులో ఏడాది చందా రు. 111-80

ఆంధ్రపత్రిక కార్యాలయము,

గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

ముఖచిత్రం :

స్వప్న, నరేష్

(ఫోటో : వి. సత్యమూర్తి)






### ఉగాది సంచిక

రాధ ముఖచిత్రంతో వెలువడిన పత్రికలో 'సైకిల్' కథ బావుంది. డా. జయ్ దుబాషీ రచన ఆలోచింప చేసేదిగా ఉంది.

—ఉషాయోగి, రాజోలు.

### సీరియల్స్

సుచిత్రాదేవిగారి 'ప్రేమించవే మనసా' ప్రారంభంలోనే చాలా బాగా ఉంది. ప్రతి వారం చదవాలి అనిపించేదిలా ఉంది. మరో సంచిక కోసం ఎదురు చూస్తాం!

—బి. సునీతాకళాకౌశ, గుంటూరు.

### ఆంధ్రులు – అంధులు

15–21 ఫిబ్రవరి 85 సంచికలో 'మదరాసు నించి మనకి సంక్రమించిన సంప్రదాయం' వ్యాసం బాగుంది. అది మనకు అంటుకొన్న సంప్రదాయం కాదు, మన మీదకి మహమ్మారిలా వచ్చి పడ్డ ఓ పెద్ద అంటువ్యాధి. చలనచిత్ర వ్యామోహం లోంచి పుట్టుకు వచ్చిన రాజకీయాలు నిజమైన రాజకీయ చైతన్యాన్నే నాశనం చేస్తాయి. వ్యక్తిగత వ్యామోహాలు, మూఢభక్తి, వికృతంగా తల ఎత్తి ప్రజల్లో విజ్ఞతనే దోచుకొంటాయి. వాగ్దాటి, భ్రమ కలిగించే గంభీరోపన్యాసాలు, మురిపించే రాజకీయ నాటకాలు ప్రజల ఆలోచనా శక్తినే నశింపజేస్తాయి. చలన చిత్ర వ్యామోహంలోంచి పుట్టిన రాజకీయా లను మెరుపు రాజకీయాలనవచ్చు – భ్రాంతి కలిగిస్తాయి కాని, కాంతిని యివ్వవు. ప్రజల ఆర్థిక, నైతిక, మానసిక స్థితి వారికి తెలియకుండానే దిగజారిపోతుంది. ఈ తళుకు రాజకీయాలు క్రొంగొత్త మౌఢ్యాన్ని, మూఢ నమ్మకాలను ప్రజా మనస్తత్వంలోకి చొచ్చుకు పోయేలా చేస్తాయి. సినిమారంగంలో వుంటూ తమ నటనల ద్వారా జాతిలో వెకిలితనం, పనికిమాలిన తనం, అవాస్తవికత పెంపొందించిన వ్యక్తులే ఆ తళుకు రాజకీయాల ద్వారా మ్యాజిక్ మహాత్ములై పోతున్నారు. మహాత్మాగాంధీ వంటి మహోన్నత వ్యక్తి అస్వస్థులైనప్పుడు ఆయన భక్తులు ఆత్మాహుతి చేసుకోలేదు. కాని నల్లడబ్బు కంపులోంచి వచ్చి, తెల్లారేసరికల్లా రంగులు మార్చే ఈ మ్యాజిక్ మహాత్ములు జబ్బు పడితే, మూఢ భక్తుల ఆత్మాహుతులు! మరో మ్యాజిక్ మహాత్ముడి బొటనవేలు తెగితే మూఢభక్తుల గగ్గోలు! ఈ జబ్బులన్నీ మదరాసు నుండి మనకి అంటు కొన్నాయ్. మదరాసు నుండి సంక్రమించిన ఈ రాజకీయ వారసత్వం చాల ప్రమాదకరమైనది. వారించకపోతే, ఆంధ్రుల్ని నిజంగానే అంధుల్ని చేస్తుంది.

—టి. యస్. రావు, విశాఖపట్నం.

### "గుండె"

14–2–1985వ సంచికలో వెలువడిన 'వైద్యశాస్త్ర ఉరవడిలో...సరికొత్త సవ్వడులు' అనే విజ్ఞాన శాస్త్రం ఎంతో బాగుంది. 'కృత్రిమ గుండె పని చేసే విధం' గురించి బాగా ప్రచురించారు. కథలే కాకుండా, సైన్సుకు సంబంధించినవి, వ్యాసాలు, శీర్షికలు, ఇంకా ఎన్నెన్నో ప్రచురించి నందుకు ధన్యవాదాలు.

గోలి శ్రీనివాసరావు, వేణు, చిట్టివల్స.

### ప్రేమకు కత్తిపోట్లు

'ప్రేమకు కత్తిపోట్లు' కథలో ప్రేమకు, కోరికకు గల తేడాను రచయిత్రి చాలా బాగా వివరించారు. కానీ చక్రవర్తి సౌందర్య 'ప్రేమకు కత్తిపోటు' పొడిచాడు. అలాగే సౌందర్యను ప్రేమించిన జయాకర్‌ను కత్తిపోటుకు గురి చేయటం ప్రేమ తత్వం తెలిసిన సౌందర్య లాంటి వ్యక్తి చేయవలసిన పని కాదు.

—కనూరి శివప్రసాదు, సికింద్రాబాద్.

### గ మ ని క

ఆంధ్ర సచిత్రవార పత్రిక 22–28 మార్చి, 85 సంచికలో ''ఆశాజనకంగా ఉండే పరిణామం'' వ్యాసంలో (7వ పేజీ, మూడవ పేరాలో) 'ఒకప్పుడు కీ. శే. జోసెఫ్ స్టాలిన్, మావ్‌జ్జెడుంగ్ వారి అనుచరులచేత దైవ సమానులుగా పరిగణించ బడలేదు' అని పొరపాటు పడింది. 'దైవసమానులుగా పరిగణించ బడేవారు' అని ఉండాలి. పాఠకులు గమనించ గోరుతున్నాము. అచ్చు పొరపాటుకి చింతిస్తున్నాము.

—సం. □



శ్రీ గోర్బాచేవ్

# క్రెమ్లిన్‌లో కొత్త నాయకుడు

క్రెమ్లిన్‌లో కొత్త పాలకుడు అధికారంలోకి వచ్చినప్పుడెల్లా పాశ్చాత్య ప్రచారసాధనాలలో కొంత సందడి ఏర్పడుతూ ఉంటుంది ఆ సందడే భారతీయ పత్రికలదాకా వ్యాపిస్తూ ఉంటుంది

శ్రీ మిఖెయిల్ గోర్బాచేవ్ ప్రస్తుతం రష్యాలో ప్రథములుగా ఉంటున్నారు అంటే, ఆయనకన్నా ఎక్కువ అధికారంకల వ్యక్తి సోవియెట్ యూనియన్‌లో లేరన్నమాట.

ఈయన వయస్సు 54 ఇది పిన్నవయస్సు కాదు కాని ఆయన ముందు అధికారంలోకి వచ్చిన కీ శే చెర్నెంకో, అంద్రోపోవ్‌లు బాగా పెద్ద వారయిపోయిన తరువాతనే అధికారంలోకి వచ్చారు ఇద్దరూ అనారోగ్యంతో బాధపడుతూ అనతికాలంలో పదవిలో తమవు చాలించినవారే.



శ్రీ సుస్లోవ్



శ్రీ గోర్బాచేవ్ తోటి నాయకులలో ప్రముఖులు ఈ కిందివారని చెప్పబడుతు ఉంటుంది విదేశాంగమంత్రి శ్రీ గ్రోమికో (75 సం), భారీ పరిశ్రమల మంత్రి శ్రీ రోమనోవ్ (62 సం), రష్యా రాష్ట్రం ప్రధానమంత్రి శ్రీ వొరోట్నికోవ్ (59 సం), మొదటి సోవియెట్ ఉప ప్రధాన మంత్రి శ్రీ అలియేవ్ (61 సం)

సోవియెట్ ప్రధానమంత్రి శ్రీ టిఖోనోవ్ వయసు80 రక్షణమంత్రి మార్షల్ సొకొలోవ్‌కి 73 ఏళ్లు ఆయన జబ్బుగా ఉన్నారుట

వయసు మళ్ళిన వారంతా వెళ్ళిపోతే రష్యాలో శ్రీ గోర్బాచేవ్ వంటి మధ్య వయస్కులే పెద్ద పదవులలో ఉంటారని పాశ్చాత్య దేశాలలోని "రష్యా—నిపుణులు" అనుకుంటున్నారు

ఈ కొత్తతరం నాయకులకి 1917 విప్లవంలో ఉద్భవించి పెంపొందిన భావాలు చాలా



శ్రీ ఆంద్రీ గ్రోమికో

ముఖ్యంగాతొలగకపోవచ్చునని పాశ్చాత్య దేశాలవారు ఆశిస్తున్నారనిపిస్తుంది

ఇంతకీ శ్రీ మిఖెయిల్ గోర్బాచేవ్ ఎటువంటి వ్యక్తి? ఆయన జీవితానికి సంబంధించిన విశేషాలు ఏమిటి ?

ఈ సమాచారం ఎక్కువగా పాశ్చాత్యదేశాల పత్రికల ద్వారానే తెలుస్తున్నాయి రష్యాలో ఎవరిని గురించి ఎంత సమాచారం ఎప్పుడు అధికార ప్రచారసాధనాలు తెలుపుతాయోచెప్పటం కష్టం ! ఒకనాడు "దేవుడితో సమానంగా" ఆరాధించబడిన జోసెఫ్‌స్టాలిన్ హటాత్తుగా మరుగున పడిపోవలసి వచ్చింది ! అయినాసరే పాత పుస్తకాలూ, పత్రికలూ పాశ్చాత్యదేశాలలో నయినాసరే ఉండనే ఉంటాయి వాటిద్వారా సమాచారం తెలియకుండా ఉండదు ..

మిఖెయిల్ గోర్బాచేవ్ 1931లో దక్షిణ రష్యాలో ఉన్న స్టావ్రొపోల్‌లో జన్మించారు ఈయన మొదటిలో ఏమి చదువుకున్నారో తెలియదుకాని కొంతకాలం ట్రాక్టరు డ్రయి

( 7 వపేజీ చూడండి)

# నెహ్రూల దశాబ్దం

## న్యూఢిల్లీ లేఖ



డా. జయదుబాషి

ఈ ఎనభయ్యవ దశకం నెహ్రూల దశాబ్దంగా రూపొందబోతున్నట్లు స్పష్టం అవుతున్నది. దాదాపు మూడు సంవత్సరాల రాజకీయ అజ్ఞాతవాసం అనంతరం 1980 ప్రారంభంలో శ్రీమతిగాంధీ తిరిగి అధికారంలోకి రావడంతో ఈ దశాబ్దం ఆరంభం అయింది. మధ్యలోనే 1984లో ఆమె హత్య చేయబడ్డారు. 1984 చివరలో నెహ్రూలలో మరొక తరం అధికారాన్ని హస్తగతం చేసుకున్నది. మరొక అయిదు సంవత్సరాలకి, ఈ దశాబ్దం ముగింపుకు వచ్చేసరికి, దేశం జవహర్‌లాల్ నెహ్రూ శతజయంతి ఉత్సవాలని జరుపుకుంటుంది. ఇందిరాగాంధీ రాజకీయ పునర్జన్మతో ఆరంభం అయిన ఈ దశాబ్దం కుటుంబపాలన వ్యవస్థాపకుడైన ఆమె తండ్రి నెహ్రూ స్మృతులతో అంతమవుతుంది.

మనకి నచ్చినా నచ్చకపోయినా ఒక శతాబ్దం కాలంలో మూడింట రెండువంతులు భారత రాజకీయాలలో నెహ్రూలదే పైచెయ్యి అని అంగీకరించక తప్పదు. ఈ వంశానికి మూల పురుషుడనదగిన మోతీలాల్ నెహ్రూ మహాత్మాగాంధీ ప్రవేశానికి ముందునించే రంగంలో ఉన్నారు. అయితే ఆయన పేరు 1928లో మొదటిసారిగా కాంగ్రెసు అధ్యక్షుడిగా చరిత్ర పుటలలోకి ఎక్కింది. ఆ తర్వాత సంవత్సరం 1929లో ఆ పదవికి ఆయన కుమారుడు వారసుడైనారు. బహుశ ఆ సంవత్సరమే నెహ్రూల గురించి, వాళ్ల గొప్పతనాన్ని గురించి వివరించే కథలు ప్రచారం కావడానికి నాంది పలికిందని చెప్పవచ్చు. నెహ్రూకి అప్పుడు 40 సంవత్సరాలు. బట్టతల ప్రారంభం అయిన ఆ యువకుడికి మహాత్మాగాంధీ జాతీయ నాయకుడి పాత్ర ఇచ్చారు. ముప్ఫయ్యవ దశకం ఆ కుటుంబానికి చాలా భయంకరమైన కాలం. 1931లో మోతీలాల్ నెహ్రూ మరణించారు. ఆ తర్వాత అయిదేళ్లకే జవహర్‌లాల్ భార్య కమలా నెహ్రూ జెనీవా వద్ద అస్వస్థతతో మరణించారు. అప్పుడు ప్రపంచం దృష్టి అంతా యూరోప్ మీదా, ముఖ్యంగా హిట్లర్, ముస్సోలినీల పైనా ఉండేది. నెహ్రూ తరచుగా యూరోప్ వెళ్లి వస్తూ ఉండటంతో ఆయనని కూడా ప్రపంచ రాజకీయాలలోని పెద్ద తలలతో సమానంగా పరిగణించి ఉండవచ్చు.

నేను చిన్నప్పుడు స్కూల్లో చదువుతున్నప్పుడు గోవాలోని ఒక చిన్న పత్రికలో కమలా నెహ్రూ స్విట్జర్‌లాండ్‌లో చనిపోయినట్లు చదివాను. అప్పుడు యూరోప్ గురించి మాకు అంతగా తెలియదు. కానీ ఆ ఖండంలో మోతీలాల్ గురించి ప్రచారంలో ఉన్న కథలని వింటూ ఉండే వాళ్ళం. వాళ్ళ దుస్తులు ఇస్త్రీకి పారిస్ వెళ్ళిరావడం, ఫ్రెంచి మద్యం వంటి పుకార్లు కూడా వాటిలో ఉండేవి. ధీరోదాత్తుడైన కథానాయకుడు జవహర్‌లాల్ విషయంలో ఆయన ఒక నెల భారతదేశంలోని జైలులో, ఆ తర్వాత నెల బార్సిలోనాలో అవరోధాల వెనుక, ఆ తర్వాత వెబ్ రాజదంపతులు, బెర్నార్డ్‌షాలో విందారగింపులు, హిట్లర్ దగ్గరనించి వచ్చిన ఆహ్వానాన్ని తిరస్కరించడం వంటివి ఆయన్ని హీరోని చేశాయి. ఈ గొప్పతనమే త్వరలో ఆ కుటుంబానికంతటికీ విస్తరించింది.

నెహ్రూ సోషలిజం కూడా దాని పాత్రని అది నిర్వహించింది. కానీ నెహ్రూకి వామపక్ష భావాలు ఉన్నాయనుకుంటే అది పొరపాటే అవుతుంది. 1931 నించే నెహ్రూని గట్టిగా సమర్థించిన వారిలో ఘన్ శ్యామ్ దాస్ బిర్లా కూడా ఉన్నారన్నది సాధారణంగా చాలామందికి తెలియదు. ఆ సంవత్సరంలో బొంబాయిలో జరిగిన ఎఫ్.ఐ.సి.సి.ఐ. సమావేశంలో జి. డి. బిర్లా తమతోటి వాణిజ్య వేత్తలకి నెహ్రూని బలపరచవలసిందిగా చెప్పారు. ఎందుకంటే ఆయన వారి భాష మాట్లాడతారని కాదు, మాట్లాడలేరు కూడా, నెహ్రూకి ఆధునిక భావాలు ఉన్నాయనీ, ఎప్పుడో రాబోయే స్వాతంత్ర్యం అనంతరం దేశాన్ని నడిపించగల ఏకైక వ్యక్తి అనీ ఆయన అన్నారు. ఒకసారి జి.డి. బిర్లాతో నేను ఈ విషయాన్ని ప్రస్తావిస్తే నెహ్రూ సోషలిస్టు అయితే అయి ఉండవచ్చు కానీ పారిశ్రామిక వేత్తలకి ఆయనతో వ్యవహరించడం తేలికనీ, పరిశ్రమలని వ్యతిరేకించే చరణ్ సింగ్‌లాంటి వారితో వేగడంకన్నా సులువుగా ఉంటుందనీ ఆయన అన్నారు.

అయినా ఎవరికీ అర్థంకాని ఒక విషయం అలాగే ఉండిపోయింది. వందలాది కుటుంబాలలో నెహ్రూలనే దేశం ఒకరి తర్వాత మరొకరిని తన పాలకులుగా ఎందుకు ఎన్నుకున్నదన్న విషయం మాత్రం మాయాజాలంలా ఉండిపోయింది. చరిత్ర గతిలో ఇది కాక తాళీయంగా జరిగిన విషయమా లేక దీనికీ మరో కారణం ఏదైనా ఉన్నదా? సాల్మన్ రష్డీ నెహ్రూల అభిమానికాదు, ఇందిరాగాంధీకి అసలే కాదు. ఆయన గొప్పతనాన్ని గురించి ప్రచారం చెయ్యడం వంశపారంపర్య పరిపాలనలో ఒక భాగం అనీ, ఎన్నో కొత్తదేశాలు ఇలాంటి అవస్థని దాటవలసి ఉంటుందనీ రాశారు. అయితే ఈ దశ ఆరేడు దశాబ్దాలపాటు అవిచ్ఛిన్నంగా ఎందుకు కొనసాగిందో ఆయన వివరించలేకపోయారు.

ఇటీవల ప్రచురింపబడిన "ది నెహ్రూస్ అండ్ ది గాంధీస్" పుస్తకంలో దాని రచయిత తారీఖ్ అలీ ఇదే ప్రశ్న అడిగారు కానీ సమాధానం చెప్పలేదు ఆయన. మార్క్సిస్టులకి అర్థంకాని భారతదేశ చరిత్ర గురించి అలీకి నిజంగానే తెలియదు. నెహ్రూల గురించి ఆయన రాసిన విషయాలన్నీ మనకి ఇంతకుముందే తెలుసు కాబట్టి ఆయన చెప్పిన కొత్త విషయాలేమీ లేవు. ఆయన చెప్తున్న దానినిబట్టి ఆయన ఇందిరాగాంధీని కలుసుకున్నారు, కానీ నెహ్రూని కలవలేదు. అసలు మూలపురుషుడిని కలిస్తే తప్ప ఆ కుటుంబం విషయం మీకు తెలియదు.

నెహ్రూ మొదట జాతీయవాది, తర్వాత ఆధునికవాది, ఆ తర్వాత కాంగ్రెసు పార్టీకి విధేయుడు. ఆయన చాలా తెలివైన రాజకీయవాది కానీ, ఆయన "ఆ రకం" రాజకీయవాది కారన్న అభిప్రాయాన్ని కలిగించడంలో కృతకృత్యులు కాగలిగారు. పటేల్‌ని గుజరాతీ రాజకీయవాదిగా భావించినట్లు నెహ్రూని ఉత్తరప్రదేశ్ రాజకీయవాది అని ఎవరూ అనుకోలేదు. చివరికి గాంధీగారికి కూడా గుజరాతీ రాజకీయాలతో తరచుగా సంబంధం ఉండేది. రాజ్‌కోట సత్యాగ్రహం కూడా ఆయన తమ కోసం, దేశంకోసం చేశారు. వారందరూ అప్పుడు జాతీయవాదులు. నెహ్రూ కూడా వారిలో ఒకరనే ఎవరైనా అంటారు. కానీ ఒకే ఒక్క తేడా ఉంది. అది ఆయన

## న్యూఢిల్లీ లేఖ......

గాంధేయవాది కాకపోవడం. దాన్నే ఆయన చివరి దాకా నిలుపుకున్నారు. కాంగ్రెసు కార్యక్రమం లోని భాగంగా ఆయన గాంధీని అనుసరించారు. కానీ చివరి వరకూ ఆయన గాంధీకి దాదాపు దూరంగానే ఉండిపోయారనే చెప్పవచ్చు. అందు వల్లే గాంధీగారు మరణించినప్పుడు మిగతా వారందరూ ఒక్కసారిగా అనాథలైపోయారు, కానీ నెహ్రూ మాత్రం కాలేదు. గాంధీ జీవించి ఉన్నప్పుడు కూడా, ఆయనకి ఎంత అయిష్టంగా ఉన్నా కూడా, ఆధునికీకరణ గురించి నెహ్రూ నొక్కి చెప్పేవారు. తనుకంటూ ఒక వేదికని ఏర్పాటు చేసుకోడంలో కాంగ్రెసు నాయకు లందరిలోనూ నెహ్రూ ఒక్కరే విజయాన్ని సాధించారు.

జయప్రకాశ్ నారాయణ్ జాతీయవాది, ఆధునికవాది. కానీ ఆయన కార్యనిర్వాహకుడు కాదు. భారతదేశంలో ఏదో ఒక సంస్థ అన్నది లేకుండా ఎవరూ పైకి రాలేరు. ఈ విషయం నెహ్రూకి తెలుసు. అందువల్లనే గాంధీగారితో, మరి కొందరితో అభిప్రాయ భేదాలు వచ్చినా ఆయన కాంగ్రెసుని వదిలి పెట్టలేదు. ఒక సంస్థ ద్వారా గుర్తింపు పొందటం అన్న విషయంలో నెహ్రూలు ఎప్పుడూ జాగ్రత్త పడేవారు. కాలానుగతంగా ఆ సంస్థ మారుతున్నా ఏదో విధంగా అందులోనే కొనసాగుతూ ఉండటం అన్నది మనదేశంలో అతి ముఖ్యమైన విషయం. జయప్రకాశ్‌లాగా నెహ్రూ ఎప్పుడూ రాజకీయా లని వదిలిపెట్టలేదు. నిజం చెప్పాలంటే ఆయన వాటిలోనే ఆనందాన్ని చవి చూశారు. 1977లో జయప్రకాశ్ తిరిగి రాజకీయాలలోకి వచ్చినప్పుడు ఆయన వెనుక ఏ సంస్థా లేదు. అందుకే ఆయన ఒకటిగా కలిపిన జనతాపార్టీ కొద్దికాలం లోనే అనైక్యతకిలోనై ఛిన్నాభిన్నమై పోయింది. ఇప్పుడు ఉన్న కాంగ్రెస్ ఒకప్పటి మోతీలాల్, మహాత్మాగాంధీ, కనీసం జవహర్‌లాల్ కాంగ్రెసు కాదు. అయినా అది కాంగ్రెసే. వంద సంవత్స రాల చరిత్రని అది చూపించగలదు. అదే అతి ముఖ్యమైన విషయం కూడా. □

## క్రెమ్లిన్‌లో కొత్తనాయకుడు

( 5 వపేజీ తరువాయి)

వరుగా పనిచేశారు. ఆ తరువాత ఎలాగో మాస్కో విశ్వవిద్యాలయంలో స్థానంసంపాదించుకోగలిగారు. 1955లో లా (న్యాయశాస్త్రం) డిగ్రీ పుచ్చు కున్నారు. రాజకీయాలలో చేరి 1970లో ప్రాంతీయ పార్టీ కార్యదర్శి పదవిని సంపాదించుకో గలిగారు.

ఎనిమిది సంవత్సరాల అనంతరం, 1978లో, ఆయన మాస్కోకి మారిపోయారు. ఆయన పార్టీ కేంద్ర కార్యాలయంలో సభ్యుడుగా ప్రమోట్ అయి ఊరు మారారన్నమాట.

శ్రీ గోర్బాచేవ్‌కి కీ. శే. మిఖెయిల్ సుస్లోవ్, యూరీ అంద్రాపోవ్ లు "గురువులు"గా ఉండేవారుట. కీ.శే. అంద్రాపోవ్ సహాయంతోనే ఆయన తమ 49 ఏట పొలిట్ బ్యూరో సభ్యుడు కాగలిగారని చెప్పబడుతూ ఉంటుంది. 1978–84దాకా శ్రీ గోర్బాచేవ్ వ్యవసాయశాఖని నిర్వహించారు.

1984లో యూరీ అంద్రాపోవ్ మరణించి నప్పుడు శ్రీ గోర్బాచేవ్ ఆయన వారసుడు కాగలరని కొందరు ఊహించారు. అలాగ కాలేదు. కాని, 1985లో ఈ 54 సంవత్సరాల రాజకీయ నాయకుడు ప్రపంచంలోని అతి ముఖ్య మయిన పదవిలోకి వచ్చేశారు.

శ్రీ గోర్బాచేవ్ వేష, భాషలు పాశ్చాత్య దేశాల వారిని బాగా ఆకర్షించేట్లుగా ఉంటాయిట. ఆయన భార్య శ్రీమతి రయిసా తమ అందంతోనూ, నాగరిక ప్రవర్తనతోనూ పాశ్చాత్య పత్రికా విలేఖరులలో మంచి అభి ప్రాయాన్ని కలుగ చెయ్యగలుగుతున్నారుట. గోర్బాచేవ్ దంపతులకి ఒక కుమార్తె ఉన్నట్లు తెలుస్తోంది. ఆమె, ఆమె భర్త – ఇద్దరూ డాక్టరులేనని కూడా తెలుస్తోంది.

"నేను మనిషితో బేరం చెయ్యగలను." అని బ్రిటిషుప్రధాని శ్రీమతి మార్గరెట్ థాచర్ ఒకసారి శ్రీ గోర్బాచేవ్‌నిగురించి మాటలాడుతూ అన్నారుట. పాశ్చాత్యదేశాలవారి ఆశ ఇదే. వారి ఆశ ఎంత ఫలిస్తే ప్రపంచశాంతి అభివృద్ధి చెందే అవకాశం అంత ఉంటుందనటంలో సందేహంలేదు. భారతదేశం మొదటినుంచీ రష్యాతో స్నేహంగా ఉంటూవస్తోంది. శ్రీ రాజీవ్‌గాంధీ అదే విధానాన్ని కొనసాగిస్తారనికూడా అనుకోవాలి.

— విలేఖరి

# వ్యక్తిగతం



జాన్ యమ్. ఫెడ్డర్స్ (43) వర్జీనియాకి చెందిన ప్రముఖ న్యాయవాది. సెక్యూరిటీస్, ఎక్స్ఛేంజ్ కమిషన్ డివిజన్‌లోని ఎన్‌ఫోర్స్‌మెంట్ విభాగానికి అధిపతిగా ప్రస్తుతం పని చేస్తున్నారు. పని విషయంలో ఈయన అఖండుడని పై అధికారులు సయితం ఒప్పుకొంటారు. ఈయనకి భార్యా, అయిదుగురు పిల్లలూ ఉన్నారు. మంచి పలుకుబడి ఉన్న వ్యక్తి. ఇటీవల "వాల్ స్ట్రీట్ జర్నల్" పత్రిక ఫెడ్డర్స్ వ్యక్తిగత జీవితానికి సంబంధించిన కొన్ని విచారకరమైన అంశాలని బయటపెట్టి పెద్ద పెద్ద దుమారాన్ని రేపింది. ఈయనకి కోటీశ్వరుడిలాగా బతకాలనే కోరిక ఉంది. దుబారా ఖర్చులు, అప్పులు చేయడంలో ఈయన సిద్ధహస్తుడు. టెక్సాస్‌లో 70 ఎకరాల వ్యవసాయ క్షేత్రం ఈయనకి ఉంది. తమ జీతం తగ్గిపోయినా కూడా ఈయన తమ ఖర్చులని అదుపు చెయ్యలేకపోయారట.

అన్నింటికీ మించి ఈయన తమ భార్య ఛార్‌లొట్టీ ఫెడ్డర్స్ (41)ని చిత్రహింసలు పెట్టేవారట. ఆమె గర్భవతిగా ఉన్నప్పుడు పొత్తికడుపుమీద పిడిగుద్దులు గుద్దేవారట! జుట్టు పట్టుకుని జరజరమని నేల మీద ఈడ్చేవారట! చెప్పటానికి వీలులేని ఎన్నో దుశ్చర్యలకి పాలుపడ్డారని, అలాంటి భర్తతో కాపురం చేయడం అసాధ్యం అని శ్రీమతి ఛార్‌లొట్టీ ఇటీవల విడాకుల కోసం మేరీలాండ్ కోర్టులో దావా వేసింది. అమెరికా అధ్యక్షుడు రోనాల్డ్ రీగన్‌కి విన్నపం కూడా పంపింది. ఇంట్లో న్యాయం చేయలేని వ్యక్తి బయట న్యాయవాదిగా చలామణీ అవుతూ, న్యాయం చెబుతూ ఉండటం విడ్డూరం అందామె. పని చెయ్యడంలో ఎంతటి మొనగాడైనా భార్యని హింసపెట్టే వ్యక్తిని న్యాయవాదిగా ఉంచడం సమ్మతమేనా అని ఎందరో అడుగుతున్నారు ఫెడ్డర్స్ సంగతి ఏమిటో తెలియదు కాని ఆయన భార్య మాత్రం ఇక ఆయనని కలిసే ప్రసక్తే లేదని స్పష్టం చేసింది ఆమె ఎంతో దుఃఖంతో తన పరిస్థితి చాలా అధ్వాన్నమయి పోయిందని అనడం ఎవరినైనా కంట తడి పెట్టిస్తుంది ☐

# వారఫలం

## 29–3–1985 శుక్రవారం మొదలు 4–4–1985 గురువారం వరకు.

★ **మేషం :** మంచి చెడ్డలు గురుతించి మెలగాలి. అయినవారితో తగాదా లుంటా యేమో! వ్యయం అధికమైనా మంచి పని జరిగించని సంతోషిస్తారు. స్త్రీలకు : నూతన ప్రదేశాలు ఉత్సాహంతో చూడాలనే యత్నం కొనసాగుతుంది.

★ **వృషభం :** ఆరోగ్యరీత్యా శ్రద్ధ వహిస్తారుగా! హడావుడి తగ్గించుకొంటారుగా! కార్య భారం అధికం కాకుండా చూచుకోండి. స్త్రీలకు: నూతన మిత్రానుకూల్యత. ఉద్యోగరీత్యా 'ప్రమోషన్' కొందరకు సాధ్యం. ప్రయాణాలు బాగా సాగిపోతాయి. విలువగల వస్తువులు కొనుట కవకాశమున్నది.

★ **మిధునం :** మీ యింట శుభకార్యం జరుగవచ్చు. మీ ఆలోచనలు ఫలదాయకాలు కాగలవు. మీ బంధువర్గానికి సాయపడవలసిన అగత్యముంటుంది. వైజ్ఞానికంగా కొందరకు రాణింపగలరు. శారీరకంగా కొందరు జాగ్రత్త పడాలి. స్త్రీలకు: శతృవర్గాన్ని జాగ్రత్తగా గమనించి కార్యకలాపములందు అప్రయత్నంగా ఉండాలి.

★ **కర్కాటకం :** అధికంగా శ్రమ పడ్డారుగా! మంచి ఫలితాన్నే పొందారు. హోదా పెరిగింది. ఇంకేం? ప్రజా సేవయందు నిమగ్నులుకండి. మిత్రులవలన కోరిన సహాయం లభ్యంకాగల సమయం. అపకారం ఏ రంగాన జరుగదు. స్త్రీలకు : సంతానాన్ని గూర్చిన చింత ఏదో వెన్నాడుతుంది. 'ఉద్యోగం లేదే' అని ఉండవచ్చు. స్త్రీలకు సామాన్య ఫలం.

★ **సింహం :** వారమంతా శ్రమిస్తారు. అభివృద్ధి కార్యక్రమం కలిసిరాగలదు. నూతన వ్యాపారమందు దృష్టి నుంచగలుగతారు. తెల్లని వస్తు విక్రయమందు మీకు అనుకూలం. ఆరోగ్యాభివృద్ధికి మీరూ శ్రమించాలి. స్త్రీలకు : సమాజంలో పేరు పెంపులుండగలవు. ఆదాయమందభివృద్ధి కనిపించగలదు. వస్తు సేకరణ కవకాశం గలవారం. గ్రహించండి.

★ **కన్య :** నూతన వ్యక్తుల పరిచయం ఏర్పడగలదు స్తోత్రపాఠకులు రాగలరు. గమనించి మెలగండి కుటుంబ పరిస్థితులందు ఉత్సాహజనకంగా ఉంటుంది స్త్రీల వలన అనుకూలత గలదు స్త్రీలకు రాజకీయాలందు ఆశించిన అనుకూలత ఏర్పడుతుంది శ్రద్ధాసక్తులతో కార్యక్రమాన్ని నిర్వర్తించండి

★ **తుల :** మీ కార్యక్రమ మందు అప్రమత్తులై యుండాలి. మిమ్ము యిబ్బంది పెట్టాలని, కష్టాలకు గురిచేయాలని యత్నిస్తారు. జాగ్రత్త! రాజకీయంగా విశిష్టత మీకు ఏర్పడగలదు. శారీరకంగా జాగ్రత్త అవసరం. స్త్రీలకు : ఉద్యోగ ప్రగతి, వృత్తియందు పెంపు.

★ **వృశ్చికం :** ఒకానొక వ్యాపార విషయంలో మిత్ర సహాయం, భాగస్థుల సహాయం ఏర్పడుతుంది. ధనలబ్ధికి లోపం లేదుగాని, అంతకంత ఖర్చు. స్త్రీలకు: వస్తువులో, వాహనమో, నగలో, నాణ్యములో కొనుగోలు చేయగలరు.

★ **ధనుస్సు :** ఎలాంటి సమస్య అయినా యిట్టే లాగివేస్తారు. ఎంతో కాలంగా శ్రమించినా చేతికందని ద్రవ్యాన్ని లాక్కోగలుగుతారు. వస్తు వాహన సేకరణకు శుభ ప్రస్తావనలకు అనుకూల వారంగా భావించాలి. స్త్రీలకు: కుటుంబానందం, పదిమందిలో గౌరవ ప్రతిష్ఠల కవకాశం.

★ **మకరం :** మీయింట శుభం జరుగనున్నది. ప్రయాణం అనుకూలం. నూతనాంశాలు గ్రహింప గలుగుతారు. విద్యా వైజ్ఞానికంగా కొంతపెంపు కనిపిస్తుంది. ప్రజారంగాన కూడా మీకు అనుకూలత ఏర్పడగలదు. రాజకీయంగా సాధించిన అనుకూలతను దక్కించుకోవాలి. స్త్రీలకు: సుఖశాంతులు, ఉద్యోగమందభివృద్ధి, స్వల్పాదాయానికి అనుకూలం.

★ **కుంభం :** వ్యవహారం ఏదయినా ఉంటే పరిష్కరింపబడ గలదు. జాయింటు వ్యాపారం ఏ విధంగా మీ కనుకూలించుట లేదని గుర్తించ గలుగుతారు. అప్రయత్నంగా ఆదాయం, ప్రయాణించవలసి రావటం గమనించగలరు. స్త్రీలకు: వస్త్ర సేకరణకు, వ్యాపారరంగానుకూలత చెప్పదగ్గవారం.

★ **మీనం :** ఉత్తర ప్రత్యుత్తరాల మూలాన వ్యాపారరీత్యా ఒడిదుడుకులున్నవని గ్రహిస్తారు. ధనవంతులతో పొత్తు కుదురుతుంది. ధన విషయంగా పెద్దగా శ్రమించవలసిన అగత్యం లేకపోతుంది ఏనాడో పరిష్కరింపబడవలసిన గృహ వ్యవహారం ఈ వారం మీ కనుకూలం స్త్రీలకు వ్యవహార చిక్కులు, ఉద్యోగరీత్యా ఆటంకాలు రాకుండా చూచుకోండి

**–విద్వాన్ కోటు సత్యరంగయ్య శాస్త్రి**




(గత సంచిక తరువాయి)

మొక్కలకు నీళ్ళు పోస్తున్న ఛాయ అప్రయత్నంగా తల పైకెత్తింది. కిటికీలో నుంచి ఆమెనే చూస్తున్నాడు సుధీర్...

చప్పున తల తిప్పేసుకుందామె. అంత క్రితం విజయ చెప్పిన మాటలు గుర్తొచ్చి ఆమె ముఖం ఎర్రబడింది. సుధీర్ తనని ప్రేమిస్తున్నాట్ట. తను అంగీకరిస్తే పెళ్ళి చేసుకుంటాట్ట.

"ఛాయా! నువ్వు అదృష్టవంతురాలివి. అతను మొదట్నుంచీ మాకు తెలుసు. చాలా సంస్కారవంతుడు. కనపడ్డ ప్రతి అందమైన ఆడపిల్ల వెంటపడి ప్రేమ పాఠాలు వల్లించేటంత బలహీనుడుకాదు..." అంటూ అతని గురించి చెప్పింది విజయ.

"అయినా... ఆమెతోనా చెప్పేది? ఆమె ఏమనుకుంటుంది? తల ఎత్తి ఆమె ముఖం చూడాలంటేనే సిగ్గేస్తోంది". ఈ పరిస్థితి కల్పించిన సుధీర్ మీద కోపం పీక వరకూ ఉంది ఛాయకు.

"ఛాయా... మేం వెడుతున్నాం. తలుపేసుకో. అయినా.. నువ్వూ వస్తే బాగుండేదిగదూ?" అన్నది అన్నపూర్ణమ్మ.

"మీరెళ్ళండమ్మా, కాసేపట్లో రాజీవ్ వచ్చేస్తాడుగా. నాకా సినిమాలంటే బోర్." అన్నది ఛాయ.

"ఓహ్! ముసలమ్మగారు సినిమాకి చెక్కేస్తున్నారన్నమాట!" హుషారుగా ఖాళీ బకెట్ తీసుకుని పెరట్లోకొచ్చాడు సుధీర్.

ఛాయ అక్కడ కూర్చుని పేపర్ చదువుకుంటోంది.

"ఈపూట పనికుర్రాడు రాలేదండీ!" అన్నాడతను.

"నేను మిమ్మల్ని సంజాయిషీ అడిగానా?" అన్నదామె.

"కాస్త సరిగ్గా మాట్లాడకూడదాండీ?"

"......"

"ఛాయగారూ..."

"ఏం? మళ్ళీ ఏమయింది?"

"ఆహా! ఏంలేదు. మీరు పేపరు తలకిందులుగా చదువుతారా?!"

అప్పుడు చూసుకుంది ఛాయ. తను పేపర్ తలకిందులుగా పట్టుకుని... చదివేస్తున్నట్లు సీరియస్‌గా నటిస్తోంది.

కొద్దిగా నవ్వొచ్చింది.

**జరిగిన కథ-1:** ఇందుకూరు కాలేజీలో ఛాయకు ఎకనామిక్స్ లెక్చరర్‌గా ఉద్యోగం వచ్చింది. తల్లి అన్నపూర్ణమ్మ, తమ్ముడు రాజీవ్‌తో ఇందుకూరు వచ్చేసింది ఛాయ. సుధీర్ ఛాయ వాళ్ల మేడమీద గదిలో ఉంటుంటాడు. విజయ కుటుంబానికి ఛాయ వాళ్ల కుటుంబానికి సన్నిహితం ఏర్పడుతుంది. సుధీర్ ఛాయను ప్రేమిస్తున్నట్లు గ్రహిస్తుంది విజయ. కాలేజీలో విద్యార్థుల వైఖరిలో మార్పు తేవాలనుకుంటుంది ఛాయ.

ఈ మనసుకు బుద్ధిలేదు. అతన్ని చూడగానే తెలివితక్కువ దానిలా డీలా పడిపోతుంది.

"నేనెలా చదివితే మీకెందుకు?" అని దబాయిద్దామనుకుంది గానీ... మరీ సిల్లీగా ఉంటుందని మానేసింది.

సుధీర్ ఇంకా నీళ్ళు తోడుతూనే ఉన్నాడు.

పాపం! అంతసేపు తోడిపోసినా ఆ బకెట్ నిండటల్లేదు కాబోలు! పోనీ... తనేలేచి లోపలి కెళ్ళొచ్చుగా?

ఉహూఁ! వెళ్ళాలని లేదు.

బకెట్ మొదటిమెట్టు దగ్గర పడేసి ఛాయ దగ్గరగా వెళ్ళాడు సుధీర్.

తడబడుతూ నిలబడిందామె.

"కూర్చోవచ్చా?" అన్నాడతను అల్లరిగా.

"కిందెందుకూ కూర్చోటం? లోపలికొచ్చి కుర్చీలో కూర్చోండి." అంటూ హాల్లోకెళ్ళి కుర్చీ చూపించింది

అతని ముందలా సిగ్గుపడటం, నసగటం ఆమెకే ఎబ్బెట్టుగా అనిపించింది.

అతను కూర్చున్నాక కాఫీ తెచ్చిచ్చింది.

"థాంక్స్! ఈ మాత్రం అభిమానం చూపిస్తారనుకోలేదు." కాఫీ తాగబోతూ అన్నాడు సుధీర్.

"నేనేం అభిమానం చూపించాను?" బింకంగా అన్నది ఛాయ.

"గెటౌట్! అనకుండా...కూచోమన్నారు. కాఫీ ఇచ్చారు. ."

"మీరు నాతోపాటు కింద మెట్లమీద కూర్చుంటాననంటే బాగోదని...సభ్యతకోసం కుర్చీ వేశాను.

కాఫీ...సమయానికి ఉంటే ఎవరికైనా ఇస్తాం."

"పోయిన జన్మలో మనిద్దరం శత్రువులమా?"

"ఈ జన్మలో మిత్రులమా?"

"నేను మిమ్మల్నేం చేశాను ఛాయా? అందరితో సరదాగా బాగానే ఉంటారు. నన్ను చూడగానే మొహం ముడిచేసుకుంటారేం?" అతని కంఠంలో తొణికిన నిష్ఠూరం నిరాశతో మిళితమయి ఆమె మనసును తాకింది.

"మీరు...విజయతో ఎందుకు చెప్పాలి?" అన్నది నెమ్మదిగా ఛాయ.

"మీతో చెపితే ఏమనుకుంటారోనని..."

"నాగురించి నా అనుమతి లేకుండా ఎవరితోనో అలా చెప్పెయ్యటమేనా?"

"మీగురించి చెప్పొనా?"

"అందులో నాప్రసక్తి లేదా?"

"... ... ..."

''ఇలాంటి పిరికి వాళ్ళంటే నాకిష్టముండదు.''

''మరీ అన్యాయంగా మాట్లాడకండి ఛాయా ! డైరెక్ట్‌గా మమ్మల్నే అడిగితే నన్ను రకరకాలుగా అనుమానిస్తారు మీరు. మిమ్మల్ని కించపరచాలనే ఉద్దేశం నాకులేదు. ముందు విజయే ఆ టాపిక్ తీసుకొచ్చింది. నాకు అబద్ధమాడి, ఆత్మవంచన చేసుకోవాలనిపించక... నా ఉద్దేశం చెప్పేశాను.''

''మంచిపని చేశారు.''

''మరింకేం ? ఇంకా ఈ అలకెందుకు ?''

రాజీవ్ రావటంలో ఆ సంభాషణకు బ్రేక్ పడింది.

కొంచెంసేపుండి వెళ్ళిపోయాడు సుధీర్.




''ఏమిటక్కా ! ఎప్పుడూ ఈ బంగాళాదుంపలే ఒండిపడేస్తారూ ?'' కంచంలో కూర చూస్తూ అయిష్టంగా అన్నాడు రాజీవ్.

''ఈ ఊర్లో అవి తప్ప ఇంకేం దొరుకుతాయి ? ఒక పనిచెయ్యి. రేపు నువ్వు మార్కెట్ కెళ్ళి రకరకాల తాజా కూరలు పట్రా. నువ్వలా తెగలిగితే... కాలేజీకి సెలవు పెట్టి నీకవన్నీ ఒండి పెడతాను !'' వెటకారంగా అన్నది ఛాయ.

ఆ కూర తీసి వేరే ప్లేట్లో పడేసి, ఆవకాయా! చారూ వేసుకుని అన్నం తినెళ్ళి ముభావంగా పుస్తకాలు ముందేసుకున్న తమ్ముణ్ణి ఓరగా చూచి నవ్వుకుందామె.

వంటిల్లు సర్దేసి, మంచం తీసుకుని ఆరుబయట వేసుకు పడుకుంది.

వెన్నెల పిండారబోసినట్లు తెల్లగా ఉంది. తారల్ని కనపడనివ్వకుండా ఆకాశమంతా ఏలేస్తున్న చంద్రుణ్ణి తదేకంగా చూస్తోందామె.

కొంపదీసి... సుధీర్ పై నుంచి తననే చూడటల్లేదు గదా ? ఉలిక్కిపడి పైకి చూసింది.

అతను లేడు.

ఆలోచనలు అతన్ని అల్లుకోటం ప్రారంభించాయి.

విజయ మాటల ప్రకారం అతను నైస్ జంటిల్మన్ ! తనకూ అతనంటే అయిష్టం లేదు.

రాజీవ్ చదువు పూర్తయి, ఏదయినా ఉద్యోగం దొరికితే తన బాధ్యత తీరిపోతుంది. అప్పుడే పెళ్ళి.

ఈ విషయం మీద అతనెలా రియాక్టవుతాడో చూడాలి. ఆలోచిస్తూనే నిద్రలోకి జారుకుందామె.

హోటల్‌లో భోజనం చేసొచ్చి, రూం తాళం తియ్యబోతూ డాబా పిట్టగోడ దగ్గరకొచ్చి, కిందికి తొంగి చూశాడు సుధీర్. ఒక పక్కకు ఒరిగి ప్రశాంతంగా నిద్రపోతున్న ఛాయ కనిపించింది.

ఒక వెన్నెల కిరణం ఆమె చెంపమీద పడి తళతళా మెరుస్తోంది. ఒడలో మంచి ఓ పాయ తప్పించుకొచ్చి ఆ నున్నని చెంప మీద ఆడుకుంటోంది...

కొద్దిగా తొలగిన పైట దగ్గర చిక్కుబడ్డట్టుగా ఆగాయతని చూపులు...

అంత చలిలోనూ ఒంట్లో నుంచి తన్నుకొచ్చింది వేడి...







## పడమటి సంధ్యారాగం

ఆమెకు తనంటే ఇష్టమో కాదో తెలుసుకోవాలని తన ప్రయత్నం.

ఆ ఒక్క విషయమూ దాటవెయ్యాలని ఆమె ప్రయత్నం.

ఒక్కటి మాత్రం నిజం.

తనంటే ఆమెకేం కోపంలేదు. ఆ ఆధారం చాలు ఆమె ఇష్టాన్ని సంపాయించుకోటానికి. ఒపికగా ప్రయత్నించి ఆమెను గెల్చుకోవాలి... అనుకున్నాడు సుధీర్.

★ ★ ★

బి.ఎ. ఎగ్జామ్స్ జరుగుతున్నాయి సెకండియర్ వాళ్ళవి. ప్రయివేటు కేండిడేట్స్ కూడా కొందరున్నారు. ఛాయ ఇంటి పక్కనున్న డాబా ఇంట్లో అద్దెకుంటున్న వాళ్ళ అమ్మాయి అనసూయ కూడా ప్రయివేటుగా కట్టి ఎగ్జామ్ రాయటానికొచ్చింది.

ఆ రోజు ఆ రూమ్‌కు ఛాయ ఇన్విజిలేటరు...

అందరికీ క్వశ్చన్ పేపర్పిస్తూ అనసూయ దగ్గర ఆగిపోయింది ఛాయ.

''ఇక్కడ కాపీలు కొట్టటానికి వీల్లేదు. మీరేమైనా స్లిప్పులు తెస్తే ఇచ్చెయ్యండి.'' అన్నది మర్యాదగా, నెమ్మదిగా.

''నా దగ్గర లేవు.'' నిర్భయంగా అన్నది అనసూయ.

''లే వూ ? ''

''లేవు.''

అనసూయ జాకెట్‌లో నుంచి తొంగి చూస్తున్నాయి కొన్ని కాగితపు మడతలు.

''మీలాంటి వారే ఇలా ప్రవర్తిస్తే ఎలా ? మీ దగ్గర కాపీలున్నాయి. ఇటివ్వండి.''

''కావాలంటే చెక్ చేసుకోండి. లేవని నేను చెపుతున్నాను.''

కొద్దిగా ముందుకు ఒంగి అనసూయ జాకెట్‌లో ఉన్న కాగితాన్ని మునివేళ్లతో బయటకు లాగింది ఛాయ.

స్లిప్పులన్నీ కట్టగా బయటకొచ్చాయి...

అవమానంతో కందింది అనసూయ ముఖం. ఆమె కళ్ళలోనుంచి నీళ్ళు జారి డెస్క్‌మీద పడ్డాయి.

విచలితురాలయింది ఛాయ.

''నేను ముందే చెప్పాను. సారీ! ఇట్స్ మై డ్యూటీ!'' అన్నది.

''ఇరుగూ పొరుగూ వాళ్ళం. తెల్లారి లేస్తే ముఖ్మా మొహం చూసుకుంటూ ఉండాల్సిన వాళ్ళం. నా విషయంలోకూడా మీరింత స్ట్రిక్టుగా ఉంటారనుకోలేదు. మీరేకదా అనే ధైర్యంతో తెచ్చాను. ఇంగ్లీషొక్కటే నాకు డౌటు. ఈ సంవత్సరంతో ఒదిలిపోతుందనుకున్నాను.''

అంటూ ఆ సాయంత్రం ఛాయను పట్టుకు దులిపేసింది అనసూయ.

చూసి ఊరుకుంటే ప్రిన్సిపాల్‌తో గొడవ, ఆమె మీద నీ ఇంట్రెస్టేమిటని..

పట్టుకున్నందుకు... ఎదరపడ్డప్పుడల్లా ఆగర్భ శత్రువులా చూస్తుందీవిడ. పట్టుబడ్డ స్టూడెంట్స్ బిహేవియర్ ఇంతకన్నా ఘోరంగా ఉంటోంది.

మనం ఎటువేపు పయనిస్తున్నాం?!

★ ★ ★

కాలేజికి వెళ్ళి ఇంటికి తిరిగి వచ్చిన ఛాయ చెప్పులు విడిచి లోపలి కొస్తూ హాల్లో కూచుని తల్లితో మాట్లాడుతున్న శేఖరాన్ని చూసి ''మామయ్య ఎప్పుడొచ్చావ్ ?'' అన్నది.

''మధ్యాహ్నమొచ్చాడు'' అన్నది అన్నపూర్ణమ్మ.

''సారీ మామయ్యా. ఒస్తున్నట్లు లెటర్ రాయకూడదూ ?'' అన్నది ఛాయ.

''పర్లేదు గానీ స్నానం చేసి రా ఛాయా, అలా బయటకెడదాం.'' అన్నాడు శేఖరం.

''అలాగే.'' అంటూ లోపలికెళ్ళింది ఛాయ.

జడ విప్పి ముడిచుట్టుకుని, చీర కుచ్చెళ్ళు పైకు దోపి, కూని రాగం తీస్తూ, బకెట్‌తో నీళ్ళు పట్టుకెళ్ళి బాత్రూంలో పెట్టుకుని టవల్‌కోసం బయటకొచ్చింది ఛాయ.

''అక్కా... నీకో రహస్యం చెప్పనా ?'' గొంతు తగ్గించి నెమ్మదిగా అన్నాడు రాజీవ్.

''ఏమిట్రా అదీ ?!'' కుతూహలంగా అడిగింది ఛాయ.

''మామయ్య నిన్ను పెళ్ళి చేసుకుంటాట్ట !''

''ఛీ !''

''అమ్మా, ఆయనా మధ్యాహ్నమంతా ఈ సంగతే మాట్లాడుకున్నారు. తలనొప్పిగా ఉంటే క్లాసు ఎగ్గొట్టొచ్చి పడుకుని తీరికగా విన్నాను నేను.''

''బుద్ధిలేకపోతే సరి.''

''ఎవరికి ?''

''వాళ్ళిద్దరికీ.''

''నయం ! నాకేమో అనుకున్నాను.'' అంటూ నవ్వి వెళ్ళిపోయాడు రాజీవ్.

మామయ్య తనను పెళ్ళి చేసుకుంటాడా !

''ఛీ'' మరోసారి కంపరంగా అనుకుని బాత్రూంలోకెళ్ళి గడియ బిగించుకుంది ఛాయ.

# మన శరీరానికి అప్‌కోస్-డి అవసరం

మనం మేలుకొని ఉన్నా, నిద్రావస్థలో ఉన్నా, పని చేస్తున్నా, విశ్రాంతి తీసుకొంటున్నా మన శరీరానికి నిరంతరమైన శక్తి సరఫరా అవసరం. ఈ శక్తి వల్లనే శరీరం తన సాధారణ ఉష్ణోగ్రత నిలిపి ఉంచుకోవడానికి సహాయమవుతుంది. శక్తి సరఫరా లేకుంటే మనం లేమన్నమాటే.

మన శరీరం బంగాళాదుంపలు, గోధుమలు, బియ్యం, బీట్‌రూటు వంటి ఆహార పదార్థాలలోని పిండి పదార్థాన్ని అణువణువులుగా విడగొట్టి చివరికి గ్లూకోజ్‌గా రూపొందిస్తుంది. ఈ గ్లూకోజే రక్తంలోనికి పీల్చుకోబడి శరీరానికి అవసరమైన శక్తి అందడానికి కారణమవుతుంది. ఆహారాన్ని గ్లూకోజ్ కింద మార్చే ప్రక్రియ నిదానమైనది. దీనివల్ల, అనారోగ్యము నరాలవత్తిడి. అలసట వంటి స్థితులలో శరీరానికి అవసరమైన అధిక శక్తి సరఫరా కావలసినంతగా జరగక పోవచ్చు. ఈ సమయాలలో శీఘ్ర శక్తి నిమిత్తం నోటిద్వారా శుద్ధమైన గ్లూకోజ్ రూపంలో శరీరానికి శక్తి అవసరమవుతుంది.

అప్‌కోస్-డి ఇట్టి సమయాలలో అత్యంత శ్రేష్ఠమైనది అప్‌కోస్-డి పిల్లలలోను, పెద్దలలోను కూడా ఖర్చైన శక్తిని తిరిగి అందించడానికి వాడదగినది.

అప్‌కోస్-డి గ్లూకోజ్‌తో బాటుగా ఎముకలకు, నరముల ధాతువుకొరకై కాల్షియం భాస్వరాలను, కాల్షియంను సరిగా ఉపయోగించుకునేందుకై విటమిన్-డిని కూడా అందిస్తుంది

అప్‌కోస్-డి తక్షణ శక్తినిస్తుంది. దీనిని మంచి నీళ్లతోగాని, వేడి లేదా చల్లని పానీయాలతోగాని తీసుకోవచ్చు.

మీకు అదనపు శక్తి, అదీ క్షణంలో కావలసినప్పుడు అప్‌కోస్-డిని గుర్తు తెచ్చుకోండి!

అప్‌కోస్-డి అజంతా ఫార్మా వారి సగర్వ ఉత్పాదన

## అప్‌కోస్-డి®
**(గ్లూకోస్-డి)**

**అప్‌కోస్-డి అంటేనే తక్షణ శక్తి**




ఉత్పాదకులు: ap

**అజంతా ఫార్మా**
**ప్రైవేట్ లిమిటెడ్**

243, కళ్యాణ్‌దాస్ ఉద్యోగ్ భవన్,
వర్లీ, బొంబాయి 400 025






INNOVATION/AP/TEL/10

## సమకాలీన సత్యం

ఉదయమే మేల్కొనే ఉద్వేగంతో
భూమిని చుట్టే వార్తా పత్రికలో
కాస్సేపు తల దూర్చేసి
నీటి బొట్లు రాల్చే కొళాయి ఎదుట
గింజుకుని గీపెట్టే సగటు బతుకు
రోజువారి దినభత్యం పెంచే టెన్షన్‌లో
రోడ్డెక్కే సైకిలుపై
చెమటలు కక్కే శరీర యంత్రం
స్వ సరూప జ్ఞానం లేని వస్తువు
రోడెక్కిన రోడ్డు రోలర్లైనా
రోకట్లో తల దూర్చిన రోకళ్లైనా
మనిషి నడిపించే పరికరాలు
ఇప్పుడు పరాన్నభుక్కుల పరాధీనాలు!

– నిఖిల్

## పడమటి సంధ్యారాగం

"అతనికిద్దరు పిల్లలు, భార్య పోయింది. పెద్దమ్మాయి పెళ్ళీడు కొస్తుంది ఇంకో రెండేళ్ళుపోతే.

తను అతని భార్య కావాలా ? ! దీనికి అమ్మ సపోర్ట్ !

"కట్నం లేందే ఆడపిల్లకు పెళ్ళికాదు. కట్నానికి సరిపడేంత డబ్బు తమదగ్గరలేదు. ఇహరాదు."

ఇది మామయ్యకు తనను పెళ్ళి చేసుకుంటా ననేంత ధైర్యాన్ని కలిగిస్తుంటే...ఇదే అమ్మను భయపెట్టి సరే అనిపిస్తోంది..."

మనసంతా చేదుగా, వికారంగా వుంది ఛాయకు.

ఈ సంగతి ముందే తెలిస్తే తను అతనితో బయటకెళ్ళటానికి ఛస్తే ఒప్పుకునేదికాదు. ఆ మాత్రం ఏకాంతం అతనికి కల్పించేదికాదు. ఇప్పుడు తప్పించు కోటానికి వీల్లేదు.

ఎలా ?

పోనీ...రాజీవ్‌ని తోడుగా రమ్మంటే ?

మామయ్యంటే ఎందుకంత భయపడాలి ?

భయంకాదు, అతని నోటినుంచి వచ్చే ప్రేమ పాఠాలు ఎదుర్కోవాలంటే జుగుప్స !

తను ఆలస్యం చేస్తే రాజీవ్ ఎట్లైనా ఉడాయించేస్తాడు." అనుకుంటూ గబగబా స్నానంచేసి, ఇవతలికొచ్చి "రాజీవ్," అని పిలిచింది ఛాయ.

"లేదు, వాడి ఫ్రెండెవరో వస్తే, అతనితో వెళ్ళాడు." అన్నది అన్నపూర్ణమ్మ.

అనుకున్నంతా అయింది, ఇందాకే చెప్పాల్సింది వాడికి.

వెధవాలోచనలు ! ఒక్కోసారి సమయానికి తట్టిచావవు, ఇప్పుడు తననెవరు రక్షిస్తారు ?

"అమ్మా నేను మామయ్యతో వెళ్ళనే !" అని చిన్నపిల్లలా తల్లికి చెప్పటం సిల్లీగా అనిపించింది ఛాయకు.

హాల్లోకొచ్చి చెప్పులేసుకుని, శేఖరంవేపు "రా!" అన్నట్లు చూసింది.

ఆమెలో ఉత్సాహం ఏ కోశానా లేదు.

ఇద్దరూ రోడ్డుమీద కొచ్చారు. సుధీర్ తమను దాటుకుని ఎటో వెడుతున్నాడు...

ఛాయ ప్రాణం లేచొచ్చింది.

"సుధీర్‌గారూ." ఆమె పిలుపు విని ఆగిపోయి "ఏమిటి?" అన్నాడతను చిరునవ్వుతో.

"అలా షైరెడదాం రండి!" అన్నదామె.

"ష్యూర్!" అని తనూ వాళ్ళతో నడవసాగాడు సుధీర్.

"వీడెవడు పానకంలో పుడకలాగా? ఛాయకసలు బుద్ధిలేదు." చికాగ్గా అనుకున్నాడు శేఖరం.

"ఛాయ తనంతట తనే ఆహ్వానించిందే! మధ్యలో ఈయనెవరు? తామిద్దరే అయితే... ఎంత బావుండేదో!" అనుకుంటున్నాడు సుధీర్.

"ఈయన మా మామయ్య. ఈయన సుధీర్‌గారు. పైన రూంలో ఉంటారు." అంటూ ఒకళ్ళ నొకళ్ళకు పరిచయం చేసింది ఛాయ.

ఇద్దరూ విష్‌చేసుకుంటూ కళ్ళతోనే ఒకరి వేపొకరు అంచనా వేసుకుంటున్నట్లు చూసుకున్నారు...

ఎండిపోయిన వాగులో కొంచందూరం నడిచి, జేబురుమాళ్ళు పరుచుకుని కూర్చున్నారు ముగ్గురూ.

వస్తూ వస్తూ దార్లోకొన్న వేరుశనక్కాయల పొట్లం విప్పి, మధ్యలో పెట్టాడు సుధీర్...

వాళ్ళ నాయనమ్మ పెట్టే ఆవకాయ మొదలుకుని, అంతరిక్ష యాత్రవరకూ... ఎదటివాడికి ఛాన్సివ్వకుండా, కనీసం గుక్కతిప్పు కోనివ్వకుండా మాట్లాడేస్తున్నాడు శేఖరం.

ఛాయతో తను ఏ విషయం మాట్లాడబోయినా... వెంటనే వచ్చి ఆ సంభాషణ నాక్రమించేస్తున్న శేఖరం వేపు ఉక్రోషంగా చూస్తున్నాడు సుధీర్...

"ఛాయగారూ, మనసేమందిరం సినిమావచ్చింది. వెడదామా?" ఇంకోసారి ప్రయత్నిస్తూ అన్నాడు సుధీర్.

ఆమె జవాబు చెప్పేలోగా "ఆ సినిమా రాజమండ్రిలో వంద రోజులాడినప్పుడే మయిందంటే..." అంటూ మొదలెట్టిన శేఖరాన్ని చూసి హతాశుడై, ఇసుకలోనే పక్కకు ఒత్తిగిలి, మోచెయ్యి మడిచి తలకింద పెట్టుకుని మవునంగా పడుకున్నాడతను.

అలాంటి వాళ్ళతో వాగి అలిసి పోవటం కన్నా. . మవునం ఉత్తమమని అప్పుడు తట్టిందతనికి.

ఛాయతో మాట్లాడే అందమైన అవకాశాలు వచ్చినట్లే వచ్చి మాయమై పోవటం నిరాశ కలిగిస్తోంది.

"ఇప్పుడే వస్తాను." అంటూ చెట్ల చాటుకెళ్ళాడు శేఖరం.

చువ్వలా లేచి కూచున్నాడు సుధీర్.

ఛాయ కళ్ళలో కొంటెతనాన్ని రోషంగా చూస్తూ "నిజం చెప్పండి, ఈ 'బోర్' మీరొక్కరూ భరించాల్సొస్తుందని. . సాయం పట్టటానికి లాక్కొచ్చారు గదూ నన్ను?" అన్నాడు.

"నేనంటే అంతఇష్టం అంటారు గదా ! ఈ మాత్రం బోర్ భరించలేరూ ? నా కోసం..." అల్లరిగా నవ్వింది ఛాయ

అతని కళ్ళలోకి కాంతి చెంగున ఎగిరొచ్చింది.

"ఛాయా... మీరు..." అంటుండగానే శేఖరం వచ్చేశాడు.

ఒక్కసారి ఆమె కళ్ళలోకి చూసి, తల తిప్పేసుకుని "ఇహ వెడదాం" అన్నాడు.

"అప్పుడేనా ! మీరెళ్ళండి పోనీ. మేమిద్దరం తరవాతొస్తాం."

అన్నాడు శేఖరం.

"ఒద్దు మామయ్యా, మనం వెడదాం చీకటి పడుతోంది" అంటూ లేచింది ఛాయ

"థాంక్స్" వినీవినిపించనట్లు అన్నాడు సుధీర్

ఆ రాత్రి భోజనాల దగ్గిర ఏ విధమైన ఉపోద్ఘాతం లేకుండా "ఛాయను నేను పెళ్ళి చేసుకుంటాను మీ ఇద్దరి బాధ్యత కూడా నాదే కట్నాలూ కానుకలూ నాకేం అవసరం లేదు" అన్నాడు శేఖరం

"దాన్నడుగు నాదేముంది ?" అన్నది అన్నపూర్ణమ్మ

రాజీవ్ ఓరగా చూస్తున్నాడు అక్కవేపు

"నాకిష్టం లేదు" ఖచ్చితంగా అన్నది ఛాయ

అన్నపూర్ణమ్మ మొహం ముడుచుకుంది అది ఛాయ దృష్టిని దాటిపోలేదు.

"ఇది తన జీవితం ఇందులోకి బలవంతంగా ప్రవేశించి ధ్వంసం చేసే అధికారం ఎవరికీ లేదు చివరకు తల్లినయినా సరే!" దృఢంగా అనుకుందామె

శేఖరానికి తిరస్కారం అవమానంగా ఉంది

"ఎందుకిష్టం లేదు ?" పట్టుదలగా అన్నాడు

"నీ మనసు నడుగు. నేను చెపితే ఇంకా, ఫీలవుతావు" అన్నది ఛాయ

"ఆ సుధీర్‌గాడు చేసుకుంటానన్నాడా? అలాంటి వాళ్ళ మాటలు నమ్మి మోసపోకు కొత్త వందరూపాయల నోటులా ఉన్నాడు అతను నీతో సరదాగా ఆడుకుంటాడేగానీ... పెళ్ళి మాత్రం చేసుకోడు. అంత తేరగా లేరు మగాళ్ళు. కానీ కట్నం లేకుండా ఆడపిల్ల నెవడూ పెళ్ళి చేసుకోడు"

"అతని సంగతి నీకెందుకు ?" విసుగ్గా అన్నది ఛాయ

"ఇప్పుడు తెలిసిరాదు నీకు ముందు ముందు తెలుస్తుంది చేతులు కాలాక ఆకులు పట్టుకున్నా ప్రయోజనముండదు

అక్కయ్యా మేడమీద పెళ్ళికాని కుర్రాడున్న ఇంట్లో ఉండే ముందు నువ్వోసారి ఆలోచించాల్సింది పెద్దదానివి నీ వివేకం ఏమయింది? వాడిని చూస్తూ నన్ను చేసుకోమంటే అది చేసుకుంటుందా?, వాడి ముందు నేను ఆనుతానా దాని కళ్ళకి" అన్నాడు శేఖరం

"మావయ్యా, నీ హద్దుల్లో నువ్వుండు సిగ్గు లేదూ అలా మాట్లాడటానికి? ఏళ్ళు రాగానే సరిగాదు" ఛాయ అలా అనగానే కంచంలో చెయ్యి కడిగేసుకుని, అన్నపూర్ణమ్మ పిలుస్తున్నా వినిపించుకోకుండా సంచీ తీసుకుని అప్పటికప్పుడు వెళ్ళిపోయాడు శేఖరం

"నా పుట్టింటి తరపున వాడొక్కడు మిగిలాడు వాడిని కాస్త నువ్వు సాగనంపావు, నోటికెలావస్తే అలా మాట్లాడటమేనా? పెద్దా చిన్నాలేదా ?" అంటూ ఏడుపు మొదలెట్టింది అన్నపూర్ణమ్మ

భరించలేనంత నిస్సత్తువ ఆవరించింది ఛాయను తనుకూడా చెయ్యి కడిగేసుకుంది

"నువ్వెందుకు అన్నం మానెయ్యటం? నువ్వుతిను" నిష్ఠూరంగా అన్నది అన్నపూర్ణమ్మ

"అంటే ?" తీవ్రంగా అన్నది ఛాయ

"నువ్వు సంపాదన పరురాలివి, మేమంతా నీమీద ఆధారపడి బతుకుతున్న వాళ్ళం అందుకే నువ్వువాడిని అంతేసి మాటలంటున్నా నోరెత్తకుండా పడున్నాను"

రాజీవ్ అక్కడనుంచి ఎప్పుడో వెళ్ళి పోయాడు

తల్లి ఇంత నిర్దయగా ఎలా మాట్లాడ గలుగుతోంది ?

కళ్ళలో నీళ్ళు తిరిగాయి ఛాయకు, ఆ సమయంలో తాను ఒంటరి అనే భావంకు దింపేసిందామెను

"ఆ సుధీర్‌తో కలిసి షికార్లు కొడుతున్నావా ?"

తల్లి ప్రశ్నకు తుళ్ళి పడింది.

"అమ్మా, ఆవేశంలో నువ్వేం మాట్లాడుతున్నావో నీకే తెలీటం


ఇటీవల ఢిల్లీ వనితా సుందరివారు హిమాచల్ భవన్‌లో ఏర్పాటు చేసిన వేదారావు (పార్లమెంటు మాజీ సభ్యుడు) లైబ్రరీ ఛారిటీ ప్రోగ్రాంలో చక్కని శాస్త్రీయ, జానపద నృత్యాలని ప్రదర్శించిన కుమారి తంగిరాల జయశ్రీ

లేదు. ఇలాంటప్పుడు అసలు మాట్లాడుకోకుండా ఉండటం మంచిది ఏమన్నా అంటే 'సంపాదన పరురాలివి', అంటావు

పెద్దవాళ్ళం అనుకోగానే సరికాదు, వివేకం ఉండాలి" అంటూ ఇంకా అక్కడే ఉంటే ఏం వినవలిసొస్తుందో అనే భయంతో గదిలో కెళ్ళి మంచంమీద కళ్ళు మూసుకుని పడుకుంది ఛాయ

ఒకపెద్ద అశ్రుకణం ఆమె కంటి నుంచి జారి, దిండులో పడి ఇంకి పోయింది

ఇది జరిగాక తల్లీ కూతుళ్ళు మూడు రోజులు మాట్లాడుకోలేదు.

తల్లి ఇంత కఠినంగా ప్రవర్తించ గలదని అప్పుడే మొదటిసారిగా అర్థమయింది ఛాయకు తనూ పలకరించలేదు,

[ఇంకావుంది]



**డి. ఎస్. ఎమ్. కాకినాడ.**

ప్రేమిస్తే ఓడి పోతామని తెలిసీ ప్రేమించిన వారి నేమనాలి?

★ ప్రేమించి ఓడినా ఫరవా లేదు–ప్రేమించకుండా వుండడం కంటే– అనుకునే వాళ్ళు – నిజమైన ప్రేమికులు– రోమియో జూలియట్ లైలా మజ్నూలు– ప్రేమలు ఫలిస్తాయనే ప్రేమించుకున్నారా? అనార్కలీ సలీములు తమ కలయిక శాశ్వతం అనుకున్నారా?

**పి. యు. ఎస్. రాయపూర్.**

అక్కా మీకు వలె ప్రశ్నలకు జవాబు చెప్పడానికి ఏమి చదువ వలెను?

★ ఏమీ చదవక్కర లేదు తమ్ముడూ. నీ చుట్టూ ఏం జరుగుతోందో చూస్తూండడం అలవాటు చేసుకోవాలి.

**డి. ఆర్. ఎన్. ఆర్. సూళ్ళూరుపేట.**

నేను రోజూ ఒక అమ్మాయిని చూస్తున్నాను. నేను ప్రేమిస్తున్నానని చెప్పాలని. ఎలా?

★ కాస్త దూరంగా నిలబడి ఆ మాట కాస్తా అనేయండి!

**బి. ఆర్. ఆర్. నారాయణపేట.**

మనసు గొప్పదా? మనసున్న చోట మమత లేదంటా రెందుకు? మీకు మనసుందా కె. ఆర్. గారూ?

★ ఉంది. కాని మీరంటున్నట్లు పిచ్చి పిచ్చి గోల లేదు దాంట్లో. ఉంటే బొత్తిగా ఇది శారదా మీనన్, జయానాగరాజ్ కేసు? అని నిర్ణయించేద్దురు – మా పిల్లలు!




**ఆర్. వి. ఆర్. రాజంపేట.**

. నిద్రించేప్పుడు కలలు ఎలా వస్తాయి?

★ మనసు అంతరాంతరాలలో ఎప్పుడూ మేలుకునే వుంటుంది కదా. దాని ఆలోచనలే కలలనుకోండి.

**జి. ఎస్. ఆర్. పొద్దుటూరు.**

ఆడదాని నడక హంసనడక అంటారే మగవారి నడక?

★ వాళ్ళు కొందరు హుందాగానే నడుస్తారు. మరి కొందరే – బాతుల్లా యీదుతున్నట్లు నడుస్తారు!

**పి. ఎస్. వి. శృంగవరపుకోట.**

మీ జవాబులకు మరొక పేజీ కేటాయిస్తే బాగుండును. అరె అప్పుడే అయిపోయిందే – రామలక్ష్మిగారి పేజీ అనిపిస్తోంది.

★ అలా అనిపిస్తోంది కనుక చదువుతున్నారు! పేజీలు నింపితే ఎవడు చదువుతాడబ్బా! అని తిప్పేస్తారు....'ఇంకాస్త తిందాం అనిపించి నప్పుడే – తినడం మానాలి' అనేవాడు మా పెద మామయ్య. ఇది తిండికి వర్తించకపోయినా – రాతకి వర్తిస్తున్నాను!

**ఎమ్. వి. ఎస్. ఎస్. పి. కాకినాడ.**

తమ యింటికి వచ్చిన అతిథులను పిల్లలు తిట్టి కొట్టి అసహ్యం కల్గించేలా ప్రవర్తిస్తూంటే తల్లి తండ్రులు వారిని మందలించకుండా 'మా వాళ్ళు ఒట్టి అల్లరి వెధవలు అని నవ్వేస్తుంటే – భావి భారత దేశాన్ని ఆ పోరులని తలుచుకుంటూంటే భయంగా వుంది. మీరే మంటారు?

★ 'వాళ్ళుట్టి అల్లరి వెధవలైతే మా సంగతేమిటి' అని అడిగి లేచ్చక్కా వస్తాన్నేను? కాని ఒక్కటి పిల్లలు ఎవరేనా ఉన్నప్పుడు – ఏమీ అనర్థ కదా అన్న ధైర్యంతో కాస్త అల్లరి చేస్తారు. వారిని తల్లితండ్రులు అదుపులో పెట్టి వుంచాలి. అంతేకాదు. పెద్దాళ్ళు కబుర్లు చెప్పుకుంటూన్నప్పుడు పిల్లల్ని బయటికి పంపడం కూడా అలవాటు చేయాలి. పిల్లలు అల్లరి చిల్లరిగా తయారవడానికి సగం కారణం – పెద్దలే – క్రమశిక్షణ అంటే 'తమకు' విసుగ్గా వున్నప్పుడు కసరడం. ముద్దుగా వుంటే నెత్తి కెక్కించుకోవడం అనుకుంటారు! ఇంటి కొచ్చిన వారిప్పై ఎక్కి తొక్కి అల్లరి చేసే స్థితికి వాళ్ళని దించారంటే – నేను తల్లితండ్రులనే – తప్పు పడతాను.

**సి. హెచ్. ఎన్. నిడదవోలు.**

అత్త కోడలు దెబ్బలాడుకొని కోడలు ఆత్మహత్య చేసుకుంటుంది. అత్త ఆత్మహత్య చేసుకోదెందుకు?

★ మీరీ అత్తకోడళ్ళ సంబంధాన్నెందు కిలా వక్రంగా చూస్తారు? బహుశా ఆమెకీ చావాలని పిస్తుందేమో యీ గోలకి. కాని ఒక్కటి ఇద్దరూ కలసి ఆలోచించరు – ఇద్దరూ మామూలు పై వాళ్ళలా ప్రవర్తిస్తే ఒకరినొకరు, ఒకరికొకరు – యివ్వ వలసిన గౌరవం, మర్యాద; చూపవలసిన అభిమానం ఆదరణ చూపిస్తే ఏం పోతుంది? దెప్పడం, ఎత్తి పొడవడం, యిటు తరాల చరిత్రలూ ఆటు తరాల చరిత్రలూ ఎందుకు తిరగేస్తారు – చిన్నమాట వస్తే? దెబ్బలాట– త్వరగా ఆగాలంటే – దెబ్బలాడుకుంటున్న విషయానికి కట్టుబడి వుండాలి. అక్కడితో దాన్ని ఆపి మరిచి పోవాలి... ఇతరుల పట్ల ప్రవర్తన లాగే అత్తా కోడళ్ల ప్రవర్తన ఒకరి పట్ల ఒకరు కల్గి వుంటే – సగం గొడవలు రావు.

**ఎమ్. పి. ఔరంగాబాదు.**

దేవదాసు కుమారుడు అని ఎవరేనా సినిమా తీస్తే నేను నాగేశ్వరరావు కొడుకు వేషం వేస్తాను. నా ఎడ్రసు ప్రచురించండి.

★ ఇది మరీ బాగుంది పిచ్చయ్యా. ఆ వేషం ఎ ఎన్. ఆర్. వేయలేరనా?? అయినా పెళ్ళే చేసుకోని దేవదాసుకి కొడుకుని ఎక్కడి నుంచి తెస్తున్నారు?! □



# ఆటలో గెల్చారు దాహంతో వచ్చారు.




ఇదిగో, ఇక్కడ తయారు
క్రొత్త రెక్స్ ట్రింకా
వారిపై రుచిదే గెలుపు!

మళ్లీ వీరే గెల్చారు!
గుంపులు గుంపులుగా వచ్చారు.
గోల-గోలగా ఇంట్లోకి దూరారు.
సంతోషంతో కేకలు వేశారు. చల్లటి
పానీయం కావాలని అడిగారు. లేత-లేత
ముఖాలు ఎండలో ఆడి-ఆడి కందిపోయాయి.

మరి నేను కూడా వారిని గెలవడానికి సిద్ధంగా
వున్నాగా! క్రొత్త రెక్స్ ట్రింకాతో. ఎందుకంటే
నాకు తెలుసు దాని మధుర రుచి అందరికీ ఇట్టే
నచ్చుతుందని.

అంతేకాదు, రెక్స్ (నా విశ్వాసాన్ని చూరగొన్న
వారు) ఇప్పుడు నాకు కావలసింది ఎంచుకొనే
అనుకూలం కూడా అందించారు.

పౌడర్ ప్యాకెట్—6 పెద్ద గ్లాసుల
పానీయం తయారు చేసుకోడానికై.
క్రొత్త లిక్విడ్ కాంసెంట్రేట్—నిల్వ
చేసుకోడానికి వీలుగా 3 సీసాల సిరప్
తయారు చేయగల్గింది ఇదొక్కటే. 50 పెద్ద
గ్లాసుల పానీయం తయారు చేయడానికై. వీటి
సహాయంతో ఇట్టే చిటికెలో ఒక ట్రే నిండుగా
రుచికరమైన, ఉత్తేజకరమైన, సేదతీర్చే
చల్లటి పానీయం తయారు చేశా. త్రాగినంతనే
పిల్లలు సంతోషం పట్టలేక గెంతులు వేశారు.
'ఇంకా-ఇంకా కావాల'ంటూ కేకలు వేశారు.
ట్రింకా ఇచ్చి నేను సులభంగా గెల్చిపోయా!




లిక్విడ్ కాంసెంట్రేట్—
50 గ్లాసుల
పానీయం తయారు
చేస్తుంది.

పౌడర్ ప్యాక్
విటమిన్ 'సి' తో
సమృద్ధం చేయబడినది.
6 గ్లాసుల
పానీయం తయారు
చేస్తుంది.







REX ®
# ట్రింకా
రుచిలో అన్నిటికన్నా మిన్న!

CLARION/B/CP/2/244 TEL

# పొదుపు

కిశోరి

"కాంతం! నే చెప్పే మాట వింటావా?" ప్రశాంతంగా అన్నాడు సుబ్బారావు. భార్య లక్ష్మీకాంతంతో.

నేను వినవ గాక వినను." విసురుగా అంది పెద్దగొంతుతో కాంతం.

"అది కాదే కాంతం!" భార్యకు నచ్చచెప్ప బోయాడు.

"ఏది కాదండీ?" మాటను సాగదీస్తూ వెక్కిరింతగా అంది.

"పెళ్ళై మూడేళ్ళైనా ఏనాడన్నా ముచ్చటగా మూడొందలు పెట్టి చీరె కొనిచ్చారా నాకు? ముష్ఠి నలభై, ఏభై రూపాయల చీరెలు తప్ప"

"కొనివ్వలేదు ఒప్పుకుంటున్నా ...కానీ... కాంతం... అంత విలువగల సామాన్లు ప్రతి బోనస్ అందుకున్నపుడంతాకొంటున్నా గదటే?" శాంతంగానే అన్నాడు సుబ్బారావు.

"నేనూ సామాన్ల గురించి కాదండీచెప్పేది. చీరె గురించండీ. చీరె గురించి" అంది పెద్దగా.

"ఆహా... నాకు బాగా వినపడుతుంది గాని కాస్త గొంతు తగ్గించి మాట్లాడవే నీకు పుణ్యం వుంటుంది· ఎవరైనా వింటే ఏమను కుంటారూ ?" అతను జనానికి జడిసే మనిషి.




"ఎవరే మనుకుంటే మనకేమిటండీ! మనింట్లో మన యిష్టమొచ్చినట్లు మాట్లాడుకుంటాం. సరే గానీ... ఇంతకూ చీరె..." అంటూ మళ్ళీ చీరె గురించి ఎత్తబోయింది.

"కాంతం! చూడు ఇంతవరకు ఇంటికి అవసరమైన సామాన్లు ప్రతి బోనస్‌కు కొంటూనే వున్నాకదా! ఇక నుంచైనా కాస్త ఆ డబ్బు సేవింగ్ చేసుకుంటే ఎప్పుడైనా అవసరానికి పనికొస్తుందే. ఎవడినీ అప్పడగకుండా."

"ఈసారి బోనస్ వచ్చినపుడలాగే చేద్దురు గాని ఇప్పటికి మాత్రం ఆరు నూరైనా, నూరు ఆరైనా పెద్ద చీరొకటి కొనాల్సిందే" అంటూ ఖచ్చితంగా చెప్పేసింది కాంతం.

"అంతేనంటావా...?" నీరసంగా అన్నాడు సుబ్బారావు.

"అంతే..."

"సరే నీ యిష్టం వచ్చినట్లు చేసుకో. పెద్దలు వూరికే అన్నారా? మొండికేసినదాన్ని మొగుడేమి చేయునని? రచ్చకెక్కిన దాన్ని రాజేమి చేయునని?" అని చిన్నగా తనలో తనే గొణుక్కుంటున్నట్లుగా కుర్చీనుండి లేచాడు సుబ్బారావు.

ఆ మాటలు అతనెంత చిన్నగా గొణిగినా కాంతం చెవిన పడనే పడ్డాయి.

"అంటే ... అంటే ... ఏమిటండీ మీ వుద్దేశం? నేను మీ కంటికి అంత మొండిదానిగా కనిపిస్తున్నానా?" గయ్యిమని లేచేంది.

"ఒసే...ఒసే...కాంతం! ఇదిగో బుద్ధి తక్కువై ఆ మాటన్నాను" అంటూ లెంపలు వేసుకున్నాడు సుబ్బారావు ఆమె నోటికి జడుస్తు.

భర్త అలా చెంపలు వేసుకుంటుంటే మనసులో గర్వంగా నవ్వుకుంటూ వంటింట్లో కడుగుపెట్టింది కాంతం.

"నా ఖర్మ! నేరకపోయి నిన్ను కట్టుకున్నానే ముద్దుగా, బొద్దుగా వున్నావని. మీ అమ్మా, నాన్న నీకు పొరపాటున లక్ష్మీకాంతం అని పెట్టారు సూర్యకాంతం అని పెట్టకుండా." అని మనసులోనే గొణుక్కున్నాడు సుబ్బారావు. బైటికి గొణుక్కుంటే ఆమెకు వినపడుతుందని భయపడి.

అసలు విషయం ఏమిటంటే ఆ రోజు సుబ్బారావుకు బోనస్ వచ్చింది. ప్రతిసారి బోనస్ వచ్చినపుడంతా ఇంటికి అవసరమైన సామాగ్రి తెచ్చేవాడు. ఈసారి నుండి ప్రతి బోనస్ సేవింగ్స్ బ్యాంకులో వేద్దామనుకొని ఆ మాట భార్య చెవిని గూడా వేయాలని వేశాడు. తీరా అది ఇలా అయింది పెళ్ళై ఏడాది తిరక్కముందే అబ్బాయి పుట్టాడు. ఇప్పుడు మళ్ళీ నెల తప్పింది కాంతం. ఇంట్లో ఖర్చులు మాత్రం రోజు రోజుకూ పెరుగుతున్నాయిగాని జీతం మాత్రం పెరగదు కదా! అతనికి ఏ దురలవాట్లూ లేవు గనుక, ఆ సంసారాన్ని పొదుపుగా నెట్టుకొస్తున్నాడు. అప్పు చేయడమంటే అతనికి మహా చెడ్డ చిరాకు. వున్నదాంట్లోనే సర్దుకుపోవాలన్నది అతని తత్వం. ఇంట్లో నాలుగో మెంబరు రాబోతున్నాడని తెలిసి, ముందు జాగ్రత్తగా వచ్చే బోనస్‌నైనా ఆదా చేద్దామని అనుకుంటున్నాడతను. భార్యకీ విషయం ఎంత నచ్చచెప్పాలని చూసినా ఫలితం లేకపోయింది. ఆవిడొక మొండి మనిషి. సుబ్బారావు ఆమెకు భయపడడుగాని ఆమె నోటికి మాత్రం జడుస్తాడు. అంతటి మెతక మనిషతను.

అందుకే మరి నోరెత్తకుండా బోనస్ డబ్బు మొత్తం తెచ్చి భార్య చేతిలో గుమ్మరించాడు. "నీ యిష్టం మొచ్చింది కొనుక్కోమని.' 'దాంతో కాంతం ముఖం చేటంతైంది. సుబ్బారావు డబ్బు ఇవ్వడమేమిటి? ఆమె చీరె కొనక పోవడమేమిటి? ఆ రోజు సాయంత్రమే త్వరగా వంట పని ముగించుకుని పక్కింటావిడతో కలిసి బజారు కెళ్ళింది చంటాడిని సుబ్బారావు కప్పగించి. సుబ్బారావు ఇచ్చిన డబ్బుకన్నా మరో ఇరవై ఎక్కువపెట్టి మాంచి చీరె కొనుక్కొచ్చింది. ఆ ఇరవై పక్కింటామెవద్ద చేబదులు తీసుకుని. ఇంటికి వచ్చీ రావడంతోనే క్రొత్త చీరె చూపించింది కాంతం, సుబ్బారావుకు.

"ఏమండీ! చీరె బాగుందా?" ముద్దుగా అడిగింది.

"వూ..." అంటూ నీరసంగా మూలిగాడు సుబ్బారావు.

"అంత డబ్బు పోసికొన్నాక చీరె బాగుండదా?" అని మనసులో అనుకుంటూ.

"మాట్లాడరేమండీ? మీకు నచ్చలేదంటే నాపసిస్తానులెండి..."

"ఆహా ...హా...న చ్చ క పో వ డ మే మి టి కాంతం! చాలా బాగుంది. ఈ చీరెలో నీవు మరీ బాగుంటావు" అన్నాడు సుబ్బారావు ముఖాన లేని నవ్వు పులుముకొని. డబ్బు ఎలాగూ ఖర్చయి పోయింది ఆమెనైనా సంతోష పెట్టినట్లవుతుందనుకొని.

"మీరా మాట అంటారని నాకుతెలుసండీ? అందుకే పోతే పోయిందని మరో ఇరవై రూపాయలు పక్కింటావిడ వద్ద బదులు తీసుకునికొన్నాను" అంది గోముగా భర్తతో.

"ఆ..." అంటూ నోరు వెళ్ళబెట్టేశాడు సుబ్బారావు.

★ ★ ★

"ఏమండీ! వుదయం మీరాఫీసుకు వెళ్ళినప్పటి నుండి బాబుకు ఒకటే జ్వరం. అక్కడికీ ఇంట్లో ఉండే ట్యాబ్‌లెట్ వేశాను. తగ్గలేదు. ఒకటే మూలుగుతున్నాడు. నాకేమిటో భయంగా వుందండీ!" అంది కాంతం. మధ్యాహ్నం టిఫిన్‌కని ఇంటికి వచ్చిన సుబ్బారావుతో.

"అరె! అంత జ్వరంవస్తే డాక్టరు వద్దకు వెళ్ళకుండా వున్నావా?" అంటూ ఆత్రంగా బట్టలు మార్చుకోబోతున్నవాడల్లా మానేసి ఆత్రంగా బాబును పడుకోబెట్టిన మంచం వద్దకు వెళ్ళి ఒంటిపై చెయ్యివేశాడు. చెయ్యి చురుక్కుమంది. వెంటనే రిక్షా మాట్లాడి ఇద్దరూ కలిసి బాబును డాక్టరు వద్దకు తీసుకెళ్ళారు. ఆయన ఇంజక్షన్ చేసి మందులు వ్రాసిచ్చి అవి ఎలా వాడాలో చెప్పి పదిరూపాయలు ఫీజు పుచ్చుకున్నాడు. పదిరూపాయలు పోయినా ఫరవాలేదు జ్వరం తగ్గితే చాలనుకున్నారిద్దరూ. కాని వారం రోజులకుగాని జ్వరం తగ్గలేదు బాబుకు. ఆ



వారానికే మందులు, ఇంజక్షన్‌లు, డాక్టరుఫీజు, రిక్షా ఛార్జీలు మొత్తం రెండువందలదాకా ఖర్చయింది. అప్పు చేయడమంటే చిరాకుపడే సుబ్బారావు పాపం అప్పు చేయక తప్పలేదు. బాబుకు జ్వరం పూర్తిగా తగ్గాక ఈ విషయమే భార్యతో అన్నాడు.

"చూడు కాంతం! ఆ రోజు బోనస్ డబ్బు బ్యాంక్‌లో దాచుంటే ఈ రోజు సమయానికి అక్కరకు వచ్చేది. అప్పు చేయాల్సిన అవసరం వుండేదికాదు గదా!" అని.

అతనన్న మాటలకు రెండువారాల క్రిందట కొన్న చీరె జ్ఞాపక మొచ్చింది కాంతానికి. ఆ చీరె తెచ్చి పెట్టెలో దాచిందేకాని ఇప్పుడు అవసరానికి పనికి రాలేదు. అదే అతను చెప్పినట్లు బ్యాంక్‌లో దాచుకుని వుంటే అవసరానికి వుపయోగపడేది. "సమయానికి అప్పు దొరికింది. అది దొరక్కపోయివుంటే?" ఈ వూహ రాగానే ఆమె వళ్ళు జలదరించింది.

"నిజమేనండీ! మీరు చెప్పింది ఒప్పుకుంటున్నా. ఇక నుండి సంసారం పొదుపుగా చేసుకుని ఆ అప్పు తీర్చేసి అంతో ఇంతో బ్యాంక్‌లో దాచుకుందాం" అంది కాంతం వడిలో పడుకొని ప్రశాంతంగా నిద్రపోతున్న బాబును హృదయానికి హత్తుకుంటూ.

"అమ్మయ్య!" అంటూ తేలిగ్గా ఓ నిట్టూర్పు విడిచాడు సుబ్బారావు. ఇప్పటికైనా భార్యకు "పొదుపు" అంటే తెలిసొచ్చిందని! □

# ప్రపంచ రికార్డుని సృష్టించిన భారత క్రికెట్ జట్టు!

మనదేశ క్రికెట్ జట్టు గత మూడు ఏళ్ళలో మూడు అంతర్జాతీయ పోటీలలో అఖండ విజయములు పొంది హ్యాట్రిక్ సాధించినది 1983 లో ప్రూడెన్షియల్ కప్ విజయం, గత సంవత్సరం "ఆసియా కప్" గెలుపు, ఇప్పుడు "బెన్సన్ అండ్ హెడ్జ్‌స్" వరల్డ్ ఛాంపియన్‌షిప్ గెల్చి ప్రపంచ క్రికెట్ రంగములో అపూర్వ రికార్డు సృష్టించినది విశ్వ క్రికెట్ రంగ బుద్ధిజీవులు ఆశించినట్లుగా విజయం వెస్టిండీస్‌కు దక్కకుండా మనదేశం కైవసం చేసుకొన్నది. 1983 ప్రూడెన్షియల్, 1985 బెన్సన్ అండ్ హెడ్జ్‌స్ కప్‌లు ఒక్కరోజు ఆటలో మేటి జట్టుగా ఎంచబడు వెస్టిండీస్ గెల్చు అవకాశములు యుండగా మన జట్టు దీక్షగా ఆడ విజయం సాధించినది ఇది మనకు లభించిన యాదృచ్ఛిక గెలుపుకాదు మొదటి పోటీ నుండి ఫైనల్సు వరకు మన జట్టు పాల్గొన్న పోటీలలో సాధించిన విజయాల స్కోరు పరిశీలించిన మన జట్టు సమర్థవంతమైన జట్టు అని నిరూపణ అగును

ఈ పోటీలలో పాల్గొనుటకు ముందు మనదేశము పాల్గొన్న యితర పర్యటనలు, ఇంగ్లాండు జట్టు మనదేశ పర్యటనలో కొంత నిరాశ కలిగించి, యీ పోటీలలో విజయం అనుమానాస్పదమనిపించినది. అందుకు కారణము మనదేశ జట్టు ఒకరోజు ఆటలో ద్వితీయశ్రేణి జట్టుగా భావించబడుట క్రీడారంగములో 'రికార్డు'లు' స్థానములు' అస్థిరమైనవి ఒకప్పుడు హాకీ ఆటలో ప్రపంచ ఆధిపత్యము వహించిన మన జట్టు నేడు స్థాయిలో దిగజారినది. మనదేశ జట్టు విజయము అదృష్టము వరించుట వలన లభించినది అనుట సరికాదు మన జట్టు మొదటి నుండి కలసికట్టుగా, పట్టుదలగా, సమర్థవంతముగా ఆడి గెల్చుపొందినది.

మన జట్టు సాధించిన విజయోత్సవాలతో యావత్తు భారతదేశం పిన్నలు పెద్దలు పాల్గొన్నారు. 1985 భారత క్రికెట్ చరిత్రలో నూతన శకమునకు నాంది పలికినది ఈ ఏడు ప్రపంచ క్రికెట్ రంగములో నూతన ధృవతార తెలుగుబిడ్డ మహమ్మద్ అజారుద్దీన్ మొదటిసారి పాల్గొన్న మూడు టెస్టు పోటీలలో వరుసగా మూడు సెంచరీలు సాధించి ప్రపంచ రికార్డు సృష్టించాడు. ఆస్ట్రేలియాలో-బెన్సన్ అండ్ హెడ్జెస్ వరల్డ్ కప్ సిరీస్‌లో గెల్చి మనదేశం హ్యాట్రిక్ సాధించి మరొక రికార్డు నెలకొల్పినది అంతేగాక యీ పోటీలలో పాల్గొన్న ఉత్తమ క్రీడాకారులందరిలో మన ఆటగాడు అతి ఉత్తమ క్రీడాకారునిగా ఎంపిక అయాడు ప్రపంచ రికార్డులు సృష్టించిన పొట్టివాడు మన జట్టు సారధి సునీల్ గవాస్కర్ ఆఖరిసారిగా సారధ్యము వహించిన జట్టు ప్రపంచ విజేతలగుట అతను సాధించిన విజయాలలో మరొక కలికితురాయి విజయాలు అనేవి ఎంతో శ్రమ, దీక్ష, కలసికట్టుగా సాధించేవి కాని అదృష్టముపై ఆధారపడితే లభించేవికావు గెలుపు పొందినప్పుడు ప్రశంసించుట, ఓటమి పొందినప్పుడు విమర్శించుట

అజరుద్దీన్



సునీల్ గవాస్కర్



మన క్రీడాభిమానులకు పత్రికలకు అలవాటు. ఇది సరికాదు. నిన్నటి వరకు గవాస్కర్‌ను విమర్శించిన వారు నేడు అతని సారథ్యమును కొనియాడు-తున్నారు.

బెన్సన్ అండ్ హెడ్జెస్ కప్ ఒకరోజు పోటీలు 1972 లో ఇంగ్లాండు క్రికెట్‌లో ప్రారంభించబడినవి. 2 వేల పౌనుల విలువగల బంగారు కప్‌నకై జరిగే పోటీలో 17 ప్రథమశ్రేణి ఇంగ్లీషు కౌంటీ జట్లు, ఉత్తర, దక్షిణ మైనర్ కౌంటీస్ నుండి రెండు జట్లు, ఆక్స్‌ఫర్డ్ లేక కేంబ్రిడ్జి నుండి ఒక జట్టు మొత్తం 20 జట్లు పోటీలలో పాల్గొనేవి. పోటీలు నాల్గు జోన్‌లుగా విభజించి 'లీగ్' పద్ధతిన ఆడేవారు. సెమీఫైనల్సు, ఫైనల్సు నాక్ – అవుట్ పద్ధతిలో జరిగేవి. ఫైనలు



కపిల్ దేవ్

పోటీ జులై నెలలో లార్డ్స్‌లో జరిగేది. ఉత్తమ ఆటగానికి బంగారు పతకము లభించేది. విజేతలకు నగదు బహుమతి, యితర పోటీలలో గెల్చిన వారికి బహుమతులు యివ్వబడేవి. కొద్ది కాలములోనే ఎంతో ఆకర్షించబడి ప్రపంచ స్థాయి పోటీగా మారినది.

ప్రపంచ క్రికెట్ అగ్రగామి ఏడు దేశములు పాల్గొన్న యీ పోటీలు పగలు రాత్రి ఆస్ట్రేలియా-లోని మెల్బోర్న్ క్రికెట్ గ్రౌండ్‌లో ఫైనల్సుతో సహా 9 పోటీలు, సిడ్నీ క్రికెట్ గ్రౌండ్‌లో నాలుగు పోటీలు జరిగాయి. ఫిబ్రవరి 17 నుండి మార్చి 10 వరకు జరిగిన యీ పోటీలు పాల్గొన్న 7 జట్లను రెండు పూల్స్‌గా విభజించి లీగ్ పద్ధతిలో నిర్వహించ బడ్డాయి. పూల్ 'ఎ' లో ఆస్ట్రేలియా, ఇంగ్లాండు, ఇండియా, పాకిస్తాన్ ఆడగా, పూల్ 'బి'లో వెస్టిండీస్, న్యూజిలాండ్, శ్రీలంక పాల్గొన్నాయి. పూల్ 'ఎ'లో ఇండియా, పాకిస్తాన్, పూల్ 'బి'లో వెస్టిండీస్, న్యూజిలాండ్‌లు సెమీఫైనల్సుకు చేరాయి. సెమీఫైనల్సులో ఇండియా న్యూజిలాండ్‌పై, పాకిస్తాన్ వెస్టిండీస్‌పై గెల్చి ఫైనలు పోటీ ఆడాయి. మార్చి 10న ఇండియా పాకిస్తాన్‌ను ఓడించి బంగారు కప్ కైవసం చేసుకొన్నది.

## పోటీ ఫలితాలు

ఫిబ్రవరి 17 : ఆస్ట్రేలియా ఇంగ్లాండును ఏడు వికెట్ల తేడాతో ఓడించినది(పూల్'ఎ')

ఫిబ్రవరి 19 : వెస్టిండీస్ న్యూజిలాండ్‌పై విజయం పొందినది (పూల్ 'బి')

ఫిబ్రవరి 20 : ఇండియా పాకిస్తాన్‌ను 6 వికెట్ల తేడాతో ఓడించినది (పూల్'ఎ')

ఫిబ్రవరి 23 : న్యూజిలాండ్ శ్రీలంకపై 51 పరుగుల ఆధిక్యతతో గెల్చినది (పూల్'బి'),

ఫిబ్రవరి 24 : పాకిస్తాన్ ఆస్ట్రేలియాపై 62 పరుగుల ఆధిక్యతతో గెల్చినది (పూల్'ఎ')

ఫిబ్రవరి 26 : ఇండియా ఇంగ్లాండుపై 86 పరుగుల తేడాతో గెల్చినది (పూల్'ఎ')

ఫిబ్రవరి 27 : వెస్టిండీస్ శ్రీలంకను 8 వికెట్ల తేడాతో ఓడించినది (పూల్'బి')

మార్చి 2 : పాకిస్తాన్ ఇంగ్లాండుపై 67 పరుగుల ఆధిక్యతతో గెల్చినది (పూల్'ఎ')

మార్చి 3 : ఆస్ట్రేలియాపై ఇండియా 8 వికెట్ల తేడాతో గెల్చినది (పూల్'ఎ')

## సెమీ ఫైనల్సు

మార్చి 5 : పూల్ 'ఎ' విజేత ఇండియా , పూల్ 'బి' ద్వితీయస్థానము పొందిన న్యూజిలాండ్‌పై 7 వికెట్ల గెలుపుపొందినది.

మార్చి 6 : పూల్ 'ఎ' ద్వితీయస్థానము పొందిన పాకిస్తాన్, పూల్ 'బి' విజేత వెస్టిండీస్‌ను 7 వికెట్ల తేడాతో ఓడించినది.

రవిశాస్త్రి





శ్రీకాంత్

మార్చి 9న తృతీయ, నాల్గవ స్థానములకై సెమీ-ఫైనల్సులో ఓటమి పొందిన జట్ల మధ్య జరిగిన పోటీలో వెస్టిండీస్, న్యూజిలాండ్‌ను 6 వికెట్ల తేడాతో ఓడించి తృతీయస్థానము పొందినది.

## ఫైనల్సు

ఇండియా, పాకిస్తాన్‌ల మధ్య మార్చి 10న ఫైనల్సు పోటీ జరిగినది. ఇదివరలో ఫిబ్రవరి 20న పాకిస్తాన్‌పై మనదేశం లీగ్ పోటీలలో 6 వికెట్ల తేడాతో గెల్చియున్నది. తిరిగి రెండు పొరుగు దేశాలు రెండవసారి ఫైనల్సులో 'ఢీ' కొన్నాయి. పాకిస్తాన్ టాస్ గెల్చి మొదట బ్యాటింగ్‌చేసి 9 వికెట్ల నష్టానికి 48 ఓవర్లలో 176 పరుగులు చేసి అవుటు అయింది. భారత జట్టు యిన్నింగు ప్రారంభించి 2 వికెట్ల నష్టానికి 177 పరుగులు చేసి విజయం సాధించినది. రవిశాస్త్రి 63 పరుగులు, వెంగసర్కార్ 18 పరుగులు నాట్ అవుట్‌గా యున్నారు. బెన్సన్ అండ్ హెడ్జెస్ ప్రపంచ సిరీస్ బంగారు తొడుగుగల కప్ ఇండియా మొదటి ప్రయత్నములోనే గెల్చినది.

## 'మేన్ ఆఫ్ ది మేచ్'

ఫిబ్రవరి 20 న ఇండియా – పాకిస్తాన్ పోటీలో మహమ్మద్ అజరుద్దీన్, ఫిబ్రవరి 26 ఇంగ్లాండుతో ఆడిన పోటీలో శ్రీకాంత్, మార్చి 5 న న్యూజిలాండ్‌తో ఆడిన సెమీఫైనల్సులో రవిశాస్త్రి, మార్చి 10న జరిగిన ఫైనలు పోటీలో శ్రీకాంత్ 'మేన్ ఆఫ్ ది మే చ్'గా ఎం-పికకాబడినారు.

## మేన్ ఆఫ్ ది ఛాంపియన్ షిప్

సిరీస్ ఛాంపియన్ ఆఫ్ ఛాంపియన్‌షిప్ బహుమతి 'ఆడి' కారు రవిశాస్త్రికి లభించినది.

—ముకరమ్.

# ప్రేమించవే మనసా......

అద్దేపల్లి సుచిత్రాదేవి

(గత సంచిక తరువాయి)

వాళ్ళు ఇద్దరూ యిల్లు చేరుకునేసరికి పోర్టికోలో శివశంకరంగారి కారు ఆగి వుంది.

"ఓ, వీళ్ళు కంగారులో ఆఖరుకి అక్కడికీ ఫోన్ చేసినట్లున్నారు!" అనుకున్నాడు విజ్జీ.

సస్య కారు దిగి శిల్పవైపు చూసింది. శిల్ప యింకా అలాగే సీటుపై తలవాల్చి కళ్ళుమూసుకుని ఉంది.

"శిల్పీ" డోరు తీస్తూ పిలిచింది.

శిల్పలో ఏం చలనం లేదు. సస్య అనుమానంగా ముందుకు వంగి తట్టి చూపింది. ఫెయింట్ అయివుంది.

"విజ్జీ!" కంగారుగా పిలిచింది.

కారాగిన శబ్దానికి యింట్లోంచి బయటకు వచ్చిన రజియా, భువనేశ్వరి, శివశంకరంగారు, సత్యనారాయణగారు అంతా ఆదుర్దాగా చూస్తున్నారు.

విజ్జీ దగ్గరకు వెళ్ళి చూసాడు. వెంటనే అర్థం చేసుకున్నాడు. శిల్పని రెండు చేతుల్లోకి అడ్డంగా వేసుకుని యింట్లోకి నడిచాడు. ఆ దృశ్యానికి లోపల్నించి వచ్చిన అందరూ బాగా కంగారు పడిపోయారు.

భువనేశ్వరి దాదాపు ఏడుస్తూ విజ్జీ వైపు వచ్చింది,

"ఏమైంది నా శిల్పకు?" అంటూ.

"కంగారేం లేదు ఆంటీ, కళ్ళు తిరిగినట్లున్నాయి అంతే". ఆమెకు జవాబిస్తూనే లోపలకు వెళ్ళి సోఫాలో పడుకోబెట్టాడు."

**జరిగిన కథ-4 :** భువనేశ్వరి. శివశంకరగార్ల కూతురు శిల్ప ప్రేమించిన శ్యామ్ దూరమవడంతో ఆమె బ్రతుకే చీకటయిపోయింది. ఆమెను ఆ దిగులునుంచి మరిపించేటందుకే సస్య శిల్ప వాళ్ళింట్లోనే నాలుగు రోజులు వుండి తనతో కూడా తనింటికి ఆమెను తీసుకొని వెళ్ళింది. విజ్జీ, సస్య, శిల్ప, సంజయ్, రజియా కలిసి యాదగిరి గుట్టకు వెళ్ళి వచ్చారు. మరునాడు కాఫీ కూడా తాగకుండా స్నానం చేసి ఇప్పుడే వస్తానని చెప్పి కారులో ఒక్కతే ఎక్కడికో వెళ్ళింది. మధ్యాహ్నం ఒంటి గంటయినా ఆమె జాడలేకపోయేటప్పటికి శిల్ప డైరీ చదివితే ఏమైనా విషయం తెలియవచ్చని ఆమె డైరీ చూస్తాడు విజ్జీ. శిల్ప గండిపేటకి వెళ్ళి ఉండొచ్చని ఊహించి వెళ్ళిన విజ్జీ, సస్యలకు రౌడీలు వెంబడిస్తుంటే పరుగెత్తుకొస్తున్న శిల్ప కనపడింది. నిస్త్రాణగా పడిపోయిన శిల్పను ఇంటికి తీసుకు వచ్చారు.

ఫాన్ ఫుల్‌స్పీడ్‌లో పెట్టి, ముఖంపై కాస్త నీళ్ళు చిలకరించారు.

రెండు నిముషాల్లోనే తేరుకుని మెల్లగా కళ్ళు విప్పింది శిల్ప. తన వంకే ఆందోళనగా చూస్తున్న అందరినీ ముందు అర్థం కానట్లు చూసింది. ఆ తర్వాత ఉన్నట్లుండి రెండు చేతుల్లో ముఖంని కప్పుకుని పెద్దగా ఏడవసాగింది.

శివశంకరంగారు కూతురి వైపు నివ్వెరపోయినట్లూ, అసలేం చెయ్యాలో తోచనట్లు చూస్తున్నారు.

భువనేశ్వరి శిల్ప దగ్గరే కూచుని తల నిమురుతూ "శిల్పా, తల్లీ, ఏమిటమ్మా, ఎందుకమ్మా?" అని అడుగుతూనే తనూ కన్నీళ్లు తుడుచుకుంటుంది ఓ చేత్తో.

నిజానికి శామ్సన్ చనిపోయింది మొదలు శిల్ప అంతగా ఏడవటం ఎవ్వరూ చూడలేదు.

విజ్జీ, సస్య ముందుకు వచ్చి స్నేహితురాలి చేతిని తమ చేతుల్లోకి తీసుకున్నారు, "ఆ బాధని తాము పంచుకోలేమా?"

అన్న నిస్సహాయత వారి కన్నుల్లో కనిపిస్తుంది.

అలా వుద్భుతంలా ఓ అయిదు నిముషాలు ఏడ్చిన శిల్ప సొమ్మసిల్లిపోయినట్లు అయి మళ్ళీ నిస్సత్తువుగా తల్లి ఒడిలోకి జారిపోయింది.

విజ్జీ పల్స్ చూసాడు.

"ఆంటీ భయపడవలసిందేమీలేదు. బాగా విశ్రాంతి కావాలి శిల్పకు. ఎక్కువ ఆలోచనల వల్లనే యిదంతా. అందునా ఉదయం నుంచీ ఆహారమేం లేదు కదా!" చెప్పాడు.

ఇంతలో విశాలాక్షి కూడా వచ్చేసింది. "ఏమిటి? ఏం జరిగింది?" అంటూ భువనేశ్వరి ఒడిలో వున్న శిల్పని తనూ పరీక్షించింది.

విజ్జీ చెప్పినదే ఆమె కూడా చెప్పింది.

శిల్పని తీసుకు వెళతామన్నారు భువనేశ్వరీ, శివశంకరంగార్లు.

"ఒద్దు. ఇక్కడే ఉండనివ్వండి. ఇక్కడయితేనే తను కాస్త కోలుకునే అవకాశం నలుగురిలో ఉంటుంది కాబట్టి. అక్కడ ఒంటరిగా కూర్చుని తనలో తను ఆలోచనలోనే ఉంటే ప్రమాదం. ఇక్కడయితే డాక్టరుగారూ దగ్గరే ఉంటారు" సత్యనారాయణగారు చెప్పారు.

"పోనీ మా యింటికి తీసుకెళతాను. నా దగ్గరే ఉంటుంది." విశాలాక్షి అన్నారు.

"ఇక నేనూ అస్తమానం అక్కడే వుండాలి ఆంటీ మీరు ఎదురుగానే ఉంటారుగా. ఇక్కడే ఉండనివ్వండి!" అన్నది సస్య. అందరూ అదే చెప్పటంతో యింకేం మాట్లాడలేకపోయారు శివశంకరంగారు. ఆపూట వాళ్ళూ అక్కడే ఉన్నారు.

★ ★ ★

మరునాటికి శిల్ప మానసికంగా కోలుకుంది కానీ కొద్దిగా జ్వరం వచ్చింది.

శిల్ప దగ్గర కూచుని మాత్ర వేసుకోమని చెపుతున్న సస్య టెలిఫోన్ మోగుతుండటంతో వెళ్ళి తీసింది.

ప్రకాష్ మాట్లాడాడు. "సస్యా, నేనంటూ ఒకడిని వున్నట్లు గుర్తుందా లేక అదీ మరిచిపొయ్యావా?"

"ప్రకాష్. నువ్వేనా అలా మాట్లాడేది?"

"మరి కాకపోతే ఏమిటి? అసలు నువ్వు నాకు కనిపించి ఎన్ని రోజులయింది?"

"నీకు తెలుసుకదా పరిస్థితి" క్రిందటి రోజు జరిగినదంతా క్లుప్తంగా చెప్పింది.

"థాంక్ గాడ్! ఎంత ప్రమాదం తప్పింది!" అనకుండా ఉండలేకపోయాడు కోపం మర్చిపోయి.

''నేను కనిపించి ఎన్నిరోజులైంది అని అడుగుతున్నావు. పోనీ నువ్వు రాకూడదూ?'' సస్య అడిగింది.

''రావాలనే అనుకున్నాను. కానీ మీ పిక్నిక్‌కే నేను పనికిరాలేదు కదా. మరి యిప్పుడు యింటికొస్తే బాగుంటుందా?'' అతని కంఠంలో నిష్ఠూరత.



''సిల్లీగా మాట్లాడకు, ఎప్పుడొస్తున్నావు?'' అడిగింది.

''నువ్వే రమ్మంటే ఎందుకు రాను? యిప్పుడే వస్తున్నా.''

''ఎదురు చూస్తుంటాను'' రిసీవర్ పెట్టేసింది.

ప్రకాష్‌తో అలా మాట్లాడిన తర్వాత మనసంతా తేలిగ్గా అనిపించింది సస్యకు.

అప్రయత్నంగానే అద్దంలో ప్రతిబింబం చూసుకుంది.

నైట్‌బోర్డర్ సిమెంటు కలర్ చీర, అదేరంగు బ్లౌజు. ఆ కలర్ అంత యిష్టం వుండదు ప్రకాష్‌కి.



''డ్రస్ చేంజి చేసుకుంటే?'' అనిపించిందో క్షణం.

''ప్చ్. బాగుండదు. ప్రకాష్ ఫోన్ చేయటం, తను ముస్తాబు అవటం, ఆ వెంటనే అతను రావటం, వదిన బాగా వెక్కిరిస్తుంది!''

ఆ ఆలోచన మానుకుంది.

సస్యనే చూస్తున్న శిల్ప మంచంపై లేచి సరిగా కూర్చుంటూ అడిగింది. ''ప్రకాష్ కదూ మాట్లాడింది?''







## ప్రేమించవే మనసా

''అవును'' అన్నది సస్య.

శిల్ప ''ఆహా!'' అంది అంతే. ఆమె ముఖంలో తను ఎదురు చూసిన భావాలు ఏమీ కనిపించలేదు సస్యకి.

మరో పదిహేను నిముషాలకు కింద స్కూటర్ చప్పుడైంది. ప్రకాష్ రావటమే ముందు సత్యనారాయణగారిని పలుకరిస్తాడు. అసలు అతను ఆయన స్టూడెంటుగానే పరిచయమయ్యాడు.

★ ★ ★

ప్రకాష్‌కి తెలివితేటలు పుష్కలంగా ఉన్నాయి కానీ పై చదువులు చదివించేందుకు వాళ్ళ యింట్లో శక్తి లేదు. ఆ పరిస్థితుల్లో సత్యనారాయణగారే అతనికి సహాయం చేసారు. చేసిన సహాయం అపాత్రదానం కానివ్వకుండా శ్రద్ధగా చదువుకుని యీనాడు మంచి ఉద్యోగంలో స్థిరపడ్డాడు ప్రకాష్.

అతని పట్టుదల, కార్యసాధన అంటే యిష్టం సత్యనారాయణగారికి. అందుకే సస్య, ప్రకాష్ ఒకరంటే ఒకరు యిష్టపడుతున్నారని తెలిసి ఆయన పెళ్ళికి అభ్యంతరం చెప్పలేదు. అంతేకాదు సస్య చక్కని యువకుడిని ఎన్నుకుందని మనసులోనే కూతుర్ని అభినందించారు కూడా.

సస్య ఎమ్. ఏ చదవాలని పట్టుపట్టకపోతే యీ వరకెప్పుడో వారి వివాహం జరిపించేసి వుండేవాళ్ళు. అసలు ప్రకాష్‌కి యిష్టం లేదు సస్య యింకా చదువుతాననటం.

''ఎందుకు నీకు యింకా చదువు సస్యా. నువ్వేమన్నా చదువుకుని ఉద్యోగం చెయ్యాలా ఏమన్నానా ?'' అంటూ అడిగాడోసారి. అప్పుడు వాళ్ళిద్దరి మధ్యా చిన్న వాగ్యుద్ధం జరిగింది.

''ఉద్యోగం చెయ్యాలంటే చదువుండి తీరాలేమో కాని చదువుకున్న వాళ్ళంతా ఉద్యోగాలు చేసే తీరాలా ఏమిటి ? చదువుకునేది విజ్ఞానం కోసం కాకూడదా ?'' అన్నది సస్య.

''బియ్యే చదివావు. ఆ విజ్ఞానం చాలదూ ? ''

''దానికి కూడా ఎల్లలుంటాయా ?''

''ఉండవు. ఇంకేం ఎమ్.ఏ అయిన తర్వాత ఎమ్.ఫిల్ అను ?'' అతనికి కోపం వచ్చింది.

''అంటాను కాబోలు. మధ్యలో నీకెందుకు బాధ ? చదివించేది మా నాన్నగారు. చదువుకునేది నేను !'' కావాలని అతన్ని ఉడకించేందుకు అన్నది సస్య.

'' మధ్యలో నేను ! నయం అంతటితో వదిలావు.'' ప్రకాష్‌కి బాగా కోపం వచ్చేసి అలిగి వెళ్ళిపోయ్యాడు.

ఆ తర్వాత సస్య వెళ్ళి పిలిస్తే కానీ మాట్లాడలేదు. ఆ సంఘటన గుర్తుకువస్తే నవ్వుకుంటూ ఉంటుంది సస్య అతని ఉక్రోషం తలచుకుని.

★ ★ ★

''నమస్తే !'' అంటూ లోపలికొస్తున్న ప్రకాష్‌ని సాదరంగా ఆహ్వానించారు సత్యనారాయణగారు.

''ఈ మధ్య కనిపించటంలేదేం ?'' అడిగారు.

చిన్నగా నవ్వేసాడు ప్రకాష్ ఆ మాటికి అదే సమాధాన మన్నట్లు.

''అమ్మాయ్, రజియా'' కోడల్ని కేకవేసారు ఆయన.

ప్రకాష్ స్కూటరు చూసింది రజియా. అందుకే మామగారి గొంతు వినగానే రెండు కప్పుల్లో కాఫీ తీసుకెళ్ళింది.

''బాగున్నారా అక్కయ్య, ఆరోగ్యం ఎలా వుంది ?'' అడిగాడు నమ్రతగా, కాఫీ అందుకుంటూ.

''బాగుంది.'' స్నేహపూర్వకంగా నవ్వింది.

''శిల్ప యిక్కడే వుందట కదా, చూసివస్తాను'' లేచాడు

''స్కూటర్ శబ్దం వినేవుంటుందిగా, మేడదిగి రాకూడదు కాబోలు రాజకుమారి ?'' సస్యని మనసులోనే ముద్దుగా విసుక్కున్నాడు. అతని బూట్ల చప్పుటికి గుమ్మంలోకి వచ్చింది సస్య.

క్షణకాలం నాలుగుకళ్ళు కలుసుకున్నాయి

నవ్వింది సస్య.

''నీకంతా నవ్వులాట'' చిన్నగా అన్నాడు.

''మొదలు పెట్టకు గొడవ'' అంతకంటే చిన్నగా అన్నది సస్య అతను గదిలోకి వచ్చాడు.

''శిల్పా, ఎలావుంది ఒంటో, ఫీవరుకదా ?'' పలకరించాడు శిల్పని.

''తగ్గిపోయింది'' చూస్తున్న ఫెమినాను పక్కన పెడుతూ అన్నది శిల్ప.

''మీ స్టూడెంట్ల స్ట్రయిక్ ముగిసిందట తెలిసిందా ?'' అడిగాడు.

''అవునట పేపర్లో చూసాను. ఇక రేపట్నుంచి క్లాసులు బుక్స్'

''క్లాసులు, బుక్స్ ? నువు కోరుకున్నవేగా బహుశా యిక నువు మరీ చిన్న కాబోలు !'' కొంచెం ఎత్తిపొడుపుగా అన్నాడు.

'అబ్బా, నీకు ప్రకాష్ అని ఎవరు పేరు పెట్టారో కానీ 'నస' అని పెట్టి వుండాల్సింది'' మనసులోనే అనుకుంది సస్య.

''కాఫీ తేనా ?'' లేవబోయింది.

# రైలు ప్రయాణం

రాంగతి పందిరి

వి. బాబూరాముం






















# ప్రేమించవే మనసా

''థాంక్స్. అక్కయ్య యిచ్చారు'' అన్నాడు.

శిల్ప మళ్ళీ ఫెమినా చేతుల్లోకి తీసుకుంది.

''విజ్జీ బాగున్నాడా ?'' అడిగాడు.

''ఆ, నీపై బాగా కోపం వచ్చిందట చెప్పమన్నాడు.''

''ఎందుకట ?''

''నువ్వు తననికూడా సన్నజాజి తీగ అన్నావుగా అందుకని''

''ఓ,'' పెద్దగా నవ్వేసాడు ప్రకాష్.

ఇంతలో కింద కారు వచ్చి ఆగిన శబ్దము వినిపించింది.

''ఎవరు ?'' ప్రశ్నార్థకంగా చూసాడు.

''శివశంకర్ అంకుల్, ఆంటీ అయివుంటారు'' సస్య చెపుతూ లేచింది.

''నాకు పనుంది. నేనూ యిక వెళతాను'' ప్రకాష్ కూడా లేచాడు.

''శిల్పా, ఆరోగ్యం ముందు జాగ్రత్తగా చూసుకోవాలి. అనవసరంగా ఆలోచిస్తూ కూర్చుంటే పోయినవారు తిరిగి రారుగా, వస్తాను.'' శిల్పతో చెప్పాడు.

శిల్ప ఆ మాటలకి ఒకసారి అతని వంక చూసి తలవంచుకుంది.

''నా చుట్టూ వున్న మీరందరూ యిలా పూర్తిగా అవకాశవాదుల్లా మాట్లాడతారేం ? నా పరిస్థితి మీ కెదురైతే యిప్పుడు మీరు చెపుతున్నట్లే ప్రవర్తిస్తారా ?'' మనసులోని మాటలు పైకనలేదు.

★ ★ ★

సస్య ప్రకాష్‌కు మెట్లెక్కుతూ ఎదురయింది భువనేశ్వరి.

''నమస్తే!'' అన్నాడు ప్రకాష్.

''నువ్వా బాబూ. బాగున్నావా ?'' ఆప్యాయంగా పలకరించింది.

''ఎలా వుంది శిల్పకు ?'' సస్య వైపు చూస్తూ అడిగింది.

''ఫీవర్ తగ్గింది. మీరు శిల్ప దగ్గరకెళ్ళండి ఆంటీ, నేను యిప్పుడే వచ్చేస్తాను.'' ప్రకాష్‌ని అనుసరించింది సస్య.

సస్య, ప్రకాష్‌లని జంటగా చూడగానే హఠాత్తుగా ఓ ఆలోచన వచ్చింది శివశంకరంగారికి.

''అవును అలాగే చేయాలి. అప్పుడే శిల్ప కోలుకుంటుంది''

మనసులో గట్టిగా అనుకున్నారు.

అందరికి వెళ్ళొస్తానని చెప్పేసి వెళ్ళిపోయాడు ప్రకాష్.

శివశంకరగారికి ఓ ఆలోచన అంటూ వస్తే వెంటనే దానిపై సన్నిహితుల అభిప్రాయం తీసుకోవటం, వీలయితే ఆ వెంటనే దాన్ని ఆచరణలో పెట్టటం అలవాటు. అందుకే అప్పటికప్పుడు తన మనసులోని మాట సత్యనారాయణగారితో చెప్పారు.

''ఇప్పుడు... యిలా వుండగా శిల్పకి పెళ్ళి చేస్తారా ?''

పక్కనే వుండి ఆయన మాటలు విన్న సస్య ఉలిక్కిపడింది.

''శిల్పకు పెళ్ళా ? యీ పరిస్థితుల్లోనా ?''

''అవును నారాయణరావుగారు నన్నడగితే యిప్పట్లోనే శిల్పకి పెళ్ళి చెయ్యాలి. అదే సరయిన మందు. అప్పుడే శిల్ప ఆ శాక్‌ని మరిచిపోతుంది. ఒక బొమ్మకోసం ఏడుస్తున్న పసిపిల్లలికి ఆ బొమ్మ స్థానే మరో మంచి బొమ్మనిస్తే యీ బొమ్మ సంగతి మర్చిపోతారు. ప్రేమించామంటారు కానీ వీళ్ళింకా పసి మనస్తత్వాల్లోనే వున్నారు'' నిశ్చయంగా చెప్పారు శివశంకరంగారు.

కానీ మనుషులు బొమ్మలు కాదు. ప్రతి తల్లీ తండ్రీ తమ పిల్లల గురించి తమకు పూర్తిగా తెలుసనే అనుకుంటారు. కానీ వారెప్పుడూ నాణానికి ఒక వైపునే, ఒక కోణం లోంచి చూస్తున్నామని అనుకోరు.

సస్య మెల్లగా మళ్ళీ మేడపై కొచ్చేసింది.

భువనేశ్వరి శిల్ప దగ్గర కూర్చుని కబుర్లు చెపుతూంది.

సస్య గదిలోకి రావటంచూచి ఆమె సస్య వైపు తిరిగింది.

''సస్యా. శిల్పకిప్పుడు బాగానే వుందట. తను లేకపోతే మాకు యిల్లు ఎంతో బోసిగా వుంది. ఇప్పుడే శిల్పని మాతో కూడా తీసుకు వెళదామనుకుంటున్నాను. నువ్వు రారాదూ!''

''నేను మరోసారి వస్తానులే ఆంటీ. స్ట్రయిక్ ముగిసిందిగా. ఇక క్లాసుల కెళ్ళాలి!''

''ఏమిటీ ఏదో డల్‌గా వున్నావు?'' ఇంత క్రితం నవ్వుతూనే వుందిగా ! యింతలోనే ఏమయింది అనుకుంటూ అడిగింది సస్యను పరిశీలిస్తూ భువనేశ్వరి.

''శిల్పను తీసుకు వెళ్ళిపోతానంటున్నారుగా, ఈ మధ్య బాగా అలవాటయిపోయింది ఒకేచోట ఉండటము. ఇప్పుడిక బోర్!'' మామూలుగా నవ్వుతూ అన్నది సస్య.

''అందుకేగదా నిన్నూ రమ్మంటున్నాను'' ఆవిడ నవ్వింది.

''బాగుంది. శిల్ప యిప్పుడు మీ దగ్గరుంది కాబట్టి దాన్ని వదలలేక కావాలనుకుంటే మీతో రాగలను. రేపు అది పెళ్ళిచేసుకుని వెళితే అక్కడకూ వెళ్ళేదా?'' జాగ్రత్తగా శిల్ప ముఖంలోకి చూస్తూ తమాషాగా అన్నట్లు అడిగింది సస్య.

శిల్ప ఒక్క క్షణం బిత్తరపోయినట్లు స్నేహితురాలివంక చూసింది ఆ మాటలకి.

''తను పెళ్ళి చేసుకుంటుందా?'' పక్కనున్న ఫెమినా ముఖానికి అడ్డుపెట్టుకుంది.

భువనేశ్వరి సాలోచనగా తలపంకించిందే కానీ ఏం మాట్లాడలేదు.

ఇంతలో కాఫీకప్పుతో రజియా వచ్చింది గదిలోకి.

అది అందుకుంటూ చిన్నగా మందలించింది భువనేశ్వరి.

''నువ్వెందుకమ్మా రాజీ యీ మెట్లన్నీ ఎక్కుతూ శ్రమ తీసుకోవటం? నేను కిందకి వచ్చేదాన్నిగా. లేకపోతే పనిపిల్లతో పంపక పోయావా?''

''కాస్త ఎక్సర్‌సైజింగ్‌గా వుంటుందికదా ఆంటీ, మరీ కదల కుండా కూర్చుని వుంటే డెలివరీ కష్టమవుతుందని డాక్టర్ ఆంటీకూడా అన్నారు'' నవ్వుతూ అన్నది రజియా పక్కనే వున్న కుర్చీలో కూర్చుంటూ.

''కాస్త అటూ యిటూ తిరుగుతూండ మన్నారని తను మరీ రెస్టే తీసుకోకుండా ఏదో ఒకటి కల్పించుకుని చేస్తూనే వుంటుంది ఆంటీ'' సస్య ఫిర్యాదులాగా చెప్పింది.

''అలవాటు మరి ఏం చేస్తాం ? తిట్టేనోరు, తిరిగే కాలు అనికదా సామెత !''

''అబ్బ, తెలుగు అమ్మాయిలం మాకు కూడా రావు. వదిన కొచ్చినన్ని తెలుగు సామెతలు.''

''ఎంత ఉర్దూ మాట్లాడే వాళ్ళమైనా తెలుగుదేశంలో పెరిగిన దాన్నేగా, తెలుగు బాగా రావటంలో గొప్పేముంది ? అయినా ఎంతో మంది ముస్లింలుకూడా తెలుగు సాహిత్యంలోనూ చోటు చేసుకుని వున్నారు''.

''కోరికవుంటే సాధించలేనిదేం వుంటుంది. అయినా ఓ రచయిత్రి అన్నట్లు భాషలు మనుషుల మధ్య వంతెనలు వేయడానికి వుపయోగపడాలేకాని గోడలు కట్టుకునేందుకు కాదుకదా ?'' భువనేశ్వరి అన్నది.

''నిజమే కాని అది ఎంత మంది గుర్తిస్తారు? భాషలు, మతాలు కులాలు యిలా మనుషులు తమకి తామ వేరుచేసుకుని కలతలు సృష్టించు కోవడమే కదా చూస్తున్నాం ?''

రజియా కంఠం విషాదంగా పలికింది. రజియా సంజయ్‌ని పెళ్ళి చేసుకోవటము వాళ్ళింట్లో ఎవరికి యిష్టం లేదు. తమమాట

వినకపోతే యిక తమయింట మళ్ళీ కాలుపెట్టొద్దన్నారు. తమకు రజియా అనే కూతురు చచ్చి పోయిందనే అనుకుంటాం అన్నారు కచ్చితంగా.

"కన్న కూతురు కనుల ముందే నిక్షేపంగావున్నా చచ్చిపోయిందను కునేంత కఠినత్వమిచ్చిన మి మతాభిమానాన్నే మీరు భద్రంగా కాపాడుకోండి. నేను మనసిచ్చిన వాడి దగ్గరకే వెళ్ళిపోతాను." అని సంజయ్ కోసం ఆ గడపదాటి వచ్చేసింది రజియా ఎంత కాదనుకున్నా మృదువైన మనసు ఆమెది. రక్తసంబంధాలు కాలదన్నుకుంటే వదిలిపోయేవి కావు అనుకుంటుంది కన్నవారు గుర్తుకి వచ్చినపుడు తనలో తానే బాధపడుతుంటుంది. మరలా అంతలోనే తనకు తాను సర్ది చెప్పుకుంటూ వుంటుంది "అనురాగాన్ని పంచి యిచ్చే భర్త, ఆప్యాయంగా చూసుకునే మామగారు, ఆత్మీయతతో దరిచేరే ఆడపడుచు, ఆమె స్నేహితులు, దేనికీ వెతుక్కోనవసరం లేని కలిమి, తనకేం తక్కువ? తనవాళ్ళు తనని కాదనుకున్నప్పుడు తను మాత్రం ఎందుకు బాధపడాలి? ఎందుకు ప్రాకులాడాలి?" అని వూరడించుకుంటుంది ఇప్పుడూ అంతే మతాల ప్రసక్తి వచ్చేసరికి ఆమెకు తన తల్లితండ్రులు గుర్తుకు వచ్చారు.

అది గ్రహించిన భువనేశ్వరి మృదువుగా రజియాపై చేయివేస్తూ అన్నది.

"రాజీ, మీ అమ్మానాన్న గురించేగా అంటున్నావు. నాకు తెలుసమ్మా ముఖ్యంగా మరీ యిలాంటప్పుడు పుట్టింటివారి ఆదరం కోరుకుంటుది స్త్రీ. అయినా నువ్వు వాళ్ళ గురించి మనసులో ఏ దిగులూ పెట్టుకోకూడదు. ఈ సమయంలో ఎప్పుడూ సంతోషంగా ఉండాలి మీ అత్తగారుంటే బహుశా నీకు యీ లోటుకూడా వుండేదికాదు ఇప్పుడు మాత్రమేం మేమంతా లేమూ నీకు ? నువ్వు మీ అమ్మదగ్గర ఏమడుగుతావో అన్నీ నన్ను అడుగు నిర్భయంగా."

ఆ మాటలు వినగానే కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి రజియాకి. ధనవంతులంతా అహంకారులే అనుకుంటారు చాలా మంది. కానీ మంచి చెడూకి ధనానికి సంబంధం వుండదు ! భువనేశ్వరి ఎంత దయగా, ప్రేమగా మాట్లాడింది ?

"ఆంటీ !" అంటూ ఆవిడ భుజంపై వాలిపోయింది రజియా ఇదంతాచూస్తున్న సస్యకు ఎంతో ఆశ్చర్యం వేసింది

"నవ్వుతూ, నవ్విస్తూ మా మధ్య తిరిగే వదిన మనసులోనూ బాధవుందా ?" అనుకోకుండా వుండలేకపోయింది

శిల్ప కయితే ఓ కొత్త నిజం తెలుస్తున్నట్లనిపించింది.

"రజియాకేం ప్రేమించిన వాడినే పెళ్ళి చేసుకుంది హాయిగా వుంది. అనుకునేది ఆమెకూ కొన్ని తీరని కోరికలున్నాయి ఓహ్, ఈ లోకంలో వెతలు, సమస్యలు లేనిదెవరికి ? పాపం. వదిన కన్నవారి ప్రేమ కోసం ఎంత ఆరాటపడుతుందో ?"

ఆ క్షణంలో రజియాని చూస్తుంటే జాలి కలిగింది అప్రయత్నంగానే లేచి వచ్చి రజియా చెయ్యి పట్టుకుంటూ "వదినా!" అంటూ ఎంతో ప్రేమగా పిల్చింది.

కనులు తుడుచుకుని తల ఎత్తి శిల్ప వంక చూసింది రజియా

"వదినా. మమ్మీ అన్నట్లు నువ్వు దేనికీ బాధపడకూడదు ! నీకు మేమంతా లేమూ ?"

రజియాకి చెప్పలేనంత సంతోషం కలిగింది ఆ నిముషాన, ఆ మాటలకు. తన బాధ కూడా మర్చిపోయి శిల్ప మరొకరిని ఓదార్చుతుంది !

"అదే మానవత ! అదే మనిషికి మరో మనిషిపై ఉండవలసిన మమత ! " అనుకుంది.

"మంచి మనసుతో అంత మాటన్నావు చాలు శిల్పా. అయినా తల్లిని కాబోతున్న నేను యింకా పాపాయిలా తల్లీ తండ్రీ కోసం, వారి ప్రేమ లేదే అని బాధపడటం దేనికి ? నిజంగా నేను ఎంతో పుణ్యం చేసుకున్నాను. అందుకే సంజయ్ భార్యగా మనసుకీ మమతకీ విలువనిచ్చే మీ అందరి మధ్యకు రాగలిగాను" మనస్ఫూర్తిగా అన్నదా మాటలు రజియా.

[ఇంకా వుంది]

# ఓ మనిషీ

నిన్ను చూస్తే అంతులేని గర్వం
ఆపుకోలేని ఆనందం
విన్న కొలదీ వినాలని నీ విజయాలు
తలచిన కొలదీ తరగని విషయాలు
నీ సౌందర్యం సౌజన్యం
నీ వినయం ఔన్నత్యం

పట్టరాని దుఃఖం
ఆపుకోలేని కోపం
చూస్తున్న కొలదీ అసహ్యం
అర్థమౌతుంటే అసహనం
నీ కపటం కరుణారాహిత్యం
స్వార్థం అహం విద్వేషం

నువ్వు గుర్తువస్తే
మమకారం, జాలి
నీ అమాయకత్వం అయోమయం
నిలకడలేని రాగాలు
నిలుపుకోలేని మమతలు
నిలువెత్తు అజ్ఞానం
పాపం (!) మనిషి.

— డి. సుజాతాదేవి

# కొత్తమ్మాయి



"ఎక్స్క్యూజిమీ సర్ తియ్యని మృదువైన కంఠం విని లెక్చరర్‌తో సహ అందరూ గుమ్మం వైపు తిరిగి చూసారు

ఎర్రని సిల్కు చీర, మ్యాచింగ్ జాకెట్టు, వాలుగా వదులుగా వేసిన జడలో ఎర్ర గులాబి పసిమి ఛాయ శరీరంతో, నల్లని చిన్నవైనా అందంగా ఉన్న బెదురుతున్న కనులతో, ఉన్న ఆమెను అలాగే చూస్తుండిపోయారు విద్యార్థులు

ఎస్ కమిన్ అన్నాడు లెక్చరర్

ఆమె అడుగులో అడుగేసుకుంటూ సుతి మెత్తగా పాదాలను కదిలిస్తూ ముందు బెంచిలో కూర్చొంది

వెనకాల కాలేజి ప్యూన్ వచ్చి ఆ అమ్మాయి ఈ రోజే క్రొత్తగా అడ్మిట్ అయ్యిందట సార్ జాయిన్ చేసుకోమన్నారు ప్రిన్సిపాల్ అని చెప్పి వెళ్ళి-పోయాడు

ఆమె క్రొత్తగా ఆరోజె అడ్మిట్ అయ్యిందని అందరికి తెలిసింది

అది బి ఎ ఫైనలియర్ క్లాస్

ఆ కొంతసేపటికే ఆమె విద్యార్థుల హృదయాలలో అలజడి రేపింది అందరి చూపులు సుతిమెత్తని ఆమె శరీరం పైననే దృష్టి సారించి ఉన్నాయి

అందరి కనులలో వెలుగు నిండి ఉంది

అందరి మనసులో ఆమె గురించిన ఆలోచనలే నిండిపోయ్యాయి క్రొత్తమ్మాయి ఊహలతో వారు సతమత మవుతున్నారు

ఆమె వేసిన అడుగులు యువకుల హృదయాలపై నడిచినట్లయ్యింది

ముఖ్యంగా రాజు, శర్మ, శ్రీనివాస్, సత్యంలకు అలాగే అనిపించింది వారు నలుగురు ఒకే బెంచిమీద, అదీగాక ముందు కూర్చోవటం వలన క్రొత్తమ్మాయి తాలూకూ శరీర పరిమళం వారిని ఉక్కిరి బిక్కిరి చేసింది

రాంబాబు, గిరిబాబు, అప్పారావు, సుబ్బారావు క్రొత్తమ్మాయి అందాన్ని అణువణువు పరిశీలిస్తున్నారు

ఆడవారిలో ఓ విధమైన అలజడి బయలు దేరింది వారి చూపులు క్రొత్తమ్మాయి డ్రెస్సుపైన ఉంది

క్రొత్తమ్మాయి కూర్చోవటంలో ఒక అందం ఉంది బెంచి క్రిందకు నల్లని త్రాచులా వ్రేళ్లాడుతున్న జడను మృదువుగా వెనక్కి తోసి, సుతారంగా అరచేతిని సన్నని గడ్డానికి ఆనించుకుని కను-రెప్పలను ఆడిస్తూ కూర్చుంది

ఆ భంగిమ అజంతా శిల్పాన్ని గుర్తు తెస్తోంది వారికి

వెనక్కి విసురుగా వచ్చి పడిన జడ క్రిందకు వ్రేలాడుతూ మరింత అందాన్ని చేకూర్చింది ఆమెకి

కొంతసేపటికి లెక్చరర్ పేరడిగాడు

అందరూ చెవులు రిక్కించి విన్నారు

మాలిని అంది నెమ్మదిగా

ఎంత తియ్యని పేరు పేరులో తియ్యదనం, రూపులో కమ్మదనం అనుకున్నారు

తరువాత లెక్చరర్ అడిగినవి కాని, ఆమె చెప్పినవి కాని వారు వినిపించుకోలేక పోయారు

లెక్చరర్ పాఠం చెప్పడం మొదలు పెట్టాడు

కాని విద్యార్థులకు ఆ సమయంలొ పాఠంపై దృష్టి పోయిందని తెలియదు

ఆమె రాక మగవారిలో ఎడారిలో ఒయాసిస్సులా అనిపిస్తే ఆడవారికి అకాల వర్షంగా తోచింది

అందాన్ని తన సొత్తు చేసుకుని, అందానికే ఓ నిర్వచనంగా ఉండి, అందానికే ప్రతిబింబంగా ఉన్న క్రొత్తమ్మాయిను చూసి వారి హృదయాలు ఓ మాదిరిగా విలపించాయి, ఆక్రోశించాయి

సత్యం, శర్మ దూరలోకాల్లో ఊహలతో గడిపేస్తున్నారు

పాఠం పాఠంగానే సాగిపోతోంది

అంతులేని ప్రవాహంగా లెక్చరర్ వాగ్ధాటి సాగిపోతోంది

కంటికి కనపడని కాలం యమస్పీడుగా తరిగి-పోతోంది

కాని ఎవరూ పట్టించుకోవటం లేదు క్రొత్తమ్మాయి రాక వారిలో తియ్యని సంచలనం కల్గించింది

అంతవరకు రకరకాల జంతు ప్రక్రియలలో మిమిక్రీ చేసి పాఠానికి ఆటంకము కల్గిస్తున్న రాంబాబు బృందం నిశ్శబ్దమై పోయింది

ఇదేమి పట్టించుకోని లెక్చరర్ స్టూడెంట్స్ నిశ్శబ్దంగాతన పాఠాన్ని వింటున్నారని ఉత్సాహంతో చెప్పుకుపోతున్నాడు

బెల్ మ్రోగింది

క్లాసులయిపోయాయి లెక్చరర్ వెళ్ళిపోయాడు

క్రొత్తమ్మాయి లేచి కదిలింది నెమ్మదిగా

రాంబాబుకి గుండె కదిలినట్లయ్యింది

అప్పారావు లేవబోయి అడ్డం పడబోతే సుబ్బారావు పట్టుకున్నాడు గట్టిగా

శర్మ క్రింద పడిన కళ్ళజోడుకోసం కంగారుగా వెతుకుతున్నాడు అది ఉంటినే గాని ఎదుటి మనిష కనపడదు – అతనికి

ఆమె నడక కదులుతున్న శిల్పాన్ని గుర్తుచేస్తోంది వారికి

ఆమె తమకి దూరమయ్యేంత వరకు చూస్తూనే ఉన్నారు వారు క్రొత్తమ్మాయి ఇటు చూస్తుందని కళ్ళు కలుపొచ్చని ఆశతో ప్ర లాభం లేకపోయింది ఆమె తలవంచుకుని ఒద్దికగా వయ్యారంగా నడుస్తూ వెళ్ళిపోయింది

కళ్ళముందున్న వెలుగు పోయినట్లయింది వారికి

మనస్సులలో తపన ప్రారంభమయ్యింది.

క్రొత్తమ్మాయి' క్రొత్తమ్మాయిగానే వారి హృదయాలలో నిలచిపోయింది

★ ★ ★ ★

ఆ ఒక్కరోజులోనే అందరు చిత్రంగా మారిపోయారు

అందరి అలంకరణలో క్రొత్త కొత్త రకాలు కన్పిస్తున్నాయి

బట్టలను తలలను నిర్లక్ష్యం చేసే శర్మ రాజు సైతం ఇపుడు నీటుగా శుభ్రంగా వస్తున్నారు కాలేజీకి

శర్మ అయితే తన కళ్ళకున్న సోడాబుడ్డి కళ్ళద్దాలు ఆ మరుసటి రోజే మార్పించేసి తన పాయింటుకు సరిపోయే సరిక్రొత్త మోడల్‌లో క్రొత్తరకం కళ్ళజోడు తీసుకున్నాడు

అతని ఆ మార్పుకు మిగిలిన స్నేహ బృందం ఆశ్చర్యపోయింది ప్రతి రోజు శర్మకి ఎన్నిసార్లు చెప్తుండేవాళ్ళు సోడాబుడ్డి కళ్ళద్దాలు తీసెయ్యిరా బాబు తాతయ్యలా కనిపిస్తున్నావు' అని అయినా శర్మ పట్టించుకునేవాడు కాదు

అట్లాంటిది ఒక్కరోజులో అతను ఏకంగా కళ్ళజోడే మార్చేసి రోజుకంటే మరింతగా డ్రెస్ అయిరావటం అందరిని చకితుల్ని చేసింది

రాంబాబు అయితే సరేసరి అంతవరకు అతను అల్లరి చిల్లరిగా ప్రవర్తించి జులాయి గా పేరు తెచ్చుకొని ఆడవారిని అల్లరి పెట్టేవాడు క్షణకాలంలో బుద్ధిమంతుడిలా మారిపోయాడు

ఇదివరకులా అతను ప్రవర్తించడం మానుకున్నాడు ఇది కాలేజి అందరిని ముఖ్యంగా ఆడవాళ్ళని మరింత ఆశ్చర్యపరిచింది

సుబ్బారావు అప్పారావు అయితే సరేసరి. రోజుకంటె కొంత ఎక్కువగా మేకప్ మొదలెట్టారు.

ఒకరిలోని మార్పు ఒకరు చూసుకుని నవ్వుకునే వారు

కారణం మాత్రం అందరికి తెలుసు పైకి మాత్రం మామూలుగా ఉండేవారు అందరూ

రాంబాబుకు సుబ్బారావుకు పడదు

ఈసారి ఎలక్షన్లలో ఇద్దరూ ప్రెసిడెంట్‌గా పోటీ కూడా చెయ్యదల్చుకున్నారు వారు

వారం రోజులు తిరిగే సరికి అందరిలో మార్పు కొట్టవచ్చినట్లు కనిపిస్తోంది

ప్రతి ఒక్కరు క్రొత్తమ్మాయి దృష్టిలో పడాలని రకరకాల పద్ధతులు అవలంబిస్తూనే ఉన్నారు

ఆమె క్లాస్‌లో అడుగు పెడుతూనే ఎదురు వెళ్ళడం ఆమె ఎదురెదురుగా తిరగడం చూసినపుడు నవ్వడం చెయ్యసాగారు

ఆమె చూసి చూడనట్లు ఉండేది

అనుక్షణం ఆమెని వెన్నాడుతూ ఎంతో ప్రయత్నించే వారు

ధైర్యంచేసి రాంబాబు ఒకసారి పలుకరించాడు ఆమె మామూలుగానే పలుకరించింది ఉబ్బి తబ్బిబ్బు అయ్యాడు రాంబాబు

అతని మనస్సు శరీరము అంతరిక్షంలోకి వెళ్ళిపోయ్యాయి ఒక్కసారిగా ఆ క్షణం తన జీవితం ధన్యమయినట్లు భావించాడతను

ఎన్నో పుస్తకాలు మరెన్నో హాస్య సంచికలు రాత్రింబవళ్ళు తిరగేసి తిరగేసి బాగున్న జోక్స్ ఒకటికి రెండుసార్లు నెమరు వేసుకుని ఆమె ముందు ఎలా చెప్పాలో రిహార్సల్స్ వేసుకుని వాటిని ఆమె ముందు వదిలేవాడు

ఆమె నవ్వేది చిన్నగా మల్లెపువ్వు విచ్చుకుంటున్నట్లు భ్రమపడేవాడు మెలికలు తిరిగిపోయేవాడు

అది చూసి సుబ్బారావుకి పిచ్చి ఆవేశం వచ్చేసేది కాని తమాయించుకునే వాడు

రాంబాబు అంతలోనే ఇంత మారిపోవడం అతనికి ఆశ్చర్యం అసహనం కల్గించింది

అతను విలన్‌లా వెధవ పనులు చేస్తుంటే తను హీరోలా ప్రవర్తించాలనుకునే వాడు కాని కథ అడ్డం తిరిగింది అనుకునేవాడు బాధగా అయినా మునిగిందేమీ లేదు అని అప్పారావు శ్రీను సత్యంలు ప్రోత్సహించారు

తనూ ధైర్యంచేసి ఒకరోజు రాంబాబు కాలేజీకి రాని రోజు ఆమెను చిన్నగా పరిచయం చేసుకున్నాడు ఆమె పలుకరించింది ఫ్రీగా మాట్లాడింది

సుబ్బారావు పొంగిపోయాడు ఆ రోజు స్నేహితులకు పార్టీ కూడా ఇచ్చేశాడు

ఆ రాంబాబు గాడిదేం ఉంది అంతా కోతి బుద్ధులు వెకిలి చేష్టలు ఏదో పాపం మాట్లాడిస్తున్నాడని పలుకరిస్తోంది అంతే తనతో ఎంత తియ్యగా మాట్లాడింది ఎంత చిలిపిగా నవ్వింది తలుచుకొని మరీ పులకరించి పోయేవాడు

ఒకరికి తెలియకుండా ఒకరు ఆమెని ప్రేమించుకుంటున్నా మనుకునే వారు

★ ★ ★ ★

ఒకరికి తెలియకుండా ఒకరు క్రొత్తమ్మాయిని స్వంతం చేసుకోవాలనీ ముందుగా ఆమెను అమితంగా ఆకర్షించాలని తపనపడే వాళ్ళు

ఇద్దరూ తమ తమ చేతిక్రింది మనుషులను ఆమెపై సి ఐ డి లుగా వేశారు వారు అనుక్షణం ఆమెను ఫాలో అయి అష్టకష్టాలు పడి క్రొత్తమ్మాయి అలవాట్లు అభిరుచులు ఇష్టాఇష్టములు తెలుసుకొని ఇద్దరికి వేరు వేరుగా తెలియ జేసేశారు

ఇక తరువాతి రంగానికి సిద్ధపడ్డారు వారు

నెల రోజులలో క్రొత్తమ్మాయి కాలేజీ బ్యూటి గా

సంక్రాంతి'85 సందర్భంగా భోపాల్‌లో ఆంధ్ర సాంస్కృతిక పరిషత్ (భోపాల్) వారి స్వర మాధురి కార్యక్రమంలో పాల్గొన్న కుమారి కె. శిరీష, శ్రీమతి కె. లక్ష్మి, కూర్చున్నవారు శ్రీ ఐ. యస్. రావు(అధ్యక్షులు)గార్లని చిత్రంలో చూడవచ్చు



# 'ఇ'వేమన పద్యాలు







ధనము లేమి కులము తక్కువ పడివచ్చు
ధనము లేమి కీర్తి తరిగిపోవు
ధనము లేమి వలన తగబుద్ధి నియ్యదు
ధనము లేమి ఘనము చప్పు వేమ

మారిపోయింది కాలేజీ గేటు దాటి క్లాస్ రూము చేరేంతవరకు అందరి చూపులు ఆమెపైనే ఉండేవి

రాంబాబు ముందు ప్రేమలేఖ వ్రాయాలనుకున్నాడు అందుకు తెలుగులో కొంచెం పాండిత్యమున్న రాజును ఒ రోజు పట్టుకుని తన బాధ అతనితో చెప్పుకున్నాడు

అది విని రాజు ముందు ఆశ్చర్యపడినా, అసహనంగా మెలికలు తిరిగి చేసేదిలేక సరే నన్నాడు కాని మధ్యలో చిన్న పుల్లేశాడు

ఈ లెటర్లు అవీ ఎందుకు గురు డైరెక్టుగా నువ్వెళ్లి 'ఐ లవ్ యు అంటే పోలా అలా అంటూనే ఆమె చెయ్యి తీసుకుని ముద్దెట్టుకో, ఇక చూడు నీలాంటి అందమైన యువకుడు ఐ లవ్ యు అని

## క్రొత్తమ్మాయి.

అనడమే కాకుండా, చేతిని కూడా ముద్దాడితే ఏ ఆడపిల్లైనా నీ ప్రేమను తిరస్కరించగలదా అని

ఈ మాటలతో అతను పొంగిపోయాడు ఉత్తరం కంటే ముద్దు చాలా మాటుగా తమ ప్రేమకి పునాది వేస్తుందని సమయంకోసం ఎదురు చూడసాగాడు

అవతల సుబ్బారావు అదే ప్రయత్నంలో ఉన్నాడు

క్రొత్తమ్మాయిని తను ప్రేమించానని చెప్పి ఆమె ప్రేమను తను పొందాలని, తరువాత తెలుగు సినిమా హీరోయిన్‌లాగా సినిమాలు, షికార్లు 'ఓహ్' ఒకటేమిటి అన్నిను అనుకొని మురిసి పోయెవాడు తనలో తనే

అయితే తన మనస్సులోని విషయం ఎలా చెప్పడం అన్నది ఓ పెద్ద సమస్యై కూర్చుంది

కాలేజిలో అయితే ఆమెవెంట ఎవరో ఒకరు స్నేహితురాళ్లుంటారు ముఖ్యంగా ఆ రాంబాబుగాడుంటాడు అందువల్ల కుదరదు

ఎలా?

అంతుతెగని ఆలోచన అది

అయితే తరువాత రెండు రోజులు ఆమె క్లాసులకి రాలేదు

మొదటి రోజు 'ఏదోలే' అని సరిపెట్టుకున్నా వరుసగా రెండు రోజులు రాకపోయేసరికి గాభరా పడ్డారు ఇద్దరూ

సాయంకాలం ఆమె నివసించె ఇంటివైపు పచార్లు కూడా చేశారు కాని ఏం ఫలితం కనుపించలేదు వారికి

ఇంతలో ఓ రోజు సత్యం పరుగెత్తుకుంటూ వచ్చి సుబ్రావు సుబ్రావు క్రొత్తమ్మాయి సినిమా కెళుతోంది అన్నాడు

సుబ్బారావు మొఖం వెలిగిపోయింది

ఒక్కతేనా అన్నాడు సంతోషంగా

కావచ్చు హాలు బయట నిలబడివుంది

సుబ్బారావులో వెయ్యి ఏనుగుల శక్తి వచ్చేసింది తను అనుకున్నది జరుగుతోందన్న భావన అతడిని ఉక్కిరి బిక్కిరి చేసేసింది

వెంటనే ముఖం కడుక్కొని శుభ్రంగా టాయిలెట్ అయి టక్ చేసి సత్యం చెప్పిన హాలువైపు బయలుదేరాడు హుషారుగా వెంట సత్యం కూడా ఉన్నాడు

ఇద్దరూ సినిమా హాలు చేరేసరికి ఆమె రాంబాబుతో మాట్లాడుతూ కన్పించింది అది చూసి అంతవరకున్న ఉత్సాహం కాస్త దిగిపోయింది వారిక

నెమ్మదిగా అడుగులేస్తూ వారిని సమీపించారు

దూరంనుంచే వారిని చూసి రాంబాబు మధ్యన వీడొక్కడనుకున్నాడు అతనికి ఆ వార్త శర్మ అందజేశాడు వెంటనే హాజరయ్యాడు ఫుల్ మేకప్‌తో

ఆమె సుబ్బారావుని, సత్యాన్ని పలుకరించింది విధిలేక రాంబాబు వారిని చూసి చిరునవ్వు నవ్వేడు

ఇంతలో 30 సంవత్సరాల యువకుడు ఆమెను హాలు ఆవరణనుంచి చేతో రమ్మని పిలిచాడు టైమ్ అయ్యింది త్వరగా రామాలిని అని

ఆమె వారితో ఓ ఫిలిం ప్రారంభించినట్లున్నారు ఆయన మావారు మీరు ఇంకొంచెం ముందు వచ్చుంటే పరిచయం చేసేదానిని కాని టైమయిపోయింది తర్వాత చేస్తాను వెళ్తాను గబా గబా అనేసి చీర కుచ్చెళ్లు ఎత్తి పట్టుకుని వేళ్లిపోతున్న ఆమె వైపు తెల్లమొఖంతో చూస్తుండి పోయారు

అన్ని రోజులు వారు ఆమె అందంలో పడి మిగిలినవి పట్టించుకోలేదు

చీర లేచిఉండటంవల్ల తెల్లగా మెరుస్తున్న వెండ మట్టెల కాంతి వారి కళ్లపై ప్రతిపలించాయి.

భరించ లేక ముగ్గురూ కళ్లు మూసుకున్నారు □



ఆయన కొత్తగా కొన్నకారుని బయటకి తీస్తున్నాడు. ఆయన అలవాటు ప్రకారం మనగోడకి ఢీ కొట్టిస్తాడేమో?
ఇప్పుడు మనకా భయం లేదే. మన ఇంటిని, గోడని నాగార్జున సిమెంట్ తో కట్టించెంగా
SATYAMURTY-MAM N C



జగపతి ఆర్ట్ పిక్చర్స్

# భార్యాభర్తల బంధం

నిర్మాత-దర్శకుడు **వి.బి.రాజేంద్రప్రసాద్**

సంగీతం. చక్రవర్తి ; కెమెరా. యస్.నవకాంత్, మాటలు-పాటలు ఆత్రేయ

**అన్నపూర్ణ**



"ఊరికి సోగ్గాడు"లో విజయశాంతి, శోభన్‌బాబు



# సినిమా

## 'గుడ్‌బై టార్జాన్ సుందరి" 3–డి చిత్రం

చాలా కాలం తరువాత వేటూరి సుందర రామమూర్తి సంభాషణలు రాస్తున్న చిత్రం టార్జాన్ సుందరిగా ఒక బొంబాయి మోడల్‌ని పరిచయం చేస్తున్నాం ప్రేక్షకులను చకితుల్ని చేసే ఒక చింపాంజీని అమెరికా నుంచి రప్పిస్తున్నాం మైసూర్ కేరళలోని టెక్కడి ప్రాంతాలలో ఏప్రిల్ 27 నుంచి రెండు నెలల పాటు నిర్విరామంగా షూటింగ్ జరిపి ఆగష్టులో విడుదల చేస్తాం మనదేశంలో తొలి 3–డి చిత్రం 'చిన్నారి చేతన చిత్రీకరణలో సహకరించిన థామస్ ఈషా డేవిడ్ స్క్రీమర్ మాకూ తోడ్పడుతారు." అన్నారు జగదీశ్ ఈయన లీనా పిక్చర్స్ సర్క్యూట్ సమర్పణలో వసుందరా

ఎంటర్‌ప్రైసెస్ బానర్‌లో నిర్మించే పై చిత్రానికి సుద జీవన్ కథ స్క్రీన్‌ప్లే సమకూర్చారు వేటూరి మాటలు పాటలు రాశారు ఇళయరాజా సంగీతం నివాస్ ఛాయ పి ఆర్ శేఖర్ కూర్పు కె శేఖర్ శిల్పంతో మురళీ జీవన్ నిర్వహణ బాధ్యతలు వహిస్తున్నారు

## దాసరి రచన, దర్శకత్వంలో తెలుగు చిత్ర కంబైన్స్ చిత్రం

"మార్చి 25 నుండి 31 ఏప్రిల్ 20 నుండి 30 వరకు రెండు షెడ్యూల్ ప్లాన్ చేశాం అన్నారు దాసరి నారాయణరావు ఈయన కథ స్క్రీన్‌ప్లే మాటలు పాటలు దర్శకత్వంతో పాటు ఒక అపురూపమైన పాత్రను నిర్వహించే తెలుగు చిత్ర కంబైన్స్ 4వ చిత్రాన్ని దాసరి పద్మ సమర్పిస్తారు రజని సరసన రమేష్ అనే కొత్త హీరో పరిచయం గావింపబడుతున్నాడు సత్యం సంగీతం శ్రీనివాస రాజు శిల్పం

"పులి"లో



విష కన్య లో స్మిత



# విశేషాలు

-జి. వి. జి.

కృష్ణ కూర్పు డిమిత్రావ్- ఇ ప్రబాకర్ సహ దర్శకత్వంలో రామినేని సాంబశివరావు నిర్మాత

## టి కృష్ణ, సుమన్, విజయశాంతి సమ్మేళనంలో మరో చిత్రం

జూ న్ నుంచి షూటింగ అన్నారు కృష్ణ ఈయన స్క్రీన్ప్లే దర్శకత్వంలో వి ఎ పద్మనాభరెడ్డి పి జె ప్రబాకరరెడ్డి నిర్మించే పద్మప్రబ పిక్చర్స్ చిత్రంలో సుమన్ విజయశాంతి కపిల్‌దేవ్ ఆదిగాగల వారు పాల్గొంటారు ఇళయరాజా సంగీతం ప్రసాద్‌బాబు ఛాయ పి వెంకటేశ్వరరావు కూర్పు తెర వెనుక హంగులు

## "రక్త సిందూరం"

బాద్యత గల యువకుడు గోపీనాద్‌గా సమాజంలో ఎదురయ్యే నిత్య సమస్యలకు స్పందించిన విప్లవ వీరుడు గండ్ర గొడ్డలిగా చిరంజీవి రెండు పాత్రలు దరిస్తున్నారు రాజమండ్రి సెంట్రల్ జైలులో జనవరి 14నుంచి 23 వరకు షూటింగ్ జరిపాం ఆ తర్వాత ఫిబ్రవరి 16 నుంచి 21 వరకు జరిగిన షెడ్యూల్‌తో చిత్రం సగానికి పైగా తయారైంది అన్నారు ఎ కోదండరామిరెడ్డి ఈయన దర్శకత్వంలో ఎ శేషారత్నం నిర్మించే గోపి ఫిలిమ్స్ రక్త సిందూరం చిత్రంలో రాధ నాయిక తక్కిన పాత్రలను గుమ్మడి సత్యనారాయణ నూతన్ ప్రసాద్ వేలు వీరభద్రరావు డాక్టర్ శివప్రసాద్ రాళ్ళపల్లి సుదర్శన్ సూర్యకాంతం అన్నపూర్ణ నిర్వహిస్తున్నారు యండమూరి వీరేంద్రనాద్ కదకు సత్యానంద్ సంబాషణల కర్త 'వేటూరి' గీతాలకు చక్రవర్తి బాణీలు కూర్చారు లోకేసింగ్ ఛాయ కొండపనేని రామలింగేశ్వరరావు శిల్పం చలసాని రామారావు సహ దర్శకత్వం కోటగిరి వెంకటేశ్వరరావు కూర్పు జాస్తి ద్వయం నిర్వహణతో ఎ శేషారత్నం నిర్మాత



'అగ్నిరాజు' లో జయసుధ, కృష్ణంరాజు



రాధ, చిరంజీవి



"అమెరికా అల్లుడు" లో సూర్యకాంతం

## "ఖూనీ"లో మందుభాయి

పోలీస్ స్టేషన్ సెల్‌లో దేవదాసు (మాడా) ఉన్నాడు ఇన్‌స్పెక్టర్ విజయ్ (భానుచందర్) అక్కడికి రావడం చూడగానే ఏమిటి యువరాజా

మనమిప్పుడు నెగెటివ్‌లో లేముకదా? పాజిటివ్‌లో ఉన్నాం అయినా - నేను మంచోణ్ణి కాదు మర్యాదస్తుణ్ణి కాను నన్నెందుకు పోలీస్ స్టేషన్‌కు తీసుకొచ్చారు మహారాజా?

బోస్ రోడ్డులో నువ్వు పగలు రాత్రి తేడా లేకుండా తిరుగుతూంటావ్ కదూ?



చిరంజీవి, భానుప్రియ, 'జ్వాల లో

డార్క్‌రూమ్‌లోకి తీసుకొచ్చారు? అన్నాడు దేవదాసు

నిన్ను డెవలప్ చేయటానికి సూటిగా చూస్తూ అన్నాడు విజయ్

తాగుతూ తిరుగుతూంటాను తిరుగుతూ తాగుతూంటాను తమకేమిటి ఇబ్బంది అధ్యక్షా నాకు తెలీకుండా అర్జంట్‌గా మద్యనిషేధమేమన్నా పెట్టారా? మార్నింగ్ పేపర్ చూళ్ళేదు లెండి

ఆ వీదిలో నెంబర్ సెవెన్ ఇంట్లో ఉంటున్న సావిత్రి నీకు తెలుసుకదూ?



'రక్తసింధూరం లో రాధ

మనకు ఎవరూ తెలీదు ఏమీ తెలీదు ఇంజన్ డౌన్ అయిపోయింది పెట్రోల్ పడితే గాని మందు పని చేయదు మనకు అర్జంట్‌గా మందు కావాలి రాజేంద్రా!

పోలీస్ స్టేషన్‌కు వచ్చి మందడుగుతున్నావ్ ఎన్ని గుండెల్రా నీకు?

నాకెన్ని గుండెలున్నాయో నేనెప్పుడూ లెక్కట్టలేదు గురువర్యా! అయినా మందు కొట్టి నోడ్ని స్టేషన్‌కు తీసుకురావొచ్చు స్టేషన్‌లో ఉన్నోడు మందడగ కూడదా? ఇదేం ధర్మం ధర్మ రాజా?

నీతో ఇప్పుడు లాభం లేదు రేపు చూద్దాం అని బయలుదేరిన విజయ్ వంకే చూస్తూ ముందు మందు పెట్టి హంస పెట్టకు చంద్రబింబా - కాశీలో గోవును చంపినంత పాపం చుట్టుకుంటుంది అన్నాడు దేవదాసు

మణివణ్ణన్ దర్శకత్వం వహించే సాయికిరణ్ మూవీస్ వారి ఖూనీ చిత్రానికి గోగినేనిప్రసాద్ బావనారాయణ నిర్మాతలు

బ్రహ్మముడి లో రజని



## ఎ.ఎన్.ఆర్., సుజాతలతో రాజా సమర్పించే 'ఇంటికి దీపం ఇల్లాలు''

''ఆలుమగల మధ్య ఉండే అనురాగం, అనుబంధాలకు అద్దంపట్టే అపురూపమైన ఇతివృత్తం రెండవ షెడ్యూల్‌ను మార్చి 20 నుంచి '31 వరకు హైదరాబాద్‌లో పూర్తి చేశాం '' అన్నారు జనార్థన్ వల్లభనేని ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో సి హెచ్ వి ఎల్. నర్సమ్మ, నడిపల్లి పద్మ, ఎస్ వి. లక్ష్మి నిర్మించే ఎల్ వి ఆర్ ఎంటర్ ప్రైసెస్ ''ఇంటికి దీపం ఇల్లాలు'' ఎ ఎన్ ఆర్ , సుజాత, గుమ్మడి, గొల్లపూడి మారుతీరావు, వీరభద్రరావు, రమాప్రభ, అనూరాధ, రాజా సరసన 'స్వాతి' అనే నవనాయిక పాత్రధారులు మాటలు, పాటలు గోపి రాశారు చక్రవర్తి సంగీతం, నవకాంత్ ఛాయ, బాబు శిల్పం, కె సత్యం కూర్పుతో ఎస్ వి నరసింహారావు నిర్వాహణ బాధ్యతలు వహిస్తున్నారు ఏప్రిల్‌లో షూటింగ్ పూర్తవుతుంది



''మా పల్లెలో గోపాలుడు''లో రాజా చంద్రిక

## విడుదలకు సిద్ధమవుతోన్న ''అ న్వే ష ణ''

''పక్షుల కిలకిలారావాలపై ప్రయోగాలు చేసే యువతిగా భానుప్రియ నటించింది అలా ప్రయోగాలు జ పుతున్నప్పుడే అడవిలో అను దినమూ కొన్ని భయంకరమైన సంఘటనలను ఎదుర్కోవలసి వస్తుంది అక్కడ ఇన్‌స్పెక్టర్ అమర్, జేమ్స్ పాత్రలలో మురళి, శరత్‌బాబు తారసపడ్తారు ఇది యండమూరి వీరేంద్రనాథ్ రాసిన సస్పెన్స్ థ్రిల్లర్ కథానుగుణంగా ఎక్కువభాగం రాత్రిళ్ళే చిత్రీకరించాం పక్షుల ధ్వనులకు అనుగుణంగా ఇళయరాజా సమకూర్చిన సంగీతం అదనపు ఆకర్షణ,'' అన్నారు వంశీ ఈయన దర్శకత్వంలో కామినేని ప్రసాద్ నిర్మించిన రామ్‌కుమార్ ప్రొడక్షన్స్ 'అన్వేషణ' చిత్రంలో రిటైర్డ్ ఆఫీసర్‌గా సత్యనారాయణ, తక్కిన పాత్రలలో బాలాజీ, రాళ్ళపల్లి, శుభలేఖ సుధాకర్, ధమ్, కృష్ణచైతన్య, లక్ష్మీచిత్ర, వై విజయ, పొన్ని నటించారు వేటూరి గీతాలు, తోట తరిణి శిల్పం, కరమ్‌చంద్ నిర్వహణతో కె చిన్ని సమర్పిస్తున్నారీ చిత్రాన్ని

## సినిమా

### శ్రీ సారథి స్టూడియోస్—ఎ.వి.ఎం. వారి చిత్రం తొలి షెడ్యూల్ పూర్తి

"ఈ చేత చేసినది ఆ చేత అనుభవించక తప్పదంటారు కాని, నేరమొకరిదైతే శిక్ష మరొకరిది అయిన సందర్భాలు కూడా ఉన్నాయన్న విషయం అందరూ ఎరిగినదే ఎవరో చేసిన పాపానికి శిక్ష అనుభవించిన ఒక గృహిణికి, పాపానికి పశ్చాత్తాపంతో ప్రాయశ్చిత్తం పొందిన ఒక దుర్మార్గునికీ మధ్య జరిగిన సంఘర్షణే ఈ విశిష్టమైన ఇతివృత్తం," అన్నారు రేలంగి నరసింహారావు. ఈయన




"నేను పరాయి స్త్రీలను తాకను. అంచేత నాకు హీరోయిన్‌గా మా ఆవిడ్ని తీసుకోండి!

దర్శకత్వంలో ఎం. శరవణన్ సమర్పించే మహిళాభ్యుదయ చిత్రంలో సుహాసిని, చంద్రమోహన్, శరత్‌బాబు, రజని (శశికళ), మురళి, అల్లు రామలింగయ్య, రాళ్ళపల్లి, వేలు, ప్రభృత తారాగణం. ఆత్రేయ మాటలు, పాటలు రాశారు. కె.వి. మహదేవన్ సంగీతం. ఎస్. గోపాల్‌రెడ్డి ఛాయతో ఈ చిత్రాన్ని మన రాష్ట్రంలో పూర్తిగా ఔట్‌డోర్‌లో నిర్మిస్తున్న పి. శశిభూషణ్ "మార్చి 7 నుంచి 18 వరకు తొలి షెడ్యూల్ పూర్తి చేశాం. ఏప్రిల్ 1 నుంచి 15 వరకు జరిగే మలి షెడ్యూల్‌తో షూటింగ్ ఘట్టం ముగుస్తుంది," అని తెలిపారు

శోభన్‌బాబు 'దేవాలయం'లో

# అవి-ఇవి

• అమెరికా అధ్యక్షుడు రీగన్ ఒకప్పుడు సినిమా హీరో అన్న విషయం చాలా మందికి తెలుసు అయితే ఆయన సతీమణి నాన్సీ రీగన్ కూడా సినిమా నటి అని కొందరికి తెలియక పోవొచ్చు ఆ రోజుల్లో ఆమె పేరు నాన్సీ డేవిస్ కథానాయికగా పలు చిత్రాల్లో నటించింది షాడో ఆన్ ది వాల్, ది డాక్టర్ అండ్ ది గర్ల్ హెల్ గేట్స్ ఆఫ్ ది నేవీ చిత్రాలలో రీగన్ సరసన నటించింది

• దిలీప్ కుమార్ త్రిపాత్రలు నిర్వహించిన బైరాగ్ అమితాబ్ బచ్చన్ త్రిపాత్రలు వరించిన మహాన్ చిత్రాలు అపజయం పొందాయి ఐతే రజని కాంత్ త్రిపాత్రలు నిర్వహించిన జాన్ జానీ జనార్ధన్ హిందీ చిత్రం హిట్ అయింది

• తీవ్ర అస్వస్థత నుంచి కోలుకున్న నటుడు దర్శక నిర్మాత మనోజ్ కుమార్ కళ్ళు ఆర్క్ లాంప్ తీక్షణతకు తట్టుకో లేవు గనుక కొంత కాలం పాటు ఆయన చిత్ర నిర్మాణ రంగానికి దూరంగా ఉండవలసి వస్తోంది ఇదే కారణంగా ఒకప్పటి మేటి నటీమణి సాధన నట జీవితానికి స్వస్తి చెప్పింది

• ఇటీవల నటి గాయని సులక్షణా పండిట్ నిద్ర మాత్రలు మోతాదుకు మించి మింగి, ఆస్పత్రి పాలయింది సంజీవ్ కుమార్‌తో తన వివాహం ఎప్పటికప్పుడు వాయిదా పడుతూండడం వల్ల ఆమె విరక్తి చెంది ఈ హత్యకానికి తల పడిందట

• ఆంధీ తుఫాన్ చిత్రం ఔట్‌డోర్ షూటింగ్ కోసం శతృఘ్న సిన్హా ఆ మధ్య ఖాట్మండూ వెళ్ళినప్పుడు అక్కడి నేపాల్ పోలీసుల సంక్షేమనిధికోసం ఏర్పాటు చేయబడిన సంగీత కార్యక్రమంలో ఓ పదేళ్ళ బాలుని మధుర గానానికి ముగ్ధుడై ఆ అబ్బాయిని తనతో బొంబాయికి తీసుకొచ్చి తన కవలపిల్లలతో పాటు పెంచుకుంటున్నాడట

• ఇన్‌కమ్ టాక్స్ డిపార్ట్‌మెంట్‌లో కొత్తగా చేరిన వారికి శిక్షణ ఇవ్వడానికి ముందుగా మా ఇంటి మీదికి దాడి చేయిస్తుంటారు ఇలా నా ఇల్లు ఆదాయపు పన్ను శాఖవారికి శిక్షణ కేంద్రం అయిపోయింది ఈ జోక్ వేసింది రాజేష్ ఖన్నా

• అమితాబ్ బచ్చన్ బెంగళూరు అలంకార్ థియేటర్ ప్రాంతంలో చాలా పెద్ద స్థలాన్ని కొన్నారు అక్కడ షాపింగ్ కాంప్లెక్స్‌ను కట్టిస్తారట

• జాకీ ష్రాఫ్ నటించిన తొలి చిత్రం హీరో కొన్ని చోట్ల ఏడాదికి పైగా ప్రదర్శింపబడింది ఇతను సెట్‌లో అందరితోనూ చాలా చనువుగా ఉంటూం టాడట లైట్‌బాయ్స్ తాగుతూన్న బీడీని అడిగి తీసుకుని నాలుగు దమ్ములు లాగి తిరిగి ఇచ్చేస్తూంటాడట ఆటోగ్రాఫ్స్ కోసం వచ్చే యువతుల పేర్లు అడిగి తెలుసుకుని ఆ పేర్లు రాసి వాటికింద ఆ అమ్మాయిల అందచందాలను వర్ణిస్తూ సంతకం పెడతాడట

• మన దేశంలో అలహాబాద్‌లోని పాలెస్ థియేటర్ ఒక్కచోటనే బుక్కింగ్ ఆఫీస్ నాలుగు గోడల మధ్యకాక లాబీలో బహిరంగంగా టిక్కెట్లు అమ్మబడుతూంటాయి ఇందువల్ల బ్లాక్ మార్కెటింగ్ జరగడానికి వీలవదని కొందరి అభిప్రాయం

• రచయితలు సలీమ్-జావేద్‌లు విడిపోయాక ఇప్పటికి డిమాండ్ తగ్గిపోయింది మళ్ళి మిత్రులై కలిసి రచనలు చేయడానికి ప్రయత్నిస్తున్నారట

• ఇటీవల ఢిల్లీ చలన చిత్రోత్సవానికి ఒక్కరిగా వెళ్ళడానికి ముందు రచయిత జావేద్‌ను పెళ్ళాడిన షబానా ఆజ్మీ అంజుమాన్ చిత్రంలో నాలుగు పాటలు పాడింది జావేద్ మొదటి భార్య హనీ ఇరానీ

(జి ఎ జి)






# వివిధ భారతీయ భాషా చిత్రాల సమ్మేళనం ఇండియన్ పనోరమ - 85

భారత దేశంలో ప్రతి సంవత్సరమూ జరిగే అంతర్జాతీయ చలన చిత్రోత్సవాల్లో ఒక ఆసక్తికరమైన విభాగం– ఇండియన్ పనోరమ. వివిధ భారతీయ భాషల్లో ఒక సంవత్సర కాలంలో నిర్మించబడిన వందలాది చిత్రాల్లో కథా కథనంలో వైవిధ్యాన్ని కళాత్మక విలువల్ని ప్రతిబింబించే చిత్రాలను ఎన్నిక చేసి చిత్రోత్సవాలకు హాజరయ్యే దేశ విదేశీ ప్రతినిధులకూ, పత్రికల వారికి ఇంగ్లీష్ సబ్ టైటిల్‌తో 'ఇండియన్ పనోరమ' పేరిట ఒక ప్రత్యేకమైన విభాగంగా ప్రదర్శించే ఈ సంప్రదాయం తొలుత 1978లో మద్రాసులో జరిగిన ఫిల్మోత్సవ్–**78తో** ప్రారంభమై ఎన్నో చిత్రాల్ని, ఎందరో దర్శకుల్ని వెలుగులోకి తెచ్చింది.

ఈ సంవత్సర మారంభంలో జనవరి 3 నుంచి 17 వరకు న్యూఢిల్లీలో జరిగిన 'పదవ అంతర్జాతీయ చిత్రోత్సవం' లో ఒక విభాగంగా నిర్వహించిన 'ఇండియన్ పనోరమ' విభాగంలో కూడా 1984వ సంవత్సరంలో నిర్మించిన వివిధ భారతీయ భాషా చిత్రాల్లో 21 చిత్రాలను ఎన్నిక చేసి ప్రదర్శించారు. ఈ 21 చిత్రాలలో పది హిందీ చిత్రాలు, (ఉత్సవ్, తరంగ్, సారాంష్, పార్టీ, ఫార్, మోహన్ జోషీ హాజిర్‌హో, హోళీ, హిప్ హిప్ హుర్రే, అన్‌కహీ, అంధీగల్లీ) . అయిదు మలయాళ చిత్రాలు (ముఖాముఖం, అడమింటె వరిమెల్లు, కన మరయతు, కట్టాతె కిళిక్కూడు, మలముకలిలె దైవం), రెండు తెలుగు చిత్రాలు (స్వాతి, సితార), ఒక తమిళ చిత్రం (అచ్చమిల్లై అచ్చమిల్లై) ఒక వంగ చిత్రం (కోనీ) ఒక ఒరియా చిత్రం (నీరబ్ ఝూ ఉం) ఖాసీ భాషలో నిర్మించిన తొలి చిత్రం (మానిక్ రైతాంగ్) ఉన్నాయి. ఆశ్చర్యకరమైన విషయ మేమిటంటె వంశవృక్ష, కాడు, జోమనదుడి, ఘటశ్రాద్ధ, తదితర చిత్రాలతో భారతీయ సినిమా ముందు భాగాన నిలబడిన కన్నడ సినిమారంగం నుంచి ఒక్క చిత్రం కూడా పనోరమలో పాల్గొన లేదు. అలాగే గుజరాతీ, మరాఠీ, పంజాబీ భాషల నుంచి ఒక్క చిత్రం కూడా ఎన్నిక కాలేదు. అయితే ఇక్కడ గమనించ వలసిన విషయమేమిటంటే చాలామంది దర్శకులూ నిర్మాతలూ ప్రాంతీయ భాషల్లో కంటే హిందీలోనే చిత్రాలు నిర్మించడానికి ఎక్కువ ప్రాధాన్యత యిస్తున్నారు. తొలుత తెలుగులోనూ (మా భూమి) ఆ తరువాత బెంగాలీలోనూ (దఖల్) తీసిన గౌతమ్ ఘోష్ ఈ సంవత్సరం హిందీలో (పార్) చిత్రం నిర్మించాడు. ఈ సంవత్సరం హిందీలోనే తీసిన మరో వంగ దర్శకుడు బుద్ధదేవ్ దాస్ గుప్తా, కన్నడ న్యూ సినిమా ఉద్యమ కర్తలలో ఒకరయిన గిరీష్

తమిళచిత్రం ''అచ్చమిల్లై అచ్చమిల్లై''లో ఒక దృశ్యం



కేర్నాడ్‌లతో పాటు కేతన్ మెహతా, అమోల్ పలేకర్ కూడా ఈ సంవత్సరం హిందీ సినిమాలే తీసారు ఇందుకు కారణం హిందీ చిత్రాలకి భారత దేశమంతటా ప్రదర్శించడానికి అవకాశాలుండడమే

రెండు పదులకు మించిన ఈ చిత్రాల్లో కథా కథనం శైలీ శిల్పం విషయాల్లో ఎంతో వైవిధ్యం కనిపించింది ఒక్క ఉత్సవ్ చిత్రం మినహాయిస్తే మిగిలిన చిత్రాల్లో చాలా చిత్రాలు సమకాలీన భారతీయ జన జీవితాన్ని ప్రతిబింబించ డానికి ప్రయత్నించినవే జీవితంలో వాస్తవాలకి విలువలకి మధ్య తప్పని సరిగా ఎదురయ్యే సంఘర్షణని కొన్ని చిత్రాలు ప్రత్యేకంగా ఎత్తి చూపాయి ప్రేమానురాగాలు స్త్రీ స్వాతంత్ర్యం ప్రధాన కథా వస్తువుగా నిర్మించిన చిత్రాలతో బాటు క్రీడలు రాజకీయాలు హరిజన కూలీలపై ధన స్వామ్యం చేసే దోపిడీ దాని విపరీత పరిణామాలు మూఢ నమ్మకాలు తెచ్చే దుష్ఫలితాలు చిత్రించిన చిత్రాలు కూడా ఉన్నాయి ఉత్సవ్ చిత్రం శూద్రకుడి సంస్కృత నాటకం మృచ్ఛకటికం ఆదారంగా నిర్మించ బడింది

ఇండియన్ మనోరమలో ప్రదర్శించిన దక్షిణ భాషా చిత్రాల్లో మనకందరికీ సుపరిచితమైన స్వాతి సితార చిత్రాలు మినహాయిస్తే ప్రధానంగా చెప్పుకోవలసిన చిత్రాలు – బాలచందర్ అచ్చమిల్లై అచ్చమిల్లై (తమిళం) అదూర్ గోపాలకృష్ణన్ ముఖా ముఖం (మలయాళం) జార్జ్ ఆడమింటి వరిమెల్లు (మలయాళం) ఈ మూడు చిత్రాల్లోనూ ముఖాముఖం వివాదాస్పద చిత్రంగా తీవ్రమయిన సంచలనం సృష్టించింది

అచ్చమిల్లై అచ్చమిల్లై అంటే సగ్గు లేదు సిగ్గు లేదు అని అర్థం కవితాలయ పతాకంపై నిర్మించిన ఈ చిత్రానికి బాలచందర్ కథ స్క్రీన్ ప్లే సంభాషణలు సమకూర్చడంతో పాటు దర్శకత్వం వహించారు అస్తవ్యస్తమైన ఈ దేశపు పరిణామాల్ని సిగ్గులేని రాజకీయ నాయకుల్ని పదునైన సంభాషణలు సజీవమైన పాత్రలతో తెరకెక్కించిన ఈ చిత్రం ఈ మధ్యకాలంలో తమిళంలో విడుదలైన మంచి చిత్రాలలో ఒకటి.

తెన్మొళి (సరిత) ఒక స్వాతంత్ర్య యోధిని కూతురు. నీతికి నిజాయితీకి తిలోదకాలిచ్చి రాజకీయంగా దిగజారిపోయి ఆదర్శాలను పణంగా పెట్టి అన్ని రకాల నైతిక విలువలనీ వదిలి పెట్టేసిన భర్త ప్రవర్తనకు విసిగిపోయి ఏవగించుకుని చివరకి ఒక బహిరంగ సభలో భర్త అనే ఆ ఊసరవిల్లిని హత మార్చడంతో చిత్రం ముగుస్తుంది. రాజకీయ అవినీతిని విప్పి చెప్పిన చిత్రం. చిత్రంలో ప్రధానమయిన విషయాన్ని అంతర్లీనంగా సూచించిన బాలచందర్ అభినంద నీయులు

మలయాళ సినిమా రంగంలో యువతరం దర్శకులలో ప్రముఖుడిగా పేరు పొందిన కె. జి. జార్జ్



మలయాళ చిత్రం "ముఖాముఖం"లో ఒక దృశ్యం

దర్శకత్వం వహించిన ఆడమింటివరి యెల్లు చిత్రంలో స్త్రీ ప్రధాన కదా వస్తువు జార్జ్ ఆ చిత్రాన్ని ఒక డాక్యుమెంటరీలా నిర్మించారు సమకాలీన సమాజంలో మూడు తరగతులకు చెందిన ముగ్గురు స్త్రీల కద యిది ముగ్గురూ ఏదో ఒక విదంగా మగవాడి దౌష్ట్యానికి దోపిడీకి గురైన వాళ్ళే అయితే ఆ విషయం తెలుసుకునే వాళ్ళెంత-మంది? ఒకవేళ తెలుసుకొని మగవాడికి ఎదురు తిరిగితే ఆ ఆడదాని జీవనగతి ఏవిదంగా పరిణమిస్తుంది? అన్నీ తెలిసికూడా మగవాడి అహంభావాన్ని అధికారాన్ని కొంత మంది స్త్రీలు మౌనంగా ఎందుకు భరిస్తున్నారు? కొంతవరకూ ఈ ప్రశ్నలకు సమాధానంగా కూడా ఈ చిత్రాన్ని చెప్పుకోవచ్చును

ఒక మధ్యతరగతి మహిళ మానసిక సంక్షోభం ఈనాటి సొసైటీలో పైకి ఎదగడానికి భర్తకి ఒక సోపానం ఆయుధంగా ఉపయోగపడి చివరికి తనేం కోల్పోయిందో తెలుసుకున్న మహిళ అమాయకతతో జీవితాన్ని పణంగా పెట్టుకున్న మరో

హిందీ చిత్రం "పార్"లో నసీరుద్దీన్‌షా, షబ్నాఆజ్మీ



యువతి– ఈ ముగ్గురి జీవితాల కలగలుపే ఈ చిత్రం

ముఖా ముఖం మరో మలయాళ చిత్రం అడూర్ గోపాలకృష్ణన్ దర్శకత్వం వహించిన ఈ చిత్రం కేరళలో విడుదలవగానే తీవ్రమైన సంచలనం సృష్టించింది కమ్యూనిస్టు అభిమానులూ ఈ చిత్రాన్ని కమ్యూనిస్టు వ్యతిరేక చిత్రం గా ముద్ర-వేశారు అడూర్ అసలు తన చిత్రం రాజకీయ చిత్రమే కాదన్నారు కేరళ కమ్యూనిస్టు ఉద్యమ చరిత్రని కేవలం నేపథ్యంగానే తన చిత్రంలో వాడుకోవడం జరిగిందన్నారు ఏది ఏమైనా ఈ చిత్రంలో ప్రధానమైన విషయం వివాదాస్పద-మయినదే మనకు కనిపించని వస్తువుక కనిపించే ఆ వస్తువు నీడకీ మధ్య దూరం అనంతంగా ఉంటుంది అలాగే ఒక మనిషికి ప్రజల్లో ఆ మనిషికున్న ఇమేజ్ కి మధ్య కనిపించని అగాధ మొకటి ఉంటుంది ఆ మనిషి మనస్తత్వాన్ని అంచనా కట్టడానికి అతని ఇమేజ్ ఏ విధంగానూ ఉపయోగపడదు ముఖాముఖం లో ఈ విషయం చాలా ప్రస్ఫుటంగా కనిపిస్తుంది అయితే కమ్యూనిస్టులు ఈ విషయాన్ని పూర్తిగా వదిలేసి రాజకీయ చిత్రంగా దీనిని పరిశీలించడంతో వివాదాలు ప్రారంభమయ్యాయి రాజకీయ చిత్రంగా చూస్తే ముఖాముఖంలో సమాధానం దొరకని ప్రశ్నలు ఎన్నో కనిపించడమే యిందుకు కారణంగా చెప్పుకోవచ్చు

హిందీ చిత్రాల్లో మున్ముందుగా చెప్పుకోవలసిన చిత్రం పార్ పార్ నిస్సందేహంగా ఈ యేటి మేటి చిత్రం ఈ చిత్రంలో నటనకే నసరుద్దీన్‌షా వెనిస్ అంతర్జాతీయ చిత్రోత్సవంలో ఉత్తమ నటుడుగా ఎన్నికయ్యాడు షబ్నా అజ్మీ ఉత్పల్‌దత్ ఓంపూరి కూడా నటించిన ఈ చిత్ర స్రష్ట గౌతమ్‌ఘోష్ సమరేష్ బోస్ రచించిన ఒక చిన్న కథ ఈ చిత్రానికి ఆధారం దర్శకత్వం వహించడంతో పాటు ఛాయా గ్రాహకుడిగా సంగీత దర్శకుడిగా కూడా గౌతమ్ ఈ చిత్రానికి కృషి చేశారు

బీహార్‌లో ఒక మారుమూల గ్రామంలో జరిగిన కథ ఇది హరిజనగూడెం మీద జమిందారు గూండాల-దాడి అక్కడి నుంచి పారిపోయిన ఒక దంపతులు కేవలం బ్రతకడానికి ఎంత కష్టపడ్డారో పతాక సన్నివేశంలో చూపిన చిత్రీకరణ ఈ దేశంలో కోట్లాది నిరుపేదల జీవన ఇతివృత్తం

మరో హిందీ చిత్రం సారాంష్ ఈ మధ్యకాలంలో విడుదలయిన మంచి హిందీ చిత్రాల్లో ఒకటి అర్థ్ చిత్రంతో వార్తలకెక్కిన మహేష్ భట్ ఈ చిత్రానికి రచయిత దర్శకుడు గాంధీ చిత్రంతో ప్రపంచ ప్రసిద్ధిపొందిన రోహిణీ హత్తంగడి అనుపమఖేర్ అనే ఓ నూతన నటుడు ప్రధాన పాత్రల్లో నటించిన ఈ చిత్రం పార్వతి ప్రదాన్ అనే ఇద్దరు వృద్ధ దంపతుల జీవిత చిత్రం ఈ చిత్రంలో కథా విలువలు అంత లేకపోయినా రోహిణీ అనుపమ్‌ల నటనా ప్రతిభతో దర్శకుడు ఈ చిత్రాన్ని దృశ్యంగా మలిచాడు కథనంలో మెలోడ్రామా కొంచెం ఎక్కువ మోతాదులోనే ఉన్నప్పటికీ ఈ చిత్రం కథ బొంబాయి మహానగరంలో మధ్య తరగతి మనుషుల కథ కావడంతో చిత్రం ఆసక్తికరంగానే ఉంది

మిగిలిన హిందీ చిత్రాల్లో అమోల్ పలేకర్ నటించి దర్శకత్వం వహించిన అన్‌కహీ కుమార్ సహాని దర్శకత్వం వహించిన తరంగ్ చిత్రాలు కూడా చెప్పుకోతగ్గవే అన్‌కహీ లో మూఢనమ్మకాలు జ్యోతిష్యాలు ఒక మనిషి జీవితంలో ఎటువంటి దుష్పరిణామాలు సృష్టించాయో చిత్రించబడింది 'తరంగ్' కథ ఆధునిక మహాభారతం ఇద్దరు పారిశ్రామికవేత్తల మధ్య తలఎత్తిన సంఘర్షణ ఈ చిత్రం. మిగిలిన చిత్రాల్లో అందరూ ఎంతగానో ఊహించిన పార్టీ ఉత్సవ్ చిత్రాలు అంతంత మాత్రంగానే ఉన్నాయి

ఏది ఏమైనా, రెండు వారాలపాటు విలక్షణమైన యిన్ని భాషల చిత్రాలు చూడడం అపూర్వమైన అనుభవం. అయితే ఈ ఇండియన్ పనోరమ విభాగాన్ని, ఒక్క అంతర్జాతీయ చిత్రోత్సవం జరిగే నగరానికే పరిమితం చేయకుండా చిత్రోత్సవ నిర్వాహకులైన ప్రభుత్వ సంస్థ- నేషనల్ ఫిలిం డెవలప్‌మెంట్ కార్పొరేషన్ మిగిలిన ప్రధాన నగరాలకు ముఖ్యంగా సినిమా నిర్మాణ కేంద్రా-లయిన హైద్రాబాద్ త్రివేంద్రం బెంగుళూర్ మద్రాస్, కలకత్తా బొంబాయి తదితర నగరాల్లో కూడా నిర్వహించినప్పుడే ఇండియన్ పనోరమ నిర్వహించడానికి వెనుకఉన్న ఆశయం నెరవేరు-తుంది.

డి కృష్ణమోహన్

## పనిలో రంగుల ప్రభావం!

కొన్ని సంవత్సరాల క్రితం కర్మాగారాలలో యంత్రాలన్నింటికి నల్ల రంగు ఉపయోగించే వారు రెండవ ప్రపంచ యుద్ధ సమయంలో ఉద్యోగాలలోకి ప్రవేశించిన మహిళలు ఈ నల్ల రాక్షసుల గురించి ఫిర్యాదులు చేశారు దీనిని పరిష్కరించేందుకు బూడిదరంగు ఉపయో గించటం ప్రారంభించారు ప్రస్తుతం ఆకుపచ్చ రంగు బహుముఖంగా ప్రాధాన్యత సంతరించు-కుంది పరిసరాలలోని రంగులు కార్మికుల పనిని ప్రభావితం చేయగలవని పశ్చిమ జర్మనీ మనస్తత్వ శాస్త్రవేత్తలు తెలియ చేశారు బవేరియా రాష్ట్ర సాంఘిక విషయాల మంత్రిత్వశాఖ తరఫున ప్రొఫెసరు ప్రిఫింగు దీనిపై పరిశోధనలు గావించారు పరిసరాలలో సరైన రంగులు ఉపయోగించటంవలన కార్మికు లలో కులాసాభావం పనిపట్ల జాగ్రత్త పనిలో నాణ్యత పెరగగలవు ఉష్ణ ప్రాంతాలలో నీలి నీలి పచ్చరంగులు శీతల ప్రాంతాలకి నారింజ గోధుమ రంగులు అనువైనవని ఆకుపచ్చ రంగు హోరెత్తించే శబ్దాలను తగ్గించగలదని పేర్కొ న్నారు

(గ్లోబల్)

హిందీ చిత్రం ''తరంగ్''లో ఒక దృశ్యం



ప్రభావతమ్మ కాఫీ కలపను లేవబోతుంటే ప్రభాత కప్పుతో ప్రత్యక్షమైంది ఆమెను చూడగానే ప్రభావతమ్మ మనసు ప్రసన్నమైంది.

★ ★ ★

ఆ తరువాత పుదయమే ఫలహారం చేస్తూ 'రేపు మద్రాసు వెళ్తున్నాను' అన్నాడు కృష్ణచైతన్య.

''రేపేనా'' అంది ప్రభావతమ్మ.

''ఏమిటోయ్ అంత అర్జంటు'' అన్నారు రామస్వామిగారు

''రవికి తన బిజినెస్ వ్యవహారాల్లో సహాయం కావాలిట రమ్మని చెప్పాడు.'''

''వాడి వ్యాపార విషయాలు నీకేం తెలుసునని?''

''అదే మాటంటే వాడు బాధపడ్డాడు ఒకసారి వెళ్ళొస్తే దండగ లేదుకదా అని ''

''వెళ్ళేటప్పుడు జయపద్ద దిగుతావా?''

''వచ్చేటప్పుడు వీలౌతుందమ్మా.''

''ఆదివారం వెళ్ళేబదులు ఒహారోజే వెళ్తే సమయమూ, సెలవూ కలిసొస్తాయికదా!''

''సెలవులు చాలా వున్నాయి అయినా ఆదివారం వెళ్ళి చేసేదేముంది!''

ప్రభాత వీరందరి సంభాషణ వింటూ కూర్చుంది తాతయ్య సమక్షంలో ఆమె అధికంగా మాట్లాడదు. అమ్మమ్మతో చనువుయెక్కువే గానీ అమ్మమ్మ సన్నిధిలో మామయ్యతో చనువుగా ప్రవర్తించదు

కాలేజీకి వెళ్ళేటప్పుడు ''మద్రాసు హఠాత్తుగా వెళ్తున్నావేమిటి మామయ్య'' అంది

''పనుంది గానీ నీకేం కావాలో చెప్పు.''

''నాకేమీ వద్దు.''



''అలాగంటే కుదరదు.''

''నువ్వు క్షేమంగా రా. అంతే చాలు.''

''నేను క్షేమంగా వస్తూ నీకేం తేవాలి ?''

''పోనీ...''

''చెప్పు.''

''నువ్వు త్వరగా రా. లేకుంటే నాకు బోర్ కొడ్తుంది.''

అతడు చిరునగవుతో ఆమెను తదేకంగా పరిశీలించి ''ఓ.కె. పని పూర్తయ్యాక వొక్క క్షణమైనా ఆలస్యం కానివ్వను ఫ్లైట్‌కి యెలాగైనా ప్రయత్నించి రిజర్వు చేసికుంటాను'' అన్నాడు.

నవ్వుతూ వెళ్ళిన ప్రభాత ఆ సాయంత్రం చిన్నబోయిన వదనంతో వుంది.

''అలా వున్నావేమిటి!'' అన్నాడు.

''నిన్న రోజ్‌లిన్ వాళ్ళ యింటికి వెళ్ళలేదని ఫ్రెండ్సు టీజ్ చేస్తున్నారు.''

''అంతేకదా.''

''నీకలాగే అనిపిస్తుంది.''

''ఓ.కె. ఐ షల్ కన్సిడర్ ది మాటర్.''

ఆదివారం వుదయమే కృష్ణచైతన్య తన ప్రయాణానికి కావాల్సిన యేర్పాట్లు చేసికున్నాడు. భోజనాలు ముగిశాక ''రోజ్‌లిన్ వాళ్ళ యిల్లు తెలుసా నీకు ?'' అన్నాడు.

''ఎప్పుడూ వెళ్ళలేదు. గుర్తులు తెలుసు,''

''వాళ్ళింట్లో ఫోనుందా ?''

''ఉంది. ఎందుకు ?''

''వెంటనే ఫోన్ చేసి నువ్వొస్తున్నట్లు తెలియజెయ్యి.''

''ఇప్పుడా ?''

''నేనిప్పుడు బయటకు వెళ్ళబోతున్నాను. నీకు రావడానికి వీలైతే నిన్ను నీ ఫ్రెండ్ దగ్గర డ్రాప్ చేసి తిరిగొచ్చేటప్పుడు పికప్ చేసికుంటాను.''

''మద్రాసు వెళ్ళటం లేదా ?'' —తల్లి ప్రశ్న.

''వెళ్తున్నానమ్మా కొంచెం పనుంది అది పూర్తి చేసి వెళ్దామని.''

కృష్ణచైతన్య పురమాయించిన వెంటనే ప్రభాత సిద్ధం అయింది. వారికి రోజ్‌లిన్ వాళ్ళ యిల్లు కనుక్కోవడం సులభమే అయింది. గేటు ముందు కారు ఆగిన శబ్దానికి రోజ్‌లిన్ బయటకు వచ్చి కృష్ణచైతన్యను కూడా ఆహ్వానించింది. అతడు మరోసారి వస్తానని చెప్పి వాచీ చూసుకుంటూ ''కచ్చితంగా వొక్క గంటకు వస్తాను.'' అన్నాడు ప్రభాతతో.

''చాల థాంక్సు అంకుల్ ప్రభాతను తీసికొచ్చినందుకు'' అంది రోజ్‌లిన్.

కృష్ణచైతన్య వెళ్ళిపోయాక యిద్దరూ లోపలకు వెళ్ళారు రోజ్‌లిన్ వాళ్ళ యిల్లు ఆధునాతనంగా కట్టబడటమే కాకుండా మరింత ఆధునాతనంగా అలంకరించబడి వుంది. ఆమె ప్రభాతను తన కుటుంబ సభ్యులకు పరిచయం చేశాక ఆమెను తన గదిలోనికి తీసికుని వెళ్ళింది. ఆ గదిని ఆమె తన చెల్లెలితో షేర్ చేసికుంటోందిట. గది చాలా నీట్‌గా వుంది.

''నువ్వు లంచ్ యిక్కడ చేయాల్సింది'' అంది.

''మామయ్య వెళ్దామని లంచ్ పూర్తయ్యాక చెప్పాడు.''

''అయితే మామయ్య తీసికు రావడమన్నమాట; తమరు రావడం కాదు'' అంది కొంచెం నిష్ఠూరంగానూ, యెగతాళిగానూ.

''మరి మీరంతా గేలి చేస్తున్నారని...''

''ఆయనతో చెప్పావన్నమాట.''

''చెప్పకుండా యెలా వుంటాను ?''

రోజ్‌లిన్ ప్రభాత చేతుల్ని తన చేతుల్లోకి తీసికుంటూ ''ఒక్కటి అడగనా ?'' అంది.

''ఏమిటి ?''

''నీకు మీ మామయ్యంటే చాలా ప్రేమకదూ!''

ప్రభాత వొక్కక్షణం యేమీ మాట్లాడలేదు. తరువాత నెమ్మదిగా అంది 'అలాంటి మామయ్యంటే యెవరికిమాత్రం యిష్టముండదు'

''అయితే అదికూడా ఆయన గొప్పతనమేనన్నమాట.''

ప్రభాత చిరునవ్వును కనపడనీయలేదు.

అంతటితో వారా విషయాన్ని వదలి కాలేజీ కబుర్లలోపడ్డారు. మధ్యలో రోజ్‌లిన్ తల్లి పంపిన స్వీట్స్‌తిన్నారు. కబుర్లలో కాలాన్ని గమనించకుండా గడుపుతుండగా రోజ్‌లిన్ ''తమ్ముడొచ్చి మీకోసం యెవరో వచ్చారండీ బయట కార్లోనే కూర్చున్నారు'' అన్నాడు.

''ఎందుకంత గాభరా ? మీ అంకుల్‌కు కోపం యెక్కువా ?'' అంది రోజ్‌లిన్.

''మామయ్యకు యెప్పుడోగానీ కోపంరాదు. కాని వస్తుందేమోనని నా భయం.''

ప్రభాత రోజ్‌లిన్ వాళ్ళింట్లో అందరివద్దా శెలవుతీసికుని వెళ్ళింది.

కృష్ణచైతన్య బయలుదేరబోతుండగా ''నేనూ స్టేషన్‌వరకూ రానా మామయ్యా'' అంది.

''నేను కచ్చితంగా ఐదునిమిషాలు మాత్రం ముందు వెళ్తాను తిరిగొచ్చేటప్పుడు వొక్కదానివే రావాలి.'' అన్నాడు.

ప్రభాత తలవంచుకుని నిలబడింది.

''ఏమిటి? యేమైనా కావాలా?'' అన్నాడు దగ్గరకువచ్చి.

''రేపటినుండి బస్‌లో వెళ్ళాలి.''

కృష్ణచైతన్య పర్సుతీసి యిచ్చాడు. ''నీక్కావల్సింది తీసికో.''

ప్రభాత పదిరూపాయలనోటు తీసికోవడంతో ''యితర అవసరాలు వుండవచ్చు. సరిపోయేటంత తీసికో'' అన్నాడు

''ఇవి చాలు.''

కాలేజీలో చేరాక ఆమెకు కొన్ని చిన్న ఖర్చులు ప్రారంభం అయ్యాయి. వాటిని ఆమె అతనివద్దనుండే తీసికుంటుంది. ఆమె ఫీజుకు పుస్తకాలకు కూడా అతడేయిస్తున్నాడు. అతడిచ్చిన స్వేచ్ఛను, చనువునూ ఆమె సద్వినియోగం చేయకపోవడం అతడనేకసార్లు గమనించాడు.

కృష్ణచైతన్య వెళ్ళిపోయాక ప్రభాతకూ, ప్రభావతమ్మకూ యేమీ తోచలేదు. ఇల్లంతా చిన్నబోయినట్లనిపించింది. ఆ విషయం ప్రభావతమ్మ పదేపదే పైకి అంటే ప్రభాత లోపల అనుకుంది.

''వాడు లేకపోతే యిల్లంతా బావురుమంటోందండీ'' అంది భర్తతో.

ఆయన కూడా కృష్ణచైతన్యని మిస్ అయినట్లుగా ఫీలయ్యారు. ''మనల్ని చివరి వరకూ అంటి పెట్టుకునేది వాడేను'' అన్నారు.

ఆమెకు పిల్లలంతా గుర్తుకొచ్చారు. ఒక్కొక్కరు వొక్కొక్క మార్గాన వెళ్ళిపోయారు. ఎప్పుడోగానీ కనుపించరు. ఊర్లో వున్న రాధ అయినా వారానికో పది రోజులకో తప్ప కనుపించదు. ఎన్నో వూహల్ని అల్లుకుని కన్నారు. కంటికి రెప్పలా కాపాడుకుంటూ పెంచారు పిల్లలతోనే ప్రపంచం, సుఖం, సంతోషం. స్వర్గం, సమస్తం అనుకున్నారు. ఇప్పుడు వాళ్ళేమో రెక్కలొచ్చి యెగిరిపోయారు. దిగి యెప్పుడు తమకు దర్శనమిస్తారా అని వృద్ధ దంపతులు వారు యెగిరిన మార్గంలోకి చూస్తూ నిల్చున్నారు.

ప్రభావతమ్మ కళ్ళు చెమర్చాయి.

''జీవితం అంతే ప్రభావతి. మనంమాత్రం మన తల్లిదండ్రులను





అంటిపెట్టుకునే బ్రతికామా ? మన పిల్లలూ అంతే. అలా కానినాడు జీవితంలో వృద్ధిలోకి రాలేరు'' అన్నారు ఆమెను అనునయిస్తూ.

తరువాత పుదయం లేస్తూనే ఆమె రాధకు ఫోన్ చేసింది శరత్ ఆఫీస్‌కు వెళ్ళాక రమ్మనమని. ప్రొద్దునే నిద్రాభంగం కలిగిస్తూ వచ్చిన ఫోన్‌కాల్‌కు ముందు విసుక్కున్నా తల్లి కంఠం వినగానే ఆమెలోనివిసుగు పటాపంచలై పోయింది. తల్లి వద్దకు వెళ్ళే ప్రయత్నంలో పని చకచకా ముగించుకుంది.

''మీ అమ్మ రోజూ యిలాగే ఫోన్ చేస్తే నాకు కాఫీ, టిఫిన్ చాలా త్వరగా దొరుకుతాయి'' అన్నాడు శరత్.

''ఫోన్ వుంది అందుకే. మా అమ్మ రోజూ ఫోను చేస్తే నేను రోజూ వెళ్తాను.''

''మీ నాన్న ఫోనెందుకు పెట్టించుకున్నారో గానీ నేను మాత్రం నువ్వు రోజూ మీ వాళ్ళతో మాట్లాడుకోవాలనే పెట్టించాను రాధా.''

''చాలా గొప్ప మనసు'' నాలుకచాచి వెక్కిరించింది.

రాధ తనపని ముగించుకుని వెళ్ళేసరికి ప్రభాత కాలేజీకీ, రామ స్వామిగారు ఆఫీసుకూవెళ్ళిపోయారు. ప్రభావతమ్మక్కూడా పని దాదాపు పూర్తికావడంతో తీరగ్గా కూతురిచెంత కూర్చుంది.

''అంత ప్రొద్దున్నే ఫోను చేశావు యేమైనా అర్జంటుపని వుందామ్మా!''

''ఊరికే నిన్ను చూడాలనిపించింది. కృష్ణ మద్రాసువెళ్ళాకయేమీ తోచటంలేదు.''

''అదీ సంగతి అన్నయ్య లేడుకాబట్టి నన్ను చూడాలనిపించింది'' నవ్వుతూనే నిష్ఠూరమాడింది.

''నలుగుర్ని వేనేకన్నాను తల్లీ. నాకు అందరూ సమానమే. వాడంటే మమ్మల్నే అంటిపెట్టుకుని వున్నాడు యింతకాలం. మరి ముందేమౌతుందో.''

''ముందుముందు కొడుకుతోపాటు ముచ్చటగా కోడలుకూడా తిరుగుతుంది యీ యింట.''

కోడలన్నమాట వినగానే ప్రభావతమ్మ వదనం మ్లానమైంది.

''నాకు వాడి విషయమే దిగులుగా వుంది రాధా'' అంది మెల్లగా.

''దిగులు చెందాల్సిన విషయం యేమిటమ్మా''

''మీ నాన్నగారితోనే భయంగా వుంది రాధా''

''సరిగ్గా చెప్పమ్మా దిగులేమిటి? భయమెందుకు?''

''వాడిపెళ్ళి విషయమే రాధా, ఇంతవరకూ యేమీ తేల్చడు. కాలం దాటేస్తున్నాడు.''

''అమ్మ నేనొక విషయం చెప్పనా ?''

''చెప్పుతల్లీ.''

''అన్నయ్యను ప్రభాతను చేసికుంటాడేమో అడిగిచూడు.''

''ఆ విషయిమే నాకు దిగులు. మీ నాన్నగారికి యిష్టం వుండ దేమోనని భయం.''

రాధకు తన పెళ్ళిముచ్చట జ్ఞప్తికివచ్చింది. తను పెదవి కదప కుండానే తన మనసులోని కోరికప్రకారం జరిపించిన అన్నయ్య కళ్ళముందు కదిలాడు అలాంటి అన్నయ్య వాంఛ తీరాలనే ఆమె కోరుకుంటోంది

''ముందు నీకిష్టమేనామ్మా ''

రాధ నిలదీసి ప్రశ్నించేసరికి తడబడింది. ఆమె యీ విషయంలో వొక నిశ్చితమైన అభిప్రాయానికి రాలేదు కొడుకును బాధ పెట్టాలని లేదు ప్రభాత పట్ల ప్రేమ, దయ వున్నాయి. కానీ కోడలిగా ఆమెను వూహించుకుని సంతిష్టురాలు కాలేకపోతోంది భర్త ఆగ్రహిస్తాడేమో నని కంగారుగా వుంది. ఇన్ని భావాల సంఘర్షణల మధ్య ఆమె సతమత మౌతోంది. అందుకే రాధ ప్రశ్నకు మౌనమే జవాబుగా యిచ్చింది.

''డబ్బు ప్రధానం కాదనుకుంటే యిందులో అభ్యంతరానికి, అయిష్టానికీ తావు లేదమ్మా'' అంది రాధ మళ్ళీ తనే మాట్లాడుతూ.

''డబ్బు ప్రసక్తే లేదు మనకు చాలకుంటే కదా బయటవాళ్ళ నుండి ఆశించేది లోకులు అనేక విషయాలు త్రవ్విపోస్తారు అసలే వాడికి పెళ్ళి ఆలస్యం అయ్యిందని యిప్పటికే చెవులు కొరుక్కుంటు న్నారు. రేపు యిక వేరే సంబంధం దొరక్క యిలా చేసికున్నాం అంటారు ''

''ఎవరమ్మా ఆ అనేది ?''

''చిన్న పిల్లలు మీరలాగే అంటారు రాధా.''

''అనేవాళ్ళు యిప్పటికే ప్రభాతను తీసికొచ్చినందుకు అనుకునే వుంటారు. అప్పుడు ఖాతరు చేయకుండా వుండి యిప్పుడు క్రొత్తగా మొదలెట్టావు.''

''దానికీ దీనికీ యెంతో భేదం వుంది.''

''ఈ అనే వాళ్ళమ్మా రేపు ప్రభాతను చేసికోకపోయినా నిన్ను ఆడిపోసుకుంటారు.''

ప్రభావతమ్మ వులిక్కిపడ్డది.

''జయ కూడా అలాగే చెప్పింది. మీ అందరికీ యిష్టమైన దాన్ని నేను మాత్రం కాదంటానా ?''

''రాధ నవ్వి అన్నయ్య యిష్టాన్ని మీరెప్పుడు కాదన్నారు?'' అంది.

''ఎవరియిష్టాలకు మేము వ్యతిరేకంగా వెళ్ళలేదు రాధా. పోతే వాడి విషయం అంటావా, వాడు కూడా మా కిష్టంలేని విషయాలు చెప్ప టానికి సంకోచిస్తాడు.''

''అసలింతకూ అన్నయ్య మద్రాసు యెందుకు వెళ్ళాడు? ఎప్పు డొస్తాడు ?''

# మౌనవిపంచి

"ఎందుకు వెళ్ళాడో వాడికి తప్పించి వేరెవ్వరికీ తెలియదు. ఎప్పుడొస్తాడన్నది వాడిక్కూడా తెలియదు."

వారిరువురూ మరి అతన్నిగూర్చి చర్చించుకోలేదు. ఆరోజు ప్రభాత చాలా త్వరగా వచ్చేసింది

"అప్పుడే వచ్చేశావేమిటి?" అంది ప్రభావతమ్మ ఆశ్చర్యంగా.

"క్లాసెస్ లేవమ్మమ్మా"

రాధ ప్రభాతను ఆమె కాలేజీ విశేషాలడిగి తెలుసుకుంది సాయంత్రం కాగానే వెళ్ళడానికి లేవబోతున్న రాధతో "అంకుల్‌కు ఫోన్ చేసి రమ్మను పిన్నీ ఇద్దరూ కలసివెళ్దురు" అంది

"అన్నయ్య లేకపోయేసరికి అమ్మమ్మకూ, మనుమరాలికీ బోర్ కొడుతున్నట్టుంది" అని హాస్యమాడి శరత్‌కు ఫోన్‌చేసింది

అల్లుడొస్తున్నాడంటే ప్రభావతమ్మకు హడావుడి అధికమయ్యింది అతనికోసం ప్రత్యేక వంటలు చేయడంలో నిమగ్నమయ్యింది

"చూశావా ప్రభాతా; అమ్మకు నేనంటే లెక్కలేదు అల్లుడుగారొస్తున్నారంటే యెంత హంగామా చేస్తోందో" అంది కినుకగా

"అమ్మాయినిబట్టే అల్లుడు. ఆ అబ్బాయేమో చక్కగా తింటాడు. మీరేమో నాజూకుబోతారు. ఎన్నిచేసి యేమిప్రయోజనం.?"

ఆ రాత్రి కబుర్లలో ప్రొద్దుపోవడంవల్ల రాధ, శరత్ అక్కడే వుండి మర్నాడు టిఫెన్, కాఫీ తీసికుని వెళ్ళారు. ప్రభాత వాళ్ళు వెళ్ళే వరకూ కాలేజీకి వెళ్ళే ప్రయత్నమేమీ చేయకుండా ఆలస్యంగా వెళ్ళింది

ఫస్టు పీరియడ్ హిస్టరీక్లాసు. ఆమె విద్యార్థులు ఆలస్యంగా వచ్చిన వూరుకోదు. పదినిమిషాలు ఆలస్యంగా వచ్చిన ప్రభాతను వెంటనే లోనికి రావడానికి అనుమతి యివ్వక ఆలస్యానికి కారణం అడిగింది.

ప్రభాత జవాబిచ్చేలోగా పదిమంది పిల్లలు పదిరకాలు వ్యాఖ్యానించారు.

"మామయ్య లేరు"

"కారులేదు" అని కోరస్‌గా చెప్పారు

ప్రభాతకు వాళ్ళమీద కోపంవచ్చింది. తరువాత ఆ కోపాన్ని తన మీదకు బదిలీచేసికుంది నిస్సహాయస్థితిలో కళ్ళవెంట నీరుతిరిగాయి బదులివ్వకుండా తలవంచుకుని నిల్చున్న ఆమెనుచూచి లెక్చరర్ యేమనుకున్నారో గానీ "కమాన్" అన్నారు.

ప్రభాత వెళ్ళి తన సీట్లో కూర్చుంది ఆ రోజంతా ఆమె మూడ్ ఆఫ్‌లోనే వుంది ఆమెను మామూలు స్థితికి తీసికురాను ఆమె స్నేహితులెంత ప్రయత్నించినా ప్రయోజనం లేకపోయింది

తెలుగు క్లాసు నుండి వస్తుండగా రోజలిన్ అంది "ఇప్పుడేమయిందని అలా మూడీగా వున్నావు ?"

"ఇంకా యేం కావాలి వాళ్ళంతా సమయం దొరికితే చాలు యిన్సల్టు చేస్తున్నారు."

"ఇన్సల్ట్‌ని యెందుకనుకోవాలి ? సరదా అనుకోవాలి."

"సరదానా? సమయం సందర్భం లేకుండానా ?"

"ఆ జ్ఞానం వాళ్ళకు లేదు అయినా మొన్న మీ మామయ్యను టీజ్ చేస్తే ఆయన సంతోషంగా నవ్వుకున్నారుట దాంతో వీళ్ళ అల్లరి మరీ యెక్కువైంది"

"మా మామయ్య నవ్వుకున్నారా ?" ఆశ్చర్యంగా అడిగింది.

"అవునట ఆయన బాగా ఎంజాయ్ చేశారని చెప్పుకున్నా"

ఈ వార్త ప్రభాతను గూడా సంతోష సాగరంలో ముంచెత్తగా ఆమె కళ్ళ ముందు యెన్నో సుందరదృశ్యాలు కన్పించసాగాయి.

రోజలిన్ మాటలకు వులిక్కిపడుతూ "యేమిటి ?" అంది.



# LOANS

**HURRY UP !!!**



## Register your name by remitting Rs. 35/- and avail loans.

### AVAILABLE LOANS EVEN WITHOUT MORTGAGE / PLEDGE / GUARANTORS, THROUGHOUT INDIA.

1. A simple interest, at the fixed rate of 21% per annum shall be charged, on debit balance, for all types of loans.
2. Loans may be sanctioned within a period of 15 days from the date of receipt of completed loan documents.
3. **LOANS SHALL BE GIVEN FOR THE FOLLOWING PURPOSES :** (i) Construction of House, Hotel, Theatre, pumpset House, Poultry & Piggery Sheds, Industrial Premises etc.; (ii) Purchase of Vehicles i.e. Truck, Taxi, Auto-Rickshaw, Bus and Two-wheeler etc.; (iii) Land Development, Crop Loans, Purchase of Electric Motors, Diesel/Electric Pump-sets, Tractors, Power Tillers and Harvesters etc.; (iv) Sinking of New Well; (v) Dairy, Poultry and Piggery Farming; (vi) Development or Establishment of an Industry; (vii) To Develop and to Start any Business/Contractorship; (viii) Loans for Film Industry; (ix) Marriage; (x) Personal Loans; (xi) To Purchase Old Vehicles, Machineries, Factories, Plants, Houses, Theatres etc. and for their Repairs; (xii) To Redeem Old Debts (Loans); (xiii) For Working Capital; (xiv) To Purchase of Plots, Estates, Agricultural Lands and other Properties.
4. Repayment period may be allowed to the maximum of 10 years by monthly / Quarterly / half-yearly / yearly instalments.
5. **ELIGIBILITY TO APPLY FOR LOAN**—Only Registered members are eligible to apply for loan.
6. **HAVE YOU REGISTERED YOUR NAME UNDER LOAN SCHEME ?**—If not please hurry up and do not miss this golden opportunity and get your name registered by remitting a sum of Rs. 35/- (Rupee thirty five only) towards registration fee.

**NOTE**—The necessary details and guidance for raising loan and loan documents shall be sent to our registered members only as per usual procedure.

**Send immediately your amount (Rs. 35/-) by M.O. / I.P.O. / Bank Draft towards Registration Fee to :**




Registered with Govt. of India and No. assigned as A / 31639 / 81

## SATNA SYNDICATE BANKER

**SATNA - 485 001 (M.P.)** Ph. 3007

**an indigenous banker ....the name you can trust.**

• **For Agency Details remit Rs. 10/—** •

## మౌనవిపంచి

"మీ మామయ్య యెప్పుడొస్తారు ?"

"ఏమో! ఎప్పుడైనా రావచ్చును."

"నీకేం తెస్తారో !"

"ఏమో ! యేమైనా తీసుకు రావచ్చును."

"నువ్వేమీ అడగలేదా ?"

"ఊహూఁ !"

"ఎందుకని ?"

"నేను వేరే అడగాలా? మామయ్యే అన్నీ చూస్తారు."

"ఒక వేళ నీకేదైనా కావాలనిపిస్తే ? ఆ విషయం గూడా చెప్పవా ?"

"ఊహూఁ ! చెప్పను. ఆ విషయం మామయ్యకు తెలుస్తుంది."

రోజలిన్ ప్రభాతను పిచ్చిదాన్ని చూచినట్లు చూసింది. "నువ్వు యింకా ధైర్యంగా వుండాలి" అంది కొంచెం ఆగి.

"మామయ్య లేకుంటే నేను పిరికిదాన్ని రోజీ" అంది.

రోజలిన్ యిక మాట్లాడటం అనవసరం అనుకుంది.

* * *

కృష్ణచైతన్య తిరిగివచ్చాడు. అతడ్ని చూస్తూనే "జయ దగ్గరకు వెళ్ళావా" అంది ప్రభావతమ్మ.

"సాధ్యం కాలేదమ్మా"

ఏమో అనబోయి అతని ముఖంచూచి మిన్నకుంది ఆమె. అతని కంఠం వింటూనే "మామయ్యా" అంటూ వచ్చిన ప్రభాత వెనకడుగు వేసింది. అతడు వెళ్ళేటప్పుడు వున్నట్లులేదు. వెళ్ళిన మామయ్య వుత్సాహవంతుడు. యెల్లవేళలా నవచైతన్యంతో వూగిసలాడే యువ్వన వంతుడు, ఆనందంలో అందర్నీ అలరారించేవాడు. కానీ యిప్పుడతని రూపం అందుకు భిన్నంగావుంది. అతడెంతో వయసు మీదపడినట్లు మారిపోయాడు. అతనిలోని వుత్సాహాన్నీ, వుల్లాసాన్నీ యే అదృశ్య శక్తో గుంజివేసినట్లుంది. అతని వదనంలో సదా స్థానం చేసికుని వుండే ప్రశాంతత తాలూకు చిహ్నాలు యిప్పుడే మాత్రం లేవు. అతని ముఖంలో మునుపెన్నడూ లేని అశాంతి, నిర్లిప్తత చోటుచేసికున్నాయి.

పలుకరింపు మధ్యలోనే ఆగిపోయిన ప్రభాతను చూస్తూ "యేమిటి?" అన్నాడు.

అంత పొడిగావున్న అతని పరామర్శను ఆమె మనసు స్వీకరించనూ లేక తృణీకరించనూలేక విలవిల్లాడిపోయింది.

అతని ముభావ వర్తనకు యింట్లో అందరూ విస్తుబోయారు. ప్రయాణంవల్ల అలసివున్నాడేమోనని సర్దిచెప్పుకున్నారు.

వచ్చిన కొద్దిసేపటికే యూనివర్సిటీకి బయలుదేరిన కొడుకును చూచి "విశ్రాంతి తీసికో కృష్ణా" అన్నారు తండ్రి.

"కొన్ని సందర్భాల్లో విశ్రాంతి వికటిస్తుంది."

అతని మాటలకు మూగవోయింది తల్లి.

అతనికి సాధారణమైన చికాకు కాదు కలిగింది. గుండె లోతుల్లో యెక్కడో గాయమయ్యింది. ఎందుకయ్యిందా గాయం? ఎవరు చేశారు దాన్ని ?

"వెళ్తున్నానమ్మా" యథావిధి చెప్పినప్పటికీ ఆ కంఠంలోని బరువును తల్లి మనసు వెంటనే గుర్తించింది.

కాలేజీకు వెళ్ళడానికి సిద్ధంగా వున్న ప్రభాతతో "వస్తావా" అన్నాడు.

ఈ కొత్తరకం ప్రశ్నకు అర్థం ఆమెకు బోధపడలేదు. ఎన్నడు లేనిది యీ రోజు "వస్తావా ?" అంటే రమ్మనా లేక వద్దనా? మతి లేనిదానిలా తలూపి అతన్ననుసరించింది.

**(ఇంకా వుంది)**

## వోటర్లు రాక ముందే నిండిన బాలెట్ పెట్టెలు!

బీహారుకు చెందిన ముంగార్ జిల్లా ఖర్గపూర నియోజకవర్గంలోని వో మూడు ఎన్నికల బూత్‌లను తెరిచి, ఆహా యిక వోటరు మహాశయులను పిలవ్వచ్చునని, బాలెట్ పెట్టెలకేసి చూస్తే, అవి నిండి, పొర్లి పోతున్నాయట. కలా కాదు, వైష్ణవ మాయా కాదు అని గ్రహించి, ఈ మోసాన్ని అరికట్టడానికి రిటర్నింగ్ ఆఫీసరు ఆ చోట్ల పోలింగు రద్దు చేశారట.

## మూర్ఛపోయిన వైజయంతిమాల

పాండిచ్చేరిలో జీపులో ఎన్నికల ప్రచారం చేస్తున్న నటి వైజయంతిమాల మీద వో అదృశ్య హస్తం ఎగిరో రాయి విసిరేసరికదావిడ నడుంకి తగిలి, ఆ దెబ్బ కావిడ మూర్ఛపోయారట. ఆనక లేచి మళ్ళీ ఇందిరా కాంగ్రెసు హస్తానికే మీ వోటు అని ఆమె వుద్బోధించింపట.

## సినీనటి భర్తకు జైలు శిక్ష!

నటి పద్మప్రియ తన భర్త శ్రీనివాసన్ తనను రాచి, రంపాన పెడుతున్నాడని, కొట్టి చంపేస్తున్నాడని కోర్టులో ఫిర్యాదు చేస్తే, ఆ శ్రీనివాసన్ తనను తన భార్య పద్మప్రియ, ఆమె తల్లి, అన్నగారు కలసి కొట్టి చంపేస్తున్నారని ఆయన కూడా వో కేసు పారేశారట. మద్రాసు మాంబళం కోర్టులో ఈ కేసు విన్న ఆ న్యాయాధికారి శ్రీనివాసన్ కేసు కొట్టి పారేసి, పద్మప్రియ కేసును వొప్పుకుని, నమ్మి, శ్రీనివాసన్‌కు 300 రూపాయలు అపరాధం, వో నెల జైలు శిక్షా వేశారట.

## రక్తపోటుకి నిమ్మకాయ వైద్యం!

అధిక బ్లడ్‌ప్రెషరున్న వారు ప్రతి రోజూ వుదయం గ్లాసుడు మజ్జిగలో వో పెద్ద నిమ్మకాయ పిండి, నియమం తప్పకుండా తాగితే ఆ బ్లడ్ ప్రెషర్ క్రమేణా తగ్గుతుందని మహా వుదట.




## హీరో అయిన అమ్మాయి!

ఒలింపిక్స్‌లో అనేక బహుమతులు గెల్చుకున్న 14 ఏళ్ళ నాడియాసుమనాగి అనే ఆమెను ఆమె మాతృ దేశం రుమేనియా ఓ బిరుదిచ్చి సత్కరించిందట. ఆ బిరుదు "హీరో ఆఫ్ ది సోషలిస్ట్ వర్క్స్" అనట. ఆమె స్త్రీ అయినా హీరో అనడం తప్పుకాదని పర్యాక మానిక "హ" అన్నది ఓ సూచనని ఆ ప్రభుత్వం అభిప్రాయపడ్డట.

## చైనాలో కాన్సర్!

చైనాదేశంలో ప్రతి 45 సెకనులకు ఒక మనిషి కాన్సర్ వ్యాధివల్ల చనిపోతున్నాడట. ఏటికి ఎంత లేదనుకున్నా 8 కోట్లమంది చనిపోతున్నారట. అక్కడ యీ వ్యాధి ముఖ్యంగా మగవారికి ఎక్కువగా వస్తోందట. స్త్రీలకు గుండె జబ్బులు అధికంగా వచ్చి చనిపోతున్నారట.

## హత్యకి దారితీసిన అక్రమ సంబంధం!

ధోనేకు 7 కిలో మీటర్ల దూరంలో పుట్నూరు గ్రామానికి చెందిన బోయం గంగన్న అనే అతను అదే వూరికి చెందిన చిట్టా రామమ్మతో అక్రమ సంబంధం పెట్టుకున్నాడట. తన అన్నగారు ఆ రామమ్మ వలలో పడిపోయాడని కోపగించిన ఆ గంగన్న తమ్ముడు ఆ రామమ్మను పొడిచి చంపేశాడట.

## బరువు తగ్గాలంటే బత్తాయి రసం

ఆరెంజిపండుకు బత్తాయికాయి ఏ మాత్రం తీసిపోదని, 100 గ్రాముల బత్తాయి రసంలో 30 కాలరీల శక్తి వుంటుందని, ఇది బరువు తగ్గాలనుకునేవారికి దివ్య ఔషధమని జీర్ణశక్తిని పెంచి, ఎన్‌జైమ్స్ ప్రాసెస్‌ను చక్కగా అధికపరుస్తుందని, విటమిను "సి", కార్బోహైడ్రేట్లు చక్కగా వున్నాయని, దీనివలన రక్తహీనతను అరికట్టుతుందని, జ్వరంలో నూ, గర్భిణీ కాలంలో నూ యీ రసం త్రాగడం చాలా మంచిదనీ హెల్త్ హెరాల్డ్ ఓ ప్రకటనలో చెప్పిందట- డ్రింక్ బత్తాయ్ డెయిలీ!

## హత్యకి దారితీసిన ఆవేశం!

మదనపల్లికి చెందిన దిగువకోనన్‌వారిపల్లి అనే గ్రామంలో 28 ఏళ్ళ సురేంద్రనాథ్ అనే అతని భార్య పెద్దమ్మ ఆ వూరి స్కూలులో టీచరుట. ఆమె పనిచేస్తున్న స్కూలు కాంపౌండుకు వున్న ముళ్ళ తీగను అదే వూరికి చెందిన 26 ఏళ్ళ ప్రతాప్ అనే మిలటరీ వుద్యోగి కత్తిరించడం చూసి పెద్దమ్మ వారించిందట. ఆ తగాదాలో సురేంద్రనాథ్ ఆ ప్రతాపూ మాటా మాటా మిదుగా జుట్టూ జుట్టూ వరకూ వెళ్ళారట. ఆవేశంలో ప్రతాప్ కొడవలి తీసుకుని ఆ సురేంద్రనాథ్ తల నరికి, తలనూ కొడవలినీ తీసుకుని మదనపల్లి పోలీస్ స్టేషన్‌కు వెళ్ళి వప్పగించాడట.

## మూషికాల మెదడు మార్పిడిలో భారతదేశం విజయం!

భారతదేశంలో మొట్ట మొదటిసారిగా వైద్య విజ్ఞానశాస్త్రం విజృంభించి న్యూఢిల్లీలో వో ఎనిమిది ఎలుకలకు మెదడు మార్పిడి చేసి సంతృప్తికరంగా ఆ ఫలితాన్ని సాధించిందట. ఈ విజ్ఞానుల టీము డాక్టర్ గోపాలదాసుగారి పర్యవేక్షణలో ఈ విజయాన్ని సాధించిందట. □





# ఎండ

### ఘండికోట బ్రహ్మాజీరావు

## ఎండ!

ఎండ పేరు తలచుకుంటేనే గుండెలలో దడ పుడుతున్నది.

గడచిన దినం నీడలో నూటపన్నెండు డిగ్రీలు. రాత్రి వడగాడ్పులు కూడా వీచాయి.

దయానిధి ఎండ గురించి ఆలోచించడంలేదు.

“బాబూ! రిక్షా! మాస్టరు బాబూ! రిక్షా!”

సైకిలువాడు గంట వాయిస్తూ వెంట పడుతున్నాడు.

కొత్తగా రోడ్డు వేస్తున్నారు- కాదు కాదు- పాత రోడ్డే... బాగు చేస్తున్నారు. మెట్లంగి రాళ్ళు మేకులవలె గుచ్చుకుంటున్నాయి. బొటన వ్రేలి మొన తేరిన రాయొకటి తగిలి నెత్తురు కారుతున్నది.

దయానిధి ఆ విధంగా కొద్ది దూరం నడిచి

ఆగిపోయాడు కట్టుకున్న పంచ అంచు చింపి ఎడమకాలి బొటన వేలికి కట్టుకున్నాడు

ఎనిమిదిన్నరకే ఎండ చురచుర లాడుంది

పాము బుసలకు మల్లేగాలి చెంపలకు తాకుతున్నది

దయానిది తిరిగి నడవడం మొదలు పెట్టాడు

సుమతీ! ఉప్మా చెయ్యడం తెలుసా? నేను చెప్తున్నాను విను పోపులో కొంచెం హెచ్చుగా సెనగపప్పు- కొద్దిగా ఆవాలు ఇంకా ఇంకా వాడ శ్రాద్ధం! వాడికి స్పెషల్ ఉప్మా కావాలట!

ఆడదానికి ఉప్మా చెయ్యడం రాదూ? అదేమైనా కొత్త రకం పిండివంటా? సుమతి కొత్త కోడలయితే మాత్రం ఉప్మా చేయడమే తెలీదా?

ఆమె ఆగర్భ శ్రీమంతురాలుకాదు మామూలు గుమాస్తా కూతురు

వెనుకనుంచి కారు హారను ఒకటే మోత అప్పటికి అతనికి తెలిసింది రోడ్డు దాటిబ్రిడ్జి వేపు వెళ్తున్నట్లు

స్టేషను బ్రిడ్జిమీద ఎడతెగని జనం- ఎవరి తాప వారిది- ఎండ నుండి తప్పించుకోడానికి గొడుగులు తలల మీద తడి గుడ్డలు

తడి గుడ్డలతో కొంత మంది గొంతుకలు కోస్తారు ఎలా కోస్తారో తనకు తెలియదు

నిన్నను నడవలో ఉదయం ఇదే వేళకు- వాడు బాగా ఆలస్యంగా లేచాడు ఉదయం అయిదు గంటలకే వెలుగువస్తే ఆ మహానుభావుడు ఎనిమిది గంటలకు లేచాడు అదింకా వాడికి చాల ఎర్లీ అట! హోటలులో ఎనిమిదిన్నరకు లేచి సరిగా తొమ్మిది కొట్టేసరికి పనిమీద బయలుదేరుతాడట! ఉన్నది ఒకటే పడకగది నాలుగడుగులు వెడల్పున్న నడవ- నడవ దాటి వెళ్తే వంటిల్లు, తరువాత పెరడు ఏం చేయడం?... ఇటువంటి ఇంట్లో ఉంటూ ఆరు నెలలయింది.... లేచిన వాడికి ఆమె ఎదురవుతుంది కాఫీలు.

"ఓహో మీరేనా! గుడ్ మార్నింగ్"

"నేను తెలుగు పిల్లను- నాకు గుడ్‌మార్నింగ్ లెందుకు? నేను మీకన్న చిన్నదానిని. మీ స్నేహితుని భార్యని. మామూలుగా సుమతి అంటే చాలు."

"ఇటువంటి పేరంటే నాకు ఎలర్జీ! పాత చింత కాయ పచ్చడి వంటి పేరు. ఏ సినిమా తారపేరో. ఏ రచయిత్రి సృష్టించిన హీరోయిన్ పేరో, పల్లవో, పావనో.. ఎన్నో పేరులుంటే ఇటువంటి పేరు ఎవరు పెట్టారు?"

"తల్లి దండ్రులు పెట్టిన పెద్దవాళ్ళ పేరిది."

"ఆదా సంగతి! ఏ బామ్మదో నన్నమాట. నేను చాల కరెక్టుగా చెప్పాను. మిమ్మల్ని చూడగలిగిన ఉత్సాహం, మీ పేరు వినడంతో నీళ్ళు కారి పోయింది ఆ క్షణం నుంచీ ఆలోచిస్తున్నాను. ఏ పేరుతో పిలుస్తే ఈ బంగారు పూవుకి తావి అబ్బుతుందని."



ఈ సంభాషణ ఢక్కా నౌబత్తులు చెవులలో వాయిస్తున్నట్లు రింగుమంటున్నది మరి వినలేక వీధిలోకి వెళ్ళిపోయాడు తాను

తాను తిరిగి వచ్చేసరికి ఇంట్లో అన్నీ మామూలుగానే ఉన్నాయి వాడు వెళ్ళి పోయాడు పడకగది చాల శుభ్రంగా ఉంది

వీధి వరండాలో దోమలని సిలింగు ఫాను లేదని రాత్రిళ్ళు నిద్ర పట్టడమే లేదని తినేస్తుంటే వాడికి పడకగదిలో చోటిచ్చి వరండాలో

దయానిదికి బ్రిడ్జి మెట్లు సమీపించినట్లు కూడా అనిపించలేదు ఒక్కసారిగా శరీరం తూలిపోయి పడిపోతున్నప్పుడు తెలిసింది అది మెట్లని

వెనుక వెనుక వస్తున్న దర్మాత్ముడెవడో పట్టుకున్నాడు లేకపోతే దయానిది ఈసరికి హాస్పిటల్‌లో ఉండేవాడే

సూర్యుడు బంతిలా ఆకాశం మీద ఎగురుతున్నాడు

ఒకటి ఒకటి మెట్లు దిగి మళ్ళా రోడ్డు పట్టాడు దయానిది

రైల్వే హాస్పిటల్ దాటి నడుస్తున్నాడు క్రమంగా కాలువ దాటాడు కాలువలో నీరులేదు లాకులు కట్టేసి చాల కాలమయింది నిండుగా మరకతం వంటి నీళ్ళతో నీలాల నీళ్ళతో పారుతుండే కాలువ మాడిపోయింది

కృష్ణ కాలువ పక్క నుండి పోతుంటే ఎవరో తెలిసిన వాళ్ళు పలకరించారు తన చెవులలో ఏదో పిలుపు- వాళ్ళందరూ తనని అడుగుతున్నారు ఎండలో ఎక్కడికని కాలికి కట్టిందుకనీ పంచ చిరిగిందేమని తాను దయానిది కానట్లు ముందుకు నడిచాడు

దారిలో వంతెన ఎదురయింది అది దాటి తిన్నగా పోతే ఏలూరు రోడ్డు ఎదురయింది ఈ పెద్ద రోడ్డు నిండా మనుష్యులు రిక్షాలు కారులు బస్సులు ఏమీ ఆలోచించకుండా దీనిమీద నడవాలి- ఆలోచనలతో నడిస్తే ఏ బస్సు క్రిందో కారు క్రిందనో పడడం తప్పదు

కాళ్ళు చురుకుతున్నవి రోడ్డు మీద నున్న తారు మెత్తబడుతున్నది ఆకాశం మీదికి సూర్యుడు ఎగ బ్రాకుతున్నాడు ఎండలో వేడి ఉందో వెలుతురు ఉందో అన్నీ ఉన్నవో-

అన్నీ ఉన్న గుణాభిరాముడు వాడు వాడి సంగతి తనకు బాగా తెలుసు రోజూ బజారుకు మోసుకుపోయే ఆ తోలుసంచి నుండి తన కొకటానిక్ - తన భార్యకో క్యాప్యూల్స్ ఉన్న సీసా ఇచ్చాడు తను బాగా నీరసంగా ఉన్నాడని తన భార్య అందం ఇంకా పెరుగుతుందని వాడు అన్నాడు

ఆ తోలు బాగులో ఇంకా ఏమిటి ఉందో చూపించాడు వాడికి చెప్పుకోడానికి సిగ్గు కూడా ఉండదు కొంతమంది స్నేహితులు అనుకోకుండా కలిస్తే పనికి వస్తుందట ఆ మందు సీసా

తనకి వాడికి ఏమంత స్నేహం లేదు వాడి పద్ధతే వేరు హైస్కూలులో చదువు కున్న రోజులలోనే

మొరాకోలో జరిగిన ప్రపంచ కవిసమ్మేళనంలో వరల్డ్ అకాడమీ ఆఫ్ ఆర్ట్స్ అండ్ కల్చర్ వారి అవార్డు పొందిన ప్రముఖతెలుగు కవి డా॥జె. బాపురెడ్డి గారిని ఇటీవల గుంటూరులోని సాహితీ సాంస్కృతిక సంస్థ 'చేతన' సన్మానించింది. ఆ సందర్భంగా డా. జె. బాపురెడ్డి గారిని సత్కరిస్తున్న ఆం.ప్ర. అధికార భాషా సంఘం అధ్యక్షుడు డా. సి. నారాయణరెడ్డి, సంస్థ అధ్యక్షుడు శ్రీ ఎ. విజయభాస్కర్ రెడ్డి గార్లని చిత్రంలో చూడవచ్చు.



చొక్కా కాలరు మీదకు లాక్కొని, చేతులు మడచి ఆడ పిల్లలను అల్లరి పెట్టేవాడు. తిన్ననయిన మనిషికాడు.

అటువంటి వాడి వలలో తనేలా పడిపోయాడు?....

ఆ ఎండ మండిపోతున్నది. తొందరగా నడవాలంటే మనుష్యులు. వాళ్లందరూ తనను చూస్తున్నారు. తన వేషం చూసి నవ్వుకుంటున్నారు.

... ఆ రోజు సాయంకాలం నాలుగు గంటలకు ఎవరో వస్తున్నారంటే తాను స్టేషనుకువెళ్లాడు. రావలసిన ఆతడు రాలేదు. వీడు తారస పడ్డాడు. వాడే ముందు పలకరించాడు. పెళ్లయిందంటే ఎప్పుడన్నాడు. పార్టీ అడిగాడు. పార్టీ లేకపోతే పోయె, కనీసం రాత్రి భోజనానికేనా ఫలవమన్నాడు. సాయంకాలం అయిదు గంటలకు తన వెనుకే వాడు కూడా ఇంటి దగ్గర హాజరయ్యాడు. రాత్రికి భోజనం చేసి, వరండాలో పక్క వేయించుకున్నాడు. తన అవసరాలు చాల తక్కువ అని, పొద్దున్నే పోతే రాత్రే వస్తానని ఇంట్లో తిష్ట వేశాడు....

క్రమంగా రోడ్డు మీద ఉన్న జనం పలచ బడుతున్నారు.

దయానిధి ఒక్క క్షణం ఆగాడు. పక్కనే వెదురు చాపలతో కట్టిన చిన్న గది. ఎవరో ధర్మాత్ములు దారిపోయేవారికి కుండలలో మంచి నీరు పంచుతున్నారు. అక్కడనున్న కుర్రాడు చేతులు కడుక్కోడానికి కొంచెం నీళ్లు పోసి, తరువాత దోసిలిలోకి చల్లని నీరు పోశాడు. రెండు చెంబులు నీళ్లు తాగి, మూతి చేతితో తుడుచుకొని దయానిధి తిరిగి నడక మొదలు పెట్టాడు.

రోడ్డు మీద తారు మిల మిలా మెరుస్తున్నది. సూర్యుడు నడి నెత్తికి వచ్చాడు.

దయానిధి రోడ్డు పక్క నుంచి నడుస్తున్నాడు. నీళ్లు తాగిన తరువాత చెమటలు హెచ్చయ్యాయి. గాలి వీచడం మానేసింది. ఎండ ఇంకా ముదిరి పోయింది. వెలుతురు బలిసింది. కళ్లకి అన్నీ చెదురు మదురుగా కనిపిస్తున్నవి. నుదుటి మీద నుండి కారుతున్న చెమట కను రెప్పల మీద పడి, కళ్లల్లోకి జారి మంట పెడుతున్నది. కాలికి తగిలిన దెబ్బ ఉండుండి సలుపుతున్నది.

దారి పక్కను పెద్ద మర్రి చెట్టు- దాని కొమ్మలు చాచుకొన్నాయి. ఆ నీడనిచ్చే చెట్టు తల్లివలె తనను ఒడిలోకి తీసుకుంది. ఆ సుఖం ఎంతోసేపోలేదు.

....వాడు జోక్ వేస్తున్నాడు.

"నువ్వు యంగ్ లేడీనా? ఓల్డు మెయిడ్వా? ఓల్డు మాన్ని కట్టుకున్న యంగ్ వుమన్వా? లేక యంగ్ మాన్ని కట్టుకున్న ఓల్డు లేడీవా? ఇప్పటి నుంచీ అంత మడీ, ఆచారం అయితే ఎట్లా?"

"మీ మాటలు చాల వింతగా ఉంటాయి. ముసలి మగాళ్లు పడుచు ఆడవాళ్లను కట్టుకోడం విన్నాను. మూడోపెళ్లి, నాలుగో పెళ్లి చేసుకున్న మగాళ్లున్నారు. ఎక్కడా అమ్మమ్మలు పడుచుకుర్రాళ్లను పెళ్లి చేసుకున్నట్లు వినలేదు.

## ఎండ

"ఓ యంగ్ లేడి! అమెరికాలోని అమ్మమ్మలు అయిదో పెళ్లి చేసుకుంటారు. పడుచువాళ్లను ఎంచెంచి ప్రేమిస్తారు."

ఆమె నవ్వింది. చెరువులోని చిరుతరగలు కదిలినట్లు, పూలగుత్తి గాలిలో ఊగినట్లు అనిపించింది. ఆ నవ్వు ఎంతో అమాయికంగా ఉంది. నవ్వు ఆరోగ్యవంతుల లక్షణం.

వాడూ నవ్వాడు. వాడు వేసిన జోక్కి వాడు తప్పకుండా నవ్వుతాడు. కాని, ఎదుటివాడు నవ్విన తరువాతే నవ్వుతాడు. ఆ నవ్వు కృతకంగా ఉంటుంది. ఏ నక్కో, తోడేలో, సివంగో... అటువంటిదేదో జంతువు.... అది నవ్వుతుంది. చంపబోయే మేక పిల్లలను చూచి నవ్వుతుంది. దానిపై పెదవి మీదకి లేస్తుంది. పళ్ళు కనిపిస్తుంటాయి. మేక పిల్ల హడలి చచ్చేటట్లు అది నవ్వుతుంది. ఆ దుమ్మలగుండు నవ్వు వాడిది....

గాలిలో కొంచెం చలనం కలిగింది.

ఆ మర్రిచెట్టు నీడలో ఉండడానికా తాను ఇంత దూరం వచ్చినది?

ఎక్కడికీ ప్రయాణం-

వాడెవడో- వాడి మీద కోపంతో

ఒళ్లు మండిపోతున్నది. హృదయం దహించుకు పోతున్నది. వాడి గురించి తలచుకుంటే అన్నీ మంటలే.

రోడ్డు పక్కను, చెట్టు వెనుక ఒక కాలి దారి కనిపిస్తున్నది ఆ దారి వెంబడి వెళ్తుంటే పొలాలు. ఆ పొలాలు ఎండిపోయి, భూమి బీటలువారి... చూడరాని వాని శరీరం వలె ఉంది.

దయానిధి నడుస్తున్నాడు పొలం గట్ల మీద.

.... నడవలో, మరొకడి పెళ్లాని నిలబెట్టి నిర్లజ్జగా ప్రశ్నలువేస్తున్నాడు- ఆమె కళ్లల్లోకి సంకేతాలు పంపుతున్నాడు. స్నేహితుడి సంసారాన్ని విచ్ఛిన్నం చేయడానికి కొంచెమైనా జంక కుండా ఉన్నాడు.

వాడిని ఏం చేయాలి?

మందులు మాకులు ఇచ్చి ఆడదానిని వశపరచుకుంటున్నాడు.

వాడినేం చేయాలి??

మరొకడి భార్య పేరు భాగులేదని కొత్త పేరు వెతికే వంచకుడువాడు.

వాడినేం చేయాలి???

పాశ్చాత్య దేశాలలో తనకుమల్లే దగా పడ్డవాడు ద్రోహితో ద్వంద్వ యుద్ధం చేస్తాడు. కత్తి, బల్లెం, పిస్తోలు, ఏదో ఒకటి ఉపయోగిస్తారు. ఎదురెదురుగా వచ్చి పోట్లాడుతారు.

గెలిచిన వాడితో ఆ స్త్రీ కులుకుతుంది.

ఈ యుద్ధంలో తానే చచ్చిపోతున్నాడు.

"మీరిద్దరూ హాయిగా ఉండండి!"

దయానిధి తూలిపోతున్నాడు. ఆ పొలాల గట్లు వెడల్పు లేవు. ఆ గట్ల పక్కను ఒక్కొక్క చోట గుంటలు, ఆ గుంటలు ఎండిపోయాయి. గట్ల మీద దారి వంపు తిరిగింది. కొంత దూరం పోతే దారి పక్కనో బురద గుంట. అందులో ఇంకా తేమ కనిపిస్తున్నది.

దయానిధి కాలికి రాయి తగిలింది. అతను తూలిపోతున్నాడు. గాలికి పిడికిళ్లు పడుతున్నాడు. ఆ బురదగుంటలోకి దిగిపోయాడు.

ఆ బురద లావావలె ఉంది.

లోపలికి దయానిధిని లాక్కుంటున్నది.

ఆ ఊబి అతనిని మింగుతున్నది.

* *

సుమతికి హఠాత్తుగా తెలివి వచ్చింది.

ఆమె నేల మీద పడుకుంది కాబట్టి సరిపోయింది. మంచం మీద పడుక్కొని ఉన్నట్లయితే దొర్లి క్రిందకు పడిపోయేది. ఆమె మెడలోని మంగళ సూత్రం పైకి తీసి కళ్ల కద్దుకొంది. ఎంత ఆపుకుందామన్నా ఆమెకు దుఃఖం ఆగలేదు.

పగలు భోజనం లేదు. నోరెండిపోతుంటే మంచి నీళ్లు తాగుతున్నది. ప్రొద్దున్న భర్త కోసం ప్లేటులో పెట్టిన ఉప్మా, తాను తిందామని గిన్నెలో ఉంచినది అలాగే ఉంది.

ఆ ఉప్మానిండా జీడి పలుకులు, చేతికంటుకున్నట్లు వెన్న కాచిన నేయి ఆ వచ్చినస్నేహితుడెవరో చాలా చాలా బాగుందని మారు వేయించుకున్నాడు. అతను చెప్పిన పద్ధతికన్న చాల బాగా చేయగలనని నిరూపించింది తాను.

కాని, ఆయన రుచి కూడా చూడలేదు. ఎవడో మెచ్చుకుంటేనేం, లేకపోతేనేం.

ఏమీ అర్థం కాకుండా ఉంది.

ఇంట్లో ఎవరున్నారని? తనూ, ఆయన... ఈ మధ్యను అతని స్నేహితుడు. ఆ స్నేహితుడు వచ్చిన తరువాతే ఇబ్బందులు మొదలయ్యాయి.

ఇద్దరూ అయిదో తరగతి నుండి ఇంటరు వరకూ కలిసి చదువుకున్నారట! ఆయనకీ, ఆ స్నేహితుడికీ ఎంత భేదం? ఆయన ఎంత నిరాడంబరమైనవారో, ఆ స్నేహితుడంత డాంబికుడు. ఆయన మిత భాషి. ఈ స్నేహితుడు అవసరమున్నా లేకపోయినా తన ప్రజ్ఞ తెలుపుకోవాలని తెగవాగుతాడు. వీళ్లిద్దరిలో ఎవరు గొప్ప? గొప్ప వాళ్లు తాము సామాన్యులమంటారు- ఈ సామాన్యుడు చాల గొప్ప వాడినంటాడు. ఛీ...

నిన్నను ఉదయం ఎనిమిది గంటల వేళ, ఆ స్నేహితుడు అప్పుడే లేచాడు. తాను వంటింట్లోంచి వస్తున్నది. దారికడ్డంగా ఆ పెద్ద మనిషి నిలుచున్నాడు. పొద్దున్నే ఏదో అసందర్భ ప్రలాపన. తన పేరు చాల పాతదట. సినిమా తారల పేర్లో, అంతకన్న మంచివో ఆ మహాశయుడు తనకు పెట్టాలని ఆలోచిస్తున్నాడట! దారికడ్డం లెమ్మని కసిరేదాకా కదలలేదు.

తను కాఫీ పట్టుకొని గదిలోకి వెళ్తే ఆయన లేరు. ఎక్కడికో వెళ్ళిపోయారు. ఎందుకని?

ఏమీ అర్థం కాకుండా ఉంది.

ఆ రోజు సాయంకాలం ఎవరికోసమో స్టేషనుకి వెళ్ళిన ఆయన ఈ స్నేహితుడిని వెంటబెట్టుకొని వచ్చారు.

ఈ పెద్ద మనిషి అంత ఎండా కాలంలోను సూటుతోనే ఉన్నాడు. ఒక చేతిలో సూట్‌కేసు, రెండవ చేతిలో మందుల బాగు. అతని కాళ్ళకున్న బూట్లు మెరుస్తున్నాయి

* * *

వాళ్ళిద్దరూ పడకగదిలో కూర్చున్నారు.

ఆయన నన్ను పిలిచారు.

"వీడు మా స్నేహితుడు, మురళీకృష్ణ. ఇద్దరం కలిసి చదువుకున్నాము. ప్రస్తుతం మందుల ఏజెంటుగా పని చేస్తున్నాడు. రాత్రి మన యింటికి భోజనానికని పిలిచాను- కృష్ణా! ఈమె నాభార్య, సుమతి."

ఆ విధంగా ఈ పెద్ద మనిషి పరిచయమయాడు.

రాత్రి సుష్టుగా భోజనం చేశాడు. వరండాలో పక్క వేయించుకున్నాడు. ఏమీ మొహమాటం లేని మనిషి. మరునాడు ఉదయం టిఫిన్ తిని, కాఫీ తాగి వెళ్ళవలసిన మనిషి మధ్యాహ్నం భోజనానికి వస్తానన్నాడు. ఆయన ఏమీ మాట్లాడలేదు.

ఆ పరిస్థితులలో నేనేం చేయాలి?

ఆ స్నేహితుడెంత అప్పుడో.

క్రమంగా అతను చొరవ తీసుకున్నాడు. పడగ్గది ఆక్రమించి దంపతులని వరండాలోకి పంపించాడు. ఇంటి విషయాలలో కలిగించుకున్నాడు. ఆయనను చులకన చేసి మాట్లాడాడు. తనతో స్నేహం పెంచుకోడానికి తాపత్రయ పడుతున్నాడు.

ఈ విషయాలన్నీ పక్కింటి పిన్నిగారికి తాను మధ్యాహ్నం చెప్పింది.

ఆవిడ ముక్కు మీద వేలు వేసుకున్నారు.

ఆయన ఇల్లు విడిచి వెళ్ళిపోయారని, మధ్యాహ్నం భోజనానికి ఈ పెద్ద మనిషి వస్తాడని, పిన్నిగారిని సహాయంగా ఉండమని తాను మరీ మరీ కోరింది.

పిన్నిగారిని చూడగానే అతను ముఖం ముడుచుకున్నాడు.

ఏదో అనవసర విషయమై లెక్చరు మొదలు పెడితే తాను అక్కడ నుంచి వెళ్ళిపోయింది.

ఇంటి యజమాని, తన స్నేహితుడు ఏమయాడని కాని, ఎప్పుడు వస్తాడని కాని అడగలేదు.

"నీకు ఇచ్చిన మందు వాడుతున్నావా? ఒక నెలలో ఎంత మార్పు వస్తుందో చూడు. ఎంత అందంగా తయారవుతావో. నీవంటిదానిని ఈ రామేశ్వరపు రాచిప్పగాడికి కట్టబెట్టారు. నేను చాల ఫీలవుతున్నాను."

తాను ఆ మాటలు విన్నా జవాబు చెప్పలేదు.

ఆ పెద్ద మనిషి మధ్యాహ్నం వెళ్ళిపోయిన తరువాత పిన్నిగారు అన్నారు.

"అమ్మాయ్! వీడెవడో?.. వీడి వ్యవహారం బాగులేదు. నువ్వు కొత్తగా కాపురానికి వచ్చావు. నీ మొగుడు చాల మంచివాడు. ఆరు నెలలయి మా పొరుగున ఒంటరిగా ఉన్నా. ఏ ఆడదానిని కన్నెత్తి చూచిన పాపాన పోలేదు. మా కుర్రాడు మీ ఆయన శిష్యుడు. మాస్టరుగారంటే వీడికి ఎంత గౌరవమో తెలుసా?"

సుమతికి కళ్ళంట నీళ్ళు ధారలుగా కారుతున్నాయి.

ఆయన ఎక్కడికి వెళ్లారు?

ఆకలికి ఉండలేరు. ఏమవస్థ పడుతున్నారో?"

వండిన వంట అంతా పని మనిషి కిచ్చింది.

"అమ్మగారూ! వంట్లో బాగులేదా?"

తాను అవునని తల ఊపింది.

ఎండ చాల మొండిగా ఉంది. ఏం చేయడం?... ఏమీ తోచక నేల మీద కొంగు పరుచుకొని పడుక్కుంది. ఆకలి, ఆలసట, నిస్సహాయత్వం అన్నీ కలిసి తనను జోకొట్టాయి.

ఆ నిద్రలో ఏదో కల- వాడెవడో చాల అందమయినవాడు- కాని వాడి హృదయంలో విషం- చూపులలో హాలాహలం తనను సమీపించి మెడలోని మంగళసూత్రం తెంపడానికి...

ఆమెకు ఒళ్ళల్లా చెమట పట్టింది. శరీరం వొణుకుతున్నది.

"పిన్నిగారూ! చాలా భయంగా ఉందండీ! ఆయన ఇంకా రాలేదు. ఏం చేయను పిన్నిగారూ?"

"అమ్మాయ్! మీ ఆయన దెబ్బ తగిలినా లక్ష్యం చేయకుండా నడుస్తున్నాడని రిక్షావాడు చెప్పాడు. పలకరించినా తొందరగా నడిచిపోయాడని స్నేహితులు చెప్పారు. ఇది అనుమాన రోగం. ఇవన్నీ దాని లక్షణాలే. మీ ఆయన వట్టి మేదకుడు. ఒకరి మనసును మాటలతోనేనా కష్టపెట్టలేడు. వచ్చిన పెద్ద మనిషి ఈ నిజం తెలుసుకున్నాడు. వలలు పన్నుతున్నాడు. నీ కాపురం నువ్వే నిలబెట్టుకోవాలి. ధైర్యంగా ఉండు. మీ ఆయన వస్తాడులే"

ఆపాటి ధైర్యమిచ్చారు పిన్నిగారు.

కాపురం నిలబడడానికి ఒక్కటే మార్గముంది.

సుమతి పెరటిలోకి వెళ్ళింది.

"ఓ భగవంతుడా! మా వారిని ఇంటికి రప్పించు తండ్రి!"

అప్పటికే సూర్యుడిని కబళించిన మేఘం ఆమెకు అభయమిచ్చింది.

* * *

దయానిధి ఊబిలో పూర్తిగా కూరుకుపోలేదు. మొలవరకు అతని శరీరం దిగిన తరువాత చేతికి గట్టిగా భూమి తగిలింది. అందులోని బురద మీది భాగంలో చాల వేడిగా ఉన్నా పాదాల దగ్గిర వెచ్చగా ఉన్నట్లుంది. బైట పడడానికి అతను ప్రయత్నించాడు. కాని లాభం లేకపోయింది.

అతను ఆకాశం వేపు చూచాడు.

సూర్యుడిని కప్పడానికో మేఘం తరముకుంటూ వస్తున్నది. దూరాన ధూళి లేస్తున్నది. ఆ దుమారం తనను దాటి వెళ్ళిపోయింది. ఆ మేఘం ఆకాశాన్ని ఆక్రమించుకుంటున్నది. ఏదో గాలిలో ఛల్లదనం. దానితో రత్నాలవలె నేలకు రాలిన చినుకులు. తొలి చినుకులతో లేచిన ఆవిరులు. ఆవిరులు లేవక



ముందే మొదలయిన వర్షం. ఆ వర్షం నిలకడగా నిలిచి ధారాపాతంగా కురియడం మొదలు పెట్టింది. దయానిధికి దివ్యమైన అనుభూతి కలిగింది.

చెప్పరాని ఆనందం చిందులు వేసింది.

అతనిని మొలవరకు బంధించిన బురద చల్లబడింది. మెత్తబడింది. కరిగింది. అతని శరీరం దాని పట్టునుండి తప్పుకొంది. కొద్ది ప్రయత్నంతో అతను పైకి వచ్చాడు.

వర్షం కురుస్తుంటే అతను శరీరానికి పట్టిన మన్ను కడుక్కున్నాడు. ఇంకా కురుస్తూంటే చేతులు మరొకసారి శుభ్రం చేసుకొని దోసిలి పట్టాడు. దోసిలి నిండిన వర్షపు నీరు తాగాడు– మరొక దోసిలి– ఇంకొక దోసిలి.

మడిగట్లు జారుతున్నవి. పడుతూ లేస్తూ దయానిధి తనకు నీడనిచ్చిన మర్రి కిందికి వచ్చాడు.

అప్పుడు అతనికో సంగతి జ్ఞాపకం వచ్చింది.

ఒకసారి ఇలాగే సాయంకాలం వేళ వర్షం వచ్చింది. ఉన్నట్లుండి ఆకాశాన్ని చిక్కటి నల్లని మేఘాలు కప్పివేశాయి. స్కూలులో ఆఖరి గంట కొట్టారు. ఏనుగు తొండాలతో వర్షం కురుస్తూంటే పిల్లలు ఎవరూ క్లాసు విడిచి వెళ్లలేదు. వరుసగా రెండు పిడుగులు పడ్డాయి. వాటితో కరెంటు కూడా పోయింది. ఒకరి ముఖం ఒకరికి కనిపించని చీకటి.

"కాలక్షేపానికి మీకందరికీ..."

అంత వరకు అతను అన్నాడో లేదో అందరు కుర్రాళ్లు చప్పట్లు చరిచారు. వాళ్లకు ఎంతో సంతోషం. ఏదో కొత్త విషయాలు అతను చెప్తాడని వాళ్లకి తెలుసు.

"వినండి! ఒక వర్తకుడు తన భార్యని విడిచి పెట్టి పైదేశాలకు వ్యాపారం మీద వెళ్లిపోయాడు. ఏళ్లు గడిచిపోయాయి. అతను ఎన్నో మజిలీలు చేసి ఒకనాటి మధ్యాహ్నం భార్యను చూడాలన్న కోరికతో ఇల్లు చేరుకున్నాడు. మధ్యాహ్నవేళ ఇంటి తలుపులు కూడా వేసి లేవు. అతను ఆ తలుపుల్ని మెల్లిగా తోశాడు. ఆ చప్పుడికి లోపలివాళ్లు ఎవరూ లేవలేదు. గదిలో ఒక పక్కని మంచం మీద అతని భార్య నిద్రపోతున్నది. ఆమె పక్కను మరొక పురుషుడు కూడా నిద్రిస్తున్నాడు. వాళ్లిద్దరినీ చూస్తుంటే ఆ వర్తకుడికి భరించరాని కోపం వచ్చింది. అతడు వెనుక, ముందు ఆలోచించలేదు. చూరులోనున్న కత్తిని ఒక్కసారి బైటకు లాగాడు. వాళ్లిద్దరినీ నరికి చంపాలని. ఆ కత్తితో పాటు ఒక తాటాకు కూడా కిందను పడింది. అదేదో ఉత్తరం అనుకొని వంగి దానిని భద్రంగా తీసి చదవడం మొదలుపెట్టాడు. అతనికి అప్పుడు జ్ఞాపకం వచ్చింది. ఎవరో కవిగారు, భార్య వ్రతానికి డబ్బు లేక, ఈ శ్లోకం తన దగ్గర తాకట్టు పెట్టాడు. అందులో ఏముందో తెలుసా?"

తొందరపడి ఏపని చేయరాదు. అవివేకము ఆపదలకు మూలము. ఆలోచించి పని చేసేవారిని సంపదలు వెతుక్కుంటూ వస్తాయి.

# కేన్సర్ చికిత్సలో హిప్నాటిజమ్!

మానసిక వ్యాధుల చికిత్సలో హిప్నాటిజమ్ చోటు చేసుకుంటున్నది. ఈ ప్రక్రియను ఆటో హిప్నాసిస్ అని అంటారు. ఈ విధానంలో సుషుప్తావస్థకు ప్రాధాన్యత లభిస్తుంది. ఈ స్థితిలో మనిషికి వైద్యునకు అడ్డుగా నిలిచే భయాలు, సందేహాలు తొలగిపోతాయి రోగి ఈ స్థితిలో తన మనస్సుని వైద్యునికి తెలియచేయటానికి వీలవుతుంది. మరో కరు సూచనలు చేసి రోగిని హిప్నటైజ్ చేయడం పట్ల ఏర్పడే అపోహలు ఆటో హిప్నాసిస్ వలన తొలగిపోతున్నాయి.

ఇటీవల పశ్చిమ జర్మనీలోని మ్యూనిచ్ విశ్వ విద్యాలయంలో జరిగిన హిప్నాసిస్ – హిప్నో థెరపీ సమావేశాలకు ప్రపంచం నలు మూలల నుండి పలువురు శాస్త్రవేత్తలు పాల్గొన్నారు. ఈ సమావేశంలో కేన్సరు చికిత్సలో హిప్నాటిజమ్ పాత్ర గురించి పలువురు ఉపన్యసించారు. శస్త్ర చికిత్సల తరువాత రోగిలో ఏర్పడగల మానసిక దుష్పరిణామాలని తొలగి రోగి జీవించగల అవకాశాలను మెరుగు పర్చడమే హిప్నోథెరపీ ప్రధానోద్దేశ్యం. ఈ రంగంలో టెక్సాస్ వైద్యులు గార్ల్ సిమన్‌టన్ కృషి ప్రముఖంగా పేర్కొన దగినది. సిద్ధాప సూచనల ద్వారా రోగిలోని రక్షణ శక్తిని చైతన్య వంతం గావించడానికి ఆయన కృషి చేశారు.

ప్రస్తుతం కొన్ని దేశాలలో, దంతవైద్యం మొదలు కొని కేన్సర్ చికిత్స వరకు పలు రంగాలలో బాధా నివారిణిగా హిప్నోథెరపీని ఉపయోగిస్తున్నారు. అంతేగాక, మనిషి జీవించి నంతకాలం నిరాశావాదాన్ని, అలసటని తొలగించి అర్థవంతమైన జీవితాన్ని గడిపేందుకు వీలుగా దీనిని రూపొందిస్తున్నారు. ఈ వైద్య ప్రక్రియ మానవుని జీవిత విధానాన్ని నిస్సందేహంగా మెరుగు పరచగలదని భావిస్తున్నారు.

(గ్లోబల్)

## ఎండ

ఆ పడుకున్నవాడు పదిహేను ఏళ్ల తన కొడుకే అని తెలుసుకున్నాడు. ఆ కవి ఎవరో తెలుసా?"

క్లాసులోనున్న పిల్లలు వింటున్నారు. చెవులప్పగించి వింటున్నారు వర్షం వెలిసిన సంగతి కాని, తిరిగి లైట్లు వచ్చాయని కాని వాళ్లు గుర్తించలేదు. ఎవరూ వెళ్లిపోడానికి తొందర పడడం లేదు.

వాళ్లందరూ ఆ కవి పేరు వినాలని, ఆ శ్లోకమేదో వ్రాసుకోవాలని కూర్చున్నారు.

"ఆ కవి భారవి- ఆ శ్లోకం- సహసా విదధీత న క్రియామ్! అవివేకః పరమాపదాం పదమ్..."

దయానిధి మనస్సులో అమృత వృష్టి కురిసింది.

లోకాన్ని అపార్థం చేసుకోడం ఎంత సులువు.

దీపాలు వెలిగిన నగరం వైపు దయానిధి నడిచాడు.

* * *

సుమతి వీధి అరుగు మీద కూర్చుంది. వంట, పనులు పూర్తి చేసింది. తరువాత స్నానం చేసింది. దేవుడి దగ్గర దీపం పెట్టింది. ఆ మురళీ కృష్ణ బట్టలు, బాత్‌రూమ్ చెప్పులు సూట్‌కేసు గదిలోంచి తెచ్చి అరుగుమీద పెట్టింది. మరచిపోకుండా భర్త కచ్చిన టానిక్, తన మందు సీసా తెచ్చింది.

మురళీకృష్ణ వచ్చేసరికి ఎనిమిదయింది.

ఆటో దిగాడు అతను. అతని చేతిలో లెదర్ బాగు ఉంది. రెండవ చేతిలో సన్నజాజి దండలు, స్వీట్లు ఉన్న పాకెట్లు స్పష్టంగా వీధి దీపం వెలుతురులో కనిపిస్తున్నవి.

"హలో డార్లింగ్" అతను ఒంటరిగా అరుగు మీద కూర్చున్న సుమతిని చూచి పలకరించాడు.

వీధి మెట్లు అతను ఎక్కడానికి కూడా ఆమె అవకాశం ఇవ్వలేదు.

"ఆగండి!" ఆమె ఉరిమింది.

పొరుగింటి పిన్నిగారు, పక్కింటి తాతగారు అరుగుల మీదికి వచ్చారు.

మురళీకృష్ణ నిలబడిపోయాడు.

"ఇంత వరకూ మీరు చేసిన అపకారం చాలు– మీరు, మీ మందులు మీ చాతుర్యం చాలు. మీరు నమ్మ దగిన స్నేహితులు కారు, కుటుంబాలను విచ్ఛేదం చేసే ఘనులు, ఈ యింట్లో అడుగు పెట్టే అవకాశం పోగొట్టుకున్నారు. ఇవన్నీ మీవి. తీసుకొని వెంటనే వెళ్లిపొండి!"

మురళీకృష్ణ నీరు విడిచిపోయాడు.

వెళ్లిపోతున్న ఆటోని పిలిచి సామాను తీసుకొని వెళ్లిపోయాడు.

సుమతి నీరసంగా పడక గదిలోకి నడిచి ఏడుస్తూ కూలబడింది.

ఇంటికి కొంచెం దూరంలో నిల్చబడి తతంగమంతా చూస్తున్న దయానిధి మెల్లిగా ఇంట్లోకి వచ్చాడు. వీధి తలుపులు వేశాడు. పడక గదిలోకి వెళ్లాడు.

"సుమతీ!"

ఆమె వెక్కి వెక్కి ఏడుస్తూ కాళ్ల మీద పడింది.

ఆమెను రెండు చేతులతోను లేవనెత్తాడు.

"స్నానానికి నీళ్లు తోడు! చాల ఆకలిగా ఉంది!"

ఆమె కళ్లు ఒత్తుకొని అతని వెనకనే స్నానాల గదివైపు నడిచింది. □

# తెలుగు జాతికి వెలుగు జ్యోతి



రెండున్నర సహస్రాబ్దాల పురా వైభవంతో ప్రసిద్ధికెక్కిన తెలుగుజాతి చరిత్రనిండా అపూర్వ సంఘటనలు ఎన్నెన్నో ! శౌర్య పరాక్రమ ప్రాభవాలతో, సౌజన్య సౌశీల్య, స్నేహ పరిమళాలతో, లలితకళా వికాశ కాంతులతో దేశ దేశాల్లో ప్రసిద్ధికెక్కిన తెలుగుజాతి సగర్వంగా తలెత్తుకు తిరగగల సంఘటనలెన్నిటినో సృష్టించింది.
ఇటీవలి కాలంలో అపూర్వ ప్రజాభిమానంతో అఖండ విజయ పరంపరలతో అసాధారణ రీతిలో రాష్ట్ర రథ సారధ్య బాధ్యతను స్వీకరించిన శ్రీ ఎన్. టి. రామారావుగారి నాయకత్వంలో రాష్ట్ర సర్వతోముఖ వికాసానికి, పేదవర్గాల సత్వరాభివృద్ధికి అనేక కార్యక్రమాలు, ప్రగతి పథకాలు, సంక్షేమ చర్యలు ప్రారంభమయ్యాయి.

గడచిన రెండేళ్లలో వివిధ రంగాలలో సాధించిన ప్రగతే అందుకు నిదర్శనం. మరొక సారి రాష్ట్ర ప్రజలు చూపిన అపార విశ్వాసంతో, ఇచ్చిన మద్దతుతో ప్రజా సంక్షేమ దిశగా మరింత నూతనోత్సాహంతో వివిధ కార్యక్రమాలను చేపట్టడానికి సమాయత్తమైంది ప్రభుత్వం.

## గత రెండేళ్లుగా ప్రభుత్వం చేపట్టిన కార్యక్రమాలు :

- ★ 2 రూ. లకే కిలో బియ్యం పథకంవల్ల 96.54 లక్షల కుటుంబాలకు ప్రయోజనం.
- ★ పేదలకోసం 1.85 లక్షల పక్కా యిళ్ల నిర్మాణం. అవి గాక నిర్మాణంలో 90,000 పక్కా యిళ్లు.
- ★ 7.18 లక్షల యిళ్ల స్థలాలు పంపిణీ.
- ★ 5 లక్షల వృద్ధ వ్యవసాయ కూలీలకు నెలకు రు. 30 చొప్పున పించను.
- ★ సంక్షేమ పథకాలవల్ల 18.54 లక్షల బలహీనవర్గాల కుటుంబాలకు ప్రయోజనం.
- ★ గ్రామాల్లో మంచినీటిఎద్దడి తొలగించడానికి 28,180 నీటి వనర్ల ఏర్పాటు.
- ★ 3,310 గ్రామాలకు, శివారు గ్రామాలకు విద్యుచ్ఛక్తి సౌకర్యం
- ★ లక్ష పంపుసెట్ల విద్యుదీకరణ.
- ★ గ్రామాల్లో 24,000 గ్రామీణ, చిన్నతరహా పరిశ్రమల ఏర్పాటు.
- ★ గ్రామోదయ, విముక్తి పథకాల ద్వారా 21,000 మందికి ప్రయోజనం.
- ★ మధ్యాహ్న భోజన సౌకర్యంవల్ల 34.32 లక్షల బడిపిల్లలకు మేలు.
- ★ వెనుకబడిన తరగతుల విద్యార్థులకోసం 859 హాస్టళ్ళు.
- ★ జిల్లాకు రెండేసి షెడ్యూలు కులాల నివాసిత పాఠశాలలు.
- ★ ఆకుపచ్చ రేషన్‌కార్డులున్న పేదవారికి సగం ధరకే చీర, ధోవతి.
- ★ బ్రిటీష్ సామ్రాజ్యవాద ప్రభుత్వ వారసత్వంగా వున్న గ్రామోద్యోగ వ్యవస్థ రద్దు.
- ★ ప్రజలకు సన్నిహితంగా ప్రభుత్వ పరిపాలనకు వీలుగా రెవిన్యూ మండలాలు.
- ★ గ్రామ ప్రాంతాల్లో అభివృద్ధి పనుల్లో 'శ్రమ శక్తి' పథకంద్వారా మధ్య దళారీల తొలగింపు.

## 1985-86 లో ...... రూ. 1044 కోట్ల వార్షిక ప్రణాళిక

| | |
|---|---|
| ★ సబ్సిడీ బియ్యం పథకానికి | రు. 160 కోట్లు |
| ★ సగం ధరకు నేత చీరలు, ధోవతుల సరఫరాకు | రు. 4 కోట్లు |
| ★ వృద్ధాప్యపు పింఛన్లకు | రు. 720 లక్షలు |
| ★ వృద్ధ వ్యవసాయ కూలీల పింఛన్లకు | రు. 24 కోట్లు |
| ★ స్వంత రిక్షా పథకం అమలుకు | రు. 75 లక్షలు |
| ★ గ్రామీణ నీటి సరఫరాకు | రు. 25 కోట్లు |
| ★ గ్రామాల్లో విముక్తి పథకం కోసం | రు. 5 కోట్లు |
| ★ పట్టణాల్లో విముక్తి పథకం కోసం | రు. 7 కోట్లు |
| ★ సేద్యపునీటి సౌకర్యానికి | రు. 225.90 కోట్లు |
| ★ విద్యుచ్ఛక్తికోసం | రు. 200.41 కోట్లు |
| ★ షెడ్యూలుకులాల విద్యార్థుల నివాసిత పాఠశాలలకోసం | రు. 13.07 కోట్లు |
| ★ వెనుకబడిన తరగతుల ఆర్థిక సహాయ పథకాల కోసం | రు. 450 లక్షలు |
| ★ వెనుకబడిన తరగతుల విద్యార్థులకోసం కొత్తగా నిర్మించే వసతి గృహాలు | 50 |
| ★ మహిళలకోసం కొత్తగా నిర్మించే పాలిటెక్నిక్‌లు | 2 |

## ప్రజా సంక్షేమమే ప్రభుత్వ ధ్యేయం - ఈ ప్రభుత్వం ప్రజలకే అంకితం

DIPR No. 3/Advt II/C4/85 సమాచార, పౌర సంబంధ శాఖ, హైదరాబాదు.




## (గత సంచిక తరువాయి)

అనారోగ్య కారణంగా కొడుకు దగ్గరకెళ్ళి నాలుగు నెలలు వుండి వచ్చిన ముసలి నౌకరు రంగయ్య ఇంటి బాధ్యతంతా నెత్తిన వేసుకున్నాడు. సుభద్రమ్మగారు లేకపోవటమే కాకుండా మంగి కూడా లేక పోవటంతో ఇల్లంతా దుమ్ము, ధూళితో నానా రభసగా వుంది. రంగయ్య వచ్చే నాటికి సుభద్రమ్మగారు వెళ్ళి వారం రోజులయింది. ఒక రోజు పొద్దున పేపరు చూస్తూ కూర్చున్న శ్రీ కాంత్ దగ్గరకు 'బాబూ!' అంటూ వచ్చాడు. రంగయ్యను చూడగానే శ్రీకాంత్‌కి ప్రాణం లేచి వచ్చింది. ఇంట్లో పలికే దిక్కు లేకుండా వుంది. కొత్త నౌకర్లను పెట్టుకోవ టానికి వీలులేదు. ఉన్న వాళ్ళందరూ తలోదోవా పోయారు. సంధ్య వంట ఇంటి వైపే రాదు. నాలుగు రోజుల నుంచీ హోటలే గతవుతుంది. రెండు రోజులు సంధ్య భోజనమే చెయ్యలేదు. పది గంటలకి వెళ్ళి సాయంత్రం ఏ అయిందింటికో ఆరింటికో వచ్చేది. ఎక్కడకని శ్రీకాంత్ అడగలేదు. సంధ్య చెప్పలేదు. మూర్తి గీతతో కలకత్తా వెళ్ళాడు. డబ్బు విషయం సంధ్యని ఒకటి రెండు సార్లడిగితే సమాధానం చెప్పలేదు. ఏజన్సీ కాన్సిలయి పోయింది. ఇటువంటి పరిస్థితిల్లో రంగయ్య రాక శ్రీకాంత్‌కి పండుగ వచ్చినట్లున్నది. రంగయ్య అవసరం చాలా వున్నా మొహమాటానికన్నట్టు 'కొన్నాళ్ళుగి రాక పోయావా! అయినా ఇంకా ఎన్నాళ్ళు కష్టపడతావు. కొడుకు దగ్గరే ఉండు రంగయ్య !' అన్నాడు శ్రీకాంత్.

శ్రీకాంత్‌కి తెలుసు, రంగయ్య అక్కడ వుండలేడని. సమాధానంగా రంగయ్య నవ్వి 'కాఫీ తెస్తా బాబూ !' అంటూ వంట గదివైపు వెళ్ళాడు.

**జరిగిన కథ-10:** సంధ్య, మధులు ప్రేమించుకొన్నారు. మధు ఫ్రెండు శ్రీకాంత్ అంటె సంధ్యకు తగని చిరాకు, అసహ్యం. సంధ్య పిన్ని కూతురు గీతకు మూర్తి అంటె ఇష్టం. మధుకు నాగపూర్‌లో ఉద్యోగం వచ్చింది. మూర్తి తన భార్య పిచ్చిదని గీతతో చెప్తాడు. మధు చెల్లెలు భవిష్యత్తు బాగుకై మాధవిని పెళ్లి చేసుకోబోతున్నట్లు శ్రీకాంత్ సంధ్య వాళ్ళతో చెప్తాడు. గీతను మూర్తికిచ్చి పెళ్లి చేయమని సలహా ఇస్తాడు శ్రీకాంత్. ఇష్టం లేకపోయినా గీత కోసం శ్రీకాంత్‌ను వివాహం చేసుకోను ఒప్పుకుంటుంది సంధ్య. గీత, మూర్తి, సంధ్య, శ్రీకాంతల పెళ్లి జరిగిపోయింది. మూర్తి భార్య పిచ్చిలో తోయడం వల్ల మూర్తి తల్లి మరణించింది. మూర్తి భార్యను ఆసుపత్రిలో చేర్పించాలనుకుంటాడు. మూర్తి, గీత శ్రీకాంత్ వాళ్ళింటికి వచ్చారు. ఎంత సర్దుకున్నా సంధ్య మనస్సు శ్రీకాంత్‌ను భర్తగా అంగీకరించదు. ఆమె మధుకి రాసిన ఉత్తరం శ్రీకాంత్ చదువుతాడు. సంధ్య మెడలో మాంగల్యం తెంపేయబోతే వారిస్తాడు శ్రీకాంత్.

కాఫీ అందిస్తూ శ్రీకాంత్ వైపు తేరి పారచూశాడు రంగయ్య. ముఖంలో పూర్వంలా మెరుపులేదు. పెదవుల మీద తరగని చిరునవ్వు లేదు. గంభీరంగా దీర్ఘంగా నిరంతరం ఆలోచిస్తున్న గుర్తుగా కను బొమలు ముడివడి వున్నాయి.

"అమ్మాయిగా రెక్కడ బాబూ !"

మేడమీదకు చెయ్యిపెట్టి చూపించాడు.

"కాఫి తీసుకెళ్ళనా !"

"లేవలేదేమో !"

శ్రీకాంత్ స్నానానికి బయలుదేరాడు. వెనకనుంచి కొద్దిగా చిక్కినట్టుగా కూడా అనిపించింది రంగయ్యకు. ఇక వేరే ఆలోచన పెట్టుకోకుండా రంగయ్య ఇల్లు శుభ్రం చెయ్యటంలో లీనమైపోయాడు.

శ్రీకాంత్ తయారయి కిందకు వచ్చేసరికి రంగయ్య పని మధ్యలో ఆపి హడావుడిగావచ్చి "బాబూ ! ఇయ్యాలకి మీరు హొటల్‌లో భోంచేసెయ్యండి. రేపు మంచి వంట మనిషిని తెస్తా!" అన్నాడు.

"సరే, ఆవిడ కిందకు వస్తే ఇవ్వాళ సాయంత్రం ఆరు గంటలకి పెళ్ళికి వెళ్ళాలి. రెడీగా వుండమని చెప్పు' అంటూనే వెళ్ళి పోయాడు శ్రీకాంత్. శ్రీకాంత్ వెళ్ళినవైపే కాసేపు చూసి మళ్ళీ పనిలోపడ్డాడు రంగయ్య. ముందుగా వంటగదిలో ఖాళీ డబ్బాలన్నీ బయటపడేసి, బూజు దులిపి శుభ్రంగా కడిగాడు. పూజ గది తలుపులు దగ్గరగా వేసి వున్నాయి· సుభద్రమ్మగారు వున్నన్నాళ్ళు ఎన్నడూ ఆ తలుపులు మూసి వుండేవికావు. హాలులో దుమ్ము దులిపి సోఫాలకవర్లు మార్చి, ఫ్లవర్ వాజులనిండా కొత్త పూలు కొత్త కొమ్మలు అలంక రించాడు. కిటికీలకు పట్టిన దుమ్ము తుడిచి, కర్టెన్లు మార్చివేశాడు. హాలులోంచి పైకి మెట్లున్నయి. మొదటి మెట్టుమీద నిలబడి ఒక్కసారి తాను చేసిన అలంకారంచూసి మురిసిపోతుండగా సంధ్య వచ్చింది.

"అమ్మాయిగారూ, దండాలు, బావున్నారా !" వినయంగా పల కరించాడు రంగయ్య.

"బాగానే వున్నాను—చూడు, ఈ ఇంటికి సంబంధించిన వాళ్ళె వరూ ఇంట్లో వుండరు. ఈ ఇంటికి కుక్క– కాపలా కాయటానికి నాకు వీలుకాదు. నువ్వొచ్చావు కదా—ఇంటిని చూచుకో–" అంటూ వెళ్ళి పోయింది. రంగయ్యకు చప్పున పొద్దున కాఫీ తాగుతూ శ్రీకాంత్ చెప్పిన మాటలు గుర్తు వచ్చినాయి.

'రంగయ్యా ! ఇల్లు జాగ్రత్త ! వారం రోజుల క్రితం ఏమయిం దనుకున్నావ్ ! నేను పది గంటలకు బయటకు అర్జంట్ పనిమీద వెళ్ళాను. అప్పుడు టైము పన్నెండయిందనుకుంటా—ఏదో మర్చిపోయి ఇంటికొచ్చాను. తలుపులు బార్లా తీసి వున్నాయి. ఇంట్లో ఎవ్వరూ లేరు. గేటు దగ్గర వాచ్‌మన్ కునికిపాట్లు పడుతున్నాడు. కారు హారన్ విని లేచాడు– ఇంటి కొస్తే తలుపులు తీసి వున్నాయి. మర్నాడు అట్లాగే జరిగింది. నేను రోజు సాయంత్రం వరకూ ఇంట్లోనే వుండిపోతున్నాను.'

'అమ్మాయిగారున్నారుగా బాబూ ! ?' అన్నాడు తను.

"ఆవిడకు తాళం వెయ్యటం చాతకానట్టుంది. అందుకని తలుపులన్నీ తీసే వెళ్తుంది.–" శ్రీకాంత్ చిన్నగా నవ్వుతూ అన్నాడు. అది గుర్తు వచ్చిన రంగయ్య—

"అమ్మాయిగారూ. కాఫీ తెస్తాను వుండండి–" అంటూ లోపలి కెళ్ళాడు. సంధ్యకు కొద్దిగా తలనొప్పిగా వుండటం మూలంగా ఆగింది. సోఫాలో బ్యాగ్ పడేసి వెనక్కు ఆనుకొని కూర్చుంది. ఆ పెద్ద హాలులో ఆ పెద్ద వెల్వెట్ కుషన్ల సోఫాలో ఒంటరిగా తను– తన తక్కువతనం తన చిన్నతనం తనని వెక్కిరిస్తున్నట్లనిపించింది సంధ్యకు. ఈ సోఫాలు ఈ ఖరీదైన కలాఖండాలూ, అద్దంలామెరిసే ఈ మొజైక్ నేల, పైన పరచిన అందమైన ఆకుపచ్చని కార్పెట్–

ఈ సమస్త సంపద తనదా! ఇందులో అణుబాగం కూడా తనది అన్న ఆలోచన కాని, తనది అన్న అనుభూతి కాని తనకి అనిపించడం లేదు. రంగియ్య కాఫీ తెచ్చాడు. అక్కడే కింద కూర్చున్నాడు.

'అమ్మాయిగారూ! బయట కెళ్తున్నారా!'

'ఆ, ఏం ?'

'ఎప్పుడొత్తారండీ ?'

సంధ్య చిరాకుగా చూసింది.

'సాయంత్రం ఆరు గంటలకి పెళ్ళి కెళ్ళాలటండి! మిమ్మల్ని తయారయి వుండమన్నారు.– త్వరగా వచ్చేయండి !'

'నేను రాలేను—మీ అయ్యగారితో చెప్పు!'' గబ గబా బయటకెళ్ళి పోయింది సంధ్య. రంగియ్య ఆలోచనగా లోపలికెళ్ళిపోయాడు

* * *

అప్పటికే చాలా ఆలస్యమైపోయింది. ఆఫీసులో కాలు పెట్టేసరికి పావుతక్కువ పదకొండు కావచ్చింది. రెండు బస్సులు మారి దాదాపు స్నానం చేసినట్టుగా తడిసి రొప్పుతూ ఆఫీసు కొచ్చేసరికి ప్రాణం దిమ్మర పోయింది సంధ్యకు కుర్చీలో కూర్చోబోతుండగా సూపరింటెండెంట్ పిలిచాడు. కర్చీఫ్‌తో ముఖం తుడుచుకుని వెళ్ళి నిలబడింది సంధ్య రావటం చూసి, ఫోను తీసి ఫోనులో మాట్లాడసాగాడు. ఆ ఇరవై నిముషాలూ సంధ్య నిలబడే వుంది. కడుపులో పేగులు ఆకలితో అరుస్తున్నాయి కొత్తగా ఆ సెక్షనుకి వచ్చాడతను. క్రొత్తగా ప్రమోషన్ కూడా వచ్చింది. తన బల్ల ముందు ఒక క్లర్కు అట్లా నిలబడటంలో ఆనందాన్ని అనుభవిస్తూ ఫోను పెట్టేసి సంధ్యను పైనుంచి కింద దాకా చూస్తూ 'ఇప్పుడు టైమెంతయిందండీ! రెండు గంటలు లేటా!' తీవ్రంగా అన్నాడు.

'సారీ, సర్ ! బస్సు అందలేదు!'

'నాకు తెలియదు. ఆఫీసరుగారి దగ్గరకెళ్ళి సంతకం పెట్టి రండి !' గొంతులో తీవ్రతను రెట్టింపు చేసి అన్నాడు సూపర్నెంటు.

సంధ్య నెమ్మదిగా ఆఫీసరు రూములోకి అడుగుపెట్టింది. అప్పటికే తనకి మూడు లేటు మార్కులు. తను చేరి ఇవ్వాళ్టికి ఆరో రోజు. ఈ పెళ్ళి గొడవకి పూర్వం తనెంత రెగ్యులర్‌గా వుండేది. అందరిచేత ఎంతగానో మెచ్చుకోబడింది. ఇప్పుడు జీవితం మారినట్లే ఈ ఆఫీసు జీవితం కూడా మారినట్లున్నది. తను జీవితంలో ఇక ఏ పనీ సిన్సియర్‌గా చెయ్యలేదేమో! తనెన్ని కేసులు, ఎన్ని గ్రాంట్లు, ఎన్ని ఫైల్స్ మేనేజ్ చేసేది. టైపిస్ట్ ఉద్యోగం నుంచి క్లర్క్‌గా ప్రమోషన్ వచ్చిం తర్వాత ఒక్క సంవత్సరమే తను పనిచేసింది. ఆలోచనలోపడ్డ సంధ్యకు ఆఫీసర్ మాటలు కటువుగా వినిపించినాయి.

'చూడమ్మాయ్. ఇదేం బాగుండలేదు, నీ ప్రవర్తన మర్యాదగా లేదని సూపర్నెంటు రిపోర్టు చేస్తున్నాడు. సీట్‌లో పనంతా పెండింగులోనే వుందట. రోజూ లేటుగా వస్తావు. నీమీద యాక్షన్ తీసుకోవలసి వస్తుంది.'

'రేపటి నుంచి త్వరగా వస్తానండి !' గొంతు పెగుల్చుకుని చెప్పి బయటపడింది సంధ్య.

సంధ్య సీటులో వచ్చి కూర్చోగానే సెక్షనులో అందరూ ఒకరి ముఖం ఒకరు చూచుకుని సన్నగా నవ్వుకోసాగారు. టేబుల్‌మీద తను అప్రూవల్‌కి పంపిన డ్రాఫ్టు ఆఫీసరు దగ్గరనుంచి వచ్చింది కాబోలు- గాలికి ఎగురుతున్నది. ఆ డ్రాఫ్టునిండా ఎర్రసిరాతో చేసిన కరెక్షన్సే. ఫైనల్‌గా తను రాసినదంతా కొట్టేసి తిరిగి వెనక రెడ్ ఇంక్‌తో వ్రాయబడింది. ఇది టైప్ సెక్షన్ కెళ్తే వాళ్ళెంత నవ్వుతారో వూహించుకొన్న సంధ్యకు ఒళ్ళు గగుర్పొడిచింది. ఆఫీసులో ఒక క్లర్కు ఉండేది రమాదేవని. ఇప్పుడు పెళ్ళి చేసుకుని రిజైన్ చేసింది. టైపు సెక్షన్‌కి ఆవిడ వ్రాసిన డ్రాఫ్టులు వస్తే అందరూ సరదాగా నవ్వుకునే వారు. ఆ వాక్య నిర్మాణం, అందులో వ్యాకరణం — భలే నవ్వు పుట్టించేవిగా వుండేవి. మొత్తంమీద ఆ అమ్మాయి డ్రాఫ్టు రాయటం నేర్చుకోకుండానే బయటపడింది. ఇప్పుడు తనది — అంతకంటే హారిబుల్‌గా వుంది. ఆ కాగితానికి చిన్న స్లిప్ పిన్ చేసి ఆఫీసరు ముక్కచీవాట్లు పెడుతూ రిమార్కు వ్రాశాడు. తను ఇంగ్లీషులో కవిత్వం చెప్పలేక పోవచ్చుగాని ఈ మాత్రం కరస్పాన్‌డెన్స్ చెయ్యలేదు. తప్పులు లేకుండానే, మామూలుకంటే ఎక్కువ బాగానే వ్రాయగలదు. సూపర్నెంటు, ఆఫీసరు కావాలని చేశారేమో! ఒకసారి తను వ్రాసు



కున్నది. చదివి చూచుకుంది. తను తప్పులు వ్రాసిన మాట అక్షరాలా నిజం! సిగ్గుతో తలవాలి పోయింది. ఆ సెక్షన్‌లోనే విమల అని మరో క్లర్కు వుంది. ఈ ఆలోచనల్లో సతమతం అవుతూ వుండగానే టైము పావుతక్కువ ఒంటిగంటయింది. విమల సంధ్య దగ్గరకు వచ్చి 'లంచ్'కి వెళ్దాం రమ్మంది. సంధ్యకు అక్కడ నుంచి లేవబుద్ధి కాలేదు.

'నాకు రావాలని లేదు విమలా! నువ్వెళ్ళు!' అంది.

అప్పటికే సెక్షనులో అందరూ వెళ్ళిపోయారు సూపర్నెంట్ వీళ్ళ ముందు నుంచే బయట కెళ్ళాడు. విమల టిఫెను డబ్బా తెరిచి తను తెచ్చిన చపాతీలు రెండు భాగాలుచేసి సంధ్య ముందుకు నెట్టింది తినమన్నట్టు. వారం రోజులుగా కేవలం టిఫెను, కాఫీ మీద నెట్టుకొస్తున్నది సంధ్య. శ్రీకాంత్ తిండి తినకూడదు అని గట్టిగా నిర్ణయించుకోవడం మూలంగా పూర్తిగా భోజనం మానేసింది. తనకు జీతం రావాలి! అప్పుడు తను వేరుగా తన డబ్బుతో వంట చేసుకుని తినాలి! అంతవరకూ తప్పదు. కడుపులో ఆకలి.— వారం రోజులుగా భోజనం లేక నీరసం— ఆఫీసరు దగ్గర అవమానం— శ్రీకాంత్ మీద

# రాగసంధ్య

కోపం, తనమీద అసహ్యం ఒక్కసారిగా సంధ్యను చుట్టుముట్టి బలమైన ఈటెలతో పొడుస్తున్నట్టుగా ఆమె అనుభూతి చెందసాగింది. ఆ సమయంలో సంధ్యకు ఎదురుగా ఉన్న రొట్టె పంచభక్ష్య పరమాన్నాల కంటే ఎక్కువగానే కనిపించింది.

'సంధ్యా. నీకు మధు అనే అతను తెలుసా!' ఆత్రంగా నోట్లో పెట్టుకోబోతున్న రొట్టె కిందపడేసింది సంధ్య. రక్తం ఒక్కసారిగా ప్రవాహంతో ముఖంలోకి వచ్చింది.

'ఎందుకు?' సంధ్యలో కలవరపాటు కనిపెట్టింది విమల.

'ఏంలేదు, పూరికే ఎవరో అంటే– నీకు తెలుసో లేదో అని అడిగాను!'

'ఏమడిగారు?' సంధ్య ఆత్రంగా అడిగింది.

'ఏం లేదు, నువ్వుతిను–'

'అట్లా కాదు. నువ్వు చెప్పాలి–చెప్తేనే కాని నేను తినను!'

'ఏం లేదంటున్నానుగా — ఎవరో ఏదో అన్నారు — నాకు బుద్ధి లేదు — నేనెందుకడగాలి–ప్లీజ్ సంధ్యా — నన్ను బలవంతం చెయ్యకు– తిను– తినవా...' జాలిగా అంది విమల.

'ఎడారి లాంటి నా జీవితంలో నీ స్నేహంతో పేద దీర్చుకుందా మనుకున్నాను. నీకూ నా దగ్గర రహస్యాలేనా! మనసులో పెట్టుకుని మధన పడేకంటే అడిగితే క్లియర్‌గా మనసు నిష్కల్మషంగా వుంటుంది. లేకపోతే నీకూ, నాకూ కూడా ఈ విషయం చెద పురుగులా తొలుస్తూంటుంది. చెప్పు విమలా, చెప్పు–' సంధ్యకు అసహనంగా వుంది.

విమల ఆలోచనగా కాసేపు ఆగింది.

'చెప్తాను, కానీ, ఒక షరతు– ఇప్పుడు వినే విషయాలన్నీ నువ్వు మర్చిపోవాలి! ఈ విషయాల నీడ కూడా నీ మనసులో వుండకూడదు.

ఈ సంభాషణ మన స్నేహాన్ని కలుషితం చెయ్యకూడదు!'

విమలకి సమాధానంగా సంధ్య అంగీకారంగా చూచింది.

'సంధ్యా! నువ్వు ఆఫీసుకి వచ్చే వరకూ సెక్షనులో నీ సంగతులే మాట్లాడుకుంటారు. ఎంత అసభ్యంగా మాట్లాడుకుంటారనుకున్నావు! నీకు ఇదివరకే మధు అనే అతనితో సంబంధం వుందిట. నీ కోసం రోజూ ఆఫీసుకి వచ్చేవాడుట. ఆఫీసు నుంచి మీరు రోజూ ఏ హోటలుకో వెళ్ళి... ఏ రాత్రి పదిగంటలకో నిన్ను ఇంటి దగ్గర దింపేవాడుట. ఆఫీసులో వుండగానే నీకు రెండుసార్లు ఎబార్షన్లు అయినయిట.

అతనికి నువ్వంటే అసహ్యం పుట్టి నిన్ను వదిలేసి ఎవర్నో చేసుకున్నాడట. మూడోసారి నీకు ప్రెగ్నెన్సీ వచ్చినపుడు నిన్ను శాశ్వతంగా వదిలేసి దూరంగా వెళ్ళిపోయాడుట. అతనికో గొప్ప సంఘ సంస్కారి స్నేహితుడుండే వాడుట. అతను చాలా గొప్ప ధనవంతుడుట. వయసులో ఇతనికంటే నాలుగైదేళ్ళు పెద్దట. ఆ సంఘ సంస్కారి, స్నేహితుడు వదిలేసిన నిన్ను దయతో తనింట్లో వుంచుకున్నాడుట. ఇప్పుడు ప్రస్తుతం నువ్వు అతనికి.........' విమల మాటలను తుంచుతూ–

'ఉంపుడు కత్తెనుట–' అంది సంధ్య. సంధ్య ముఖం చూచిన విమలకు భయంవేసింది. స్నేహ పూర్వకంగా సంధ్య చేతిమీద చెయ్యివేసి 'సంధ్యా! ప్లీజ్ — నువ్వా వెధవల మాటలకి విలువ నివ్వకూడదు. నీకు ముందే చెప్పాను నువ్వీ విషయాన్ని మర్చిపోవాలి ఈ సంఘమే అంత. ఎవరైనా పచ్చగా వున్నారంటే చూడలేదు. అసలైనా సంధ్యా, నీకే ఉద్యోగం ఎందుకు? లక్షణమైన భర్త, లక్షల ఆస్తికి అధికారిణివి నీకే గుమస్తా ఉద్యోగం చెయ్యటం చిన్నతనంగా లేదూ! నీకు సలహా చెప్పేదాన్ని కాదుకాని నీ ఇంట్లో, నీ భర్త అండన నువ్వుంటే నీమీద నీ భర్త ఈగ కూడా వాలనివ్వరు! ఈ వెధవల నోళ్ళు మూతలు







పడతాయి. ఎన్ని కట్టుకథలు కల్పించారో—'

నిజంగానే విమల బాధపడసాగింది.

'కొన్ని నిజాలున్నాయి విమలా! మధుని నేను ప్రేమించిన మాట నిజమే! కాని ఎన్నడూ మేము హద్దులు దాటలేదు. మధుకి జీవితం ఒక పెద్ద క్వశ్చన్ మార్క్! ఆ క్వశ్చన్ మార్క్‌కి సమాధానం ఇద్దరం ఆలోచించుకోవటం కోసం ఎప్పుడైనా పార్కుకి వెళ్ళేవాళ్లం. మా ఇద్దరి జీవిత సమస్యలూ ఒకటే! మా ఇద్దరి ఆర్థిక స్థితి ఒకటే! అందుకని ఆ సమస్యలు పరిష్కరించుకునేందుకు కలుసుకునేవాళ్ళం. ఎక్కువ భాగం మధు తన చెల్లెలు రమణికి పెళ్ళి ఎట్లా చెయ్యాలా అని దిగులుపడుతుండేవాడు. నేను ధైర్యం చెప్తుండేదాన్ని. అతని స్నేహితుడు దయలో తన ఉంపుడుకత్తెగా నన్నుంచుకోలేదు. నన్ను ప్రేమించి, ఆరాధించి శాస్త్రోక్తంగా బద్ధంగా నన్ను వివాహం చేసుకున్నాడు. నేనొక దురదృష్టవంతురాల్ని! నీకు తెలియదు విమలా! అతనెట్లాంటి వాడను కున్నావు? నేను అతనికి సరికి రాను! నన్నెందుకు అతను ప్రేమించి కావాలని పెళ్ళి చేసుకున్నాడో నాకు తెలియదు! నా నుంచి తీరని అవమానాలూ, వ్యధ తప్ప అతనికి నేను మిగిల్చేది కూడా ఏమీ లేదు—' దాదాపు స్వగతంగా తనలో తను అనుకున్నట్లుగానే అంది సంధ్య. అంటూనే కుర్చీలోంచి లేచింది—

'వస్తాను విమలా!' చకచకా బయటకు నడచి వెళ్ళి పోతున్న సంధ్యను చూస్తూ అనుకుంది విమల 'సంధ్య ఏ అఘాయిత్యమైనా చెయ్యదు కదా!' అనుకోవటమే తడవుగా సూపర్నెంటు టేబుల్ దగ్గరకు పరుగుపెట్టి డైరెక్టరీ తీసి నంబరు వెతికింది.

'హలో— శ్రీకాంత్ హియర్— ఎవరండి?' విమలకి శ్రీకాంత్ ఫోనులో దొరికేసరికి ప్రాణం లేచివచ్చింది.

'సర్, నా పేరు విమల! మీ మిసెస్‌తోపాటు పని చేస్తాను. ఆవిడ సెక్షనే'

"... ... ..."

'అవునండీ! ఆవిడ వారం రోజులుగా ఆఫీసుకి వస్తూనే వున్నారు.

సారీ సర్. ఇవ్వాళ ఆఫీసులో జరిగిన అవాంఛనీయ సంభాషణ సంధ్యకు చెప్పవలసి వచ్చింది. విన్న వెంటనే ఒక్కసారిగా తను సీట్‌లోంచి లేచి వెళ్ళిపోయింది. ఆవిడ ఏ అఘాయిత్యమైనా చేస్తుందేమోనని భయంగా వుంది— అందుకని మీకు ఫోను చేస్తున్నాను—'

సాంతం తన మాటలు వినకుండానే అవతలి ఫోను పెట్టేయటం జరిగింది. విమలకు చాలా అసహనంగా వుంది గబగబా హాఫ్ డే సెలవు వ్రాసి బ్యాగ్ తీసుకుని బయలుపడింది.

★ ★ ★

శ్రీకాంత్ కారులో దాదాపు జంటనగరాలు టైర్లు అరిగిపోయేలా తిరిగాడు. రాత్రి ఏడు గంటలు కావస్తుండగా ఇంటికి వెళ్ళి చూడాలనిపించిందతనికి· కారు పోర్టికోలో ఆపుతూనే లోపలికి పరుగుపెట్టాడు. డ్రాయింగు రూము దాటి గబగబా మేడమీదకు వెళ్ళి తలుపులు తోసుకుంటూ గదిలో కెళ్ళిన శ్రీకాంత్‌కి సంధ్య అద్దం ముందు కూర్చుని తీరుబడిగా చిక్కు తీసుకుంటూ కనబడింది. ఒక్క ఉదుటున ఆమె దగ్గరకు పరుగుపెట్టి ఆమె రెండు భుజాలూ పట్టుకొని లేపి తనవైపు తిప్పుకున్నాడు. తప్పిపోయిన సంతానాన్ని అపురూపంగా చూచుకునే తల్లిలా ఆప్యాయంగా చూచుకున్నాడు శ్రీకాంత్. సంధ్య కూడా శ్రీకాంత్‌ని బాధగా చూచింది

మొట్టమొదటిసారిగా ఆమెకు శ్రీకాంత్ మీద జాలి కలిగింది.

అతను సంధ్యను మృదువుగా చుంబించి వదిలేసి వచ్చినంత వేగంగా కిందకు వెళ్ళిపోయాడు.

సంధ్య ముందు వరండాలోకి వచ్చి కూర్చుంది. ఆమె అక్కడ ఎంతసేపు కూర్చున్నదో కాని శ్రీకాంత్ వెనకనుంచి వచ్చి పిల్చేవరకూ రకరకాలుగా ఆలోచిస్తున్న ఆమె మనసు ఒక పట్టాన స్వాధీనంలోకి రాలేదు.

'సంధ్యా! త్వరగా తయారుగా! నా కొక స్నేహితుడున్నాడు. అతను బొంబాయిలో వుంటాడు. నా ఈ వ్యాపారాలన్నిటికీ అతనే ప్రధాన వ్యక్తి. పెళ్ళికి వెళ్ళలేక పోయినా కనీసం భోజనానికయినా వెళ్ళాలి — తప్పదు — పద —'

చాలా రోజులు తర్వాత సంధ్యతో మాట్లాడాడతను. సంధ్య మనసు కూడా అతని పట్ల మృదువుగా వుంది. ఈ పరిస్థితుల్లో అతని మాట కాదనలేకపోయింది. అద్దం ముందు నిలబడి తల స్నానం చేసిన జుట్టును పొందికగా చుట్టగా చుట్టింది. పక్కనే వాజ్‌లో అమర్చిన పెద్ద గులాబీ పువ్వును సిగలో అమర్చుకుంది.

"సంధ్యా! ఈ చీర నీ కోసం తెచ్చాను. నువు వేసుకున్న బ్లౌజుకి సరిగా సరిపోతుంది. ఈ చీర కట్టుకో. ఇవ్వాళ ఒక్క రోజు నా మాట కాదనకు —" లాలనగా అన్నాడు శ్రీకాంత్.

ఈరోజు శ్రీకాంత్ ఏ కోరికా కాదనదలచుకోలేదు సంధ్య. తలలో గులాబీకి, వేసుకున్న బ్లౌజుకి, చీరకు చాలా చక్కగా రంగు కలిసిపోయింది. అన్నిటికంటే జరీ బూటా వున్న ఆ గులాబీ రంగు బెనారస్ చీరలో సరిసమానంగా మెరుస్తున్న సంధ్య గులాబీ వన్నె ముఖం శ్రీకాంత్ కళ్ళకి కళ్ళెంవేసి బంధించింది. నిజంగా తనెంత అదృష్టవంతుడు కాకపోతే అప్సరస వంటి సంధ్య తన భార్య అవుతుంది. శ్రీకాంత్ వుత్సాహంగా సంధ్య పెట్టుకోవలసిన నగలు తీశాడు. అతనికి అభిముఖంగా నిల్చుని అతను అందించిన నగలన్నీ పెట్టుకుంది. రాళ్ళవి, ముత్యాలవీ అన్నీ పక్కనపెట్టి బంగారు గాజులు మాత్రమే వేసుకుంది·

# భార్యాభర్తల అనుబంధం



## ధర్మపథం

గృహస్థాశ్రమంలో భార్యా భర్తలిద్దరికీ సమాన ప్రతిపత్తి ఉన్నది. పరస్పరం అనుకూలత ఉంటేనే దాంపత్య జీవితం సాఫీగా సాగిపోతుంది. ఒక్కొక్కప్పుడు ఇద్దరిలోనూ అభిప్రాయభేదాలు కలగవచ్చు. ఒకరికి కోపతాపాలు కలిగినప్పుడు అవతలివారు సర్దుకుపోవాలి. ఎలాటి చికాకులు వచ్చినా, ఒకరినొకరు విడవడం కుదరనిపని. సహనం వహించి సర్దుకుని కాలం గడపవలసినదే!

బ్రహ్మదేవుడు సృష్టికార్యం ప్రారంభించి, మానవుల అభివృద్ధి కోసం పురుషుణ్ణి సృజించాడు. మానవ జాత్యభివృద్ధికయి, ఆ తర్వాత స్త్రీని నిర్మించి ఆ పురుషుడికి అప్పగించాడు. తన ఏకాకి జీవితంలోని విసుగును పోగొట్టి, ఆమె తోడ్పడగలదని పురుషుడు భావించి, ఆమెతో కాపురం చేయసాగాడు. కాని ఆతనికి సుఖం కనబడలేదు. ఆమె యెప్పుడూ ఏదో గొణుగుతూ ఉండేది. చీటికీ, మాటికీ కోపించేది. ఆమె మనస్సు కనిపెట్టి నడుచుకోవడం ఆతనికి కష్టమై పోయింది. మనశ్శాంతి నశించింది. అందువల్ల ఆతడు బ్రహ్మవద్దకు పోయి "స్వామీ! మీ రిచ్చిన వ్యక్తిని మీరే తీసుకోండి. నేను భరించలేకున్నాను" అని తన గోడు వెళ్లబుచ్చాడు. బ్రహ్మ "సరే" అని స్త్రీ వ్యక్తిని వెనుకకు రప్పించాడు.

కొన్నాళ్ళు గడిచాక పురుషుడు మళ్ళీ ఆతని వద్దకు వచ్చి "స్వామీ! ఏకాకి జీవితం నాకు దుర్భరంగా ఉన్నది. నా స్త్రీ వ్యక్తిని మళ్ళీ నాకు అనుగ్రహించండి. ఆమె క్రీగంటి చూపులూ, ఒయ్యారపు నడకా, మధురమైన కంఠస్వరం మరవ లేకుండా ఉన్నాను. వాటి ఆకర్షణ ఇటువంటిదని చెప్పలేకున్నాను. ఆమె మృదు స్పర్శ సంతోషాన్ని కలిగిస్తుంది. ఆమె చక్కదనం కన్నులకు కట్టినట్లున్నది. ఆమెను నా కనుగ్రహించండి" అని ప్రాధేయ పడ్డాడు. బ్రహ్మ "సరే" అని తిరిగి స్త్రీని ఆతనికి అప్పగించాడు.

మరి వారం రోజులకు పురుషుడు మళ్ళీ వచ్చి "దేవా! నే నామెతో పడలేకుండా ఉన్నాను. తిరిగి ఆమెను తీసికో. ఇక ఆమె కావాలని అడగను" అని అన్నాడు.

బ్రహ్మ నవ్వుతూ "ఓయీ చపల బుద్ధీ! మరి నేనామెను వెనుకకు రప్పించను. నీవు ఆమెను విడిచి ఉండలేవు. విడవాలనీ గట్టిగా నిశ్చయించుకో లేవు. మీరిద్దరూ పరస్పరం అరమరికలు లేకుండా సర్దుకు పోవలసిందే!" అన్నాడు. పురుషుడు "ఆమెతో ఉండడమూ కష్టమే! ఆమెను విడవడమూ కష్టమే!" అనుకుంటూ, మారుమాట చెప్పలేక వెళ్ళిపోయాడు.

—బులుసు వేంకటరమణయ్య.

## రాగసంధ్య

చెవులకి ఒంటిముత్యం ముద్దులు పెట్టుకుంది. ఏడెనిమిది సన్నని వరసలున్న బంగారు గొలుసు వేసుకొంది. సంధ్య కదులుతున్నప్పుడల్లా బొడ్డువరకూ వున్న ఆ పొడుగాటి గొలుసు చిత్రంగా మెరుస్తున్నది.

'వెళ్దామా!' సంధ్యను చూస్తూ అన్నాడు శ్రీకాంత్.

ఆ క్షణంలో ఆతనికి అక్కడ్నుంచి ఒక్క అంగుళం కూడా కదలాలని లేదు. సంధ్యతో ఆ క్షణాలు అక్కడే శాశ్వతం చేసుకోవాలనుంది. బలవంతంగానైనా సంధ్యను తన సంధ్యను చేసుకోవాలని ఆతని మనసు తొందరపెట్టసాగింది. మరుక్షణంలోనే తన ఆలోచన తనకే భయంవేసి బయలుదేరాడు శ్రీకాంత్. ఆతన వెనకాలే సంధ్యకూడా కిందకివచ్చింది. కారు పాదరసంలా రోడ్డుమీద జారిపోతోంది.

**(ఇంకా వుంది)**

ఇప్పుడు లభిస్తూన్న

డీలక్స్

# నిరోధ్

మరింత నునుపైనది




సున్నిత మనస్కులైన దంపతులకు

అయిదింటికి
రూ. 1/-

★ ఉత్తమ మైన నాణ్యత గలది.

★ ఎలక్ట్రానిక్ సాదనాలతో పరీక్షింపబడినది.

అన్ని పెద్ద పట్టణాలలో
విక్రయింపబడుచున్నది

davp 84/28




## యం. యం. – ఖమ్మం.

★ నా చిగుళ్ళు ఎప్పుడు వాచినట్లుగా వుండి ఏ మాత్రము వత్తిడి తగిలిన రక్తము కారుతుంది. పళ్ళు తీపులుగా వుంటాయి. నాలుకతో చిగుళ్ళను నొక్కినప్పుడు దుర్వాసన వస్తుంది.

● మీరు నిపుణులైన దంత వైద్యులను సంప్రదించి పయోరియా కొరకు చికిత్స తీసుకోవటం మంచిది. దుర్వాసనకి పయోరియానే కారణం.

## బి. యల్. కె. – పొదగట్లపల్లి.

★ . నాకు తెల్ల బట్ట అవుతుంటుంది. యిలా అయితే పిల్లలు పుట్టటానికి అవకాశం లేదంటారు. నేను స్వీటు ఎక్కువగా తింటాను. టీ లేక కాఫీ ఎక్కువగా త్రాగుతాను. అందువలన అలా అవుతుందనుకుంటాను.

● ల్యూకోరియా (తెలుపు అవటం)కీ పిల్లలు పుట్టటానికీ సంబంధంలేదు. టీ త్రాగటానికీ, స్వీట్లు ఎక్కువగా తినటానికీ ఈ రోగానికి అసలు ఏ సంబంధమూ లేదు. లేడీ డాక్టర్ల వగ్గర పరీక్ష చేయించుకొని వారి రోగ నిర్ధారణ ప్రకారం ఇచ్చిన మందులు వాడండి. కొన్ని రోగాలకి స్త్రీ–పురుషులిరువురూ మందులు వాడవలసి వుంటుంది.

## బి. కె. – తిరుచ్చి

లంగ్ కాన్సర్ ఎందుకు వస్తుంది? దాని నివారణకు ఏమి చేయాలి?

● లంగ్ కాన్సర్ రావటానికి ప్రత్యేక కారణం అంటూ ఇంతవరకు తెలియదు. కాని పొగ పీల్చని వారికన్నా పీల్చే వారిలో ఎక్కువ అని మాత్రం తెలుసు. దానికి నివారణ అనేది రోగం ఉన్న భాగాన్ననుసరించి, దాని ప్రమాణాన్ననుసరించి, ఇతర భాగాలకి విస్తరించిందీ లేనిదీ అనేదాన్ని బట్టి తీర్మానించవలసి ఉంటుంది. శస్త్రచికిత్స, లో బాల్ట్ ట్రీట్‌మెంటు, మందుల వాడకం ప్రస్తుతం ఉన్న చికిత్సా విధానాలు.

## వి. యస్. వి. – వరంగల్

నేను చాలా సన్నగా వుంటాను. నా వయస్సు 17 సంవత్సరములు. నేను ప్రతి రోజు యోగాసనములు వేస్తాను. పచ్చి కూరగాయల రసం తాగుతున్నాను. వీటివలన ప్రయోజనం వుంటుందా?

● శరీరం లావు అవటం అనేది ఒక్క ఆహారం మీదనే ఆధారపడదు. శరీర తత్వం, పెద్దల శరీర నిర్మాణం మొదలయినవి మాత్రమే గాక శరీరంలో ఉత్పత్తి అయ్యే హార్మోనుల మీద కూడా ఆధారపడి ఉంటుంది. అన్నం సరిగా తినకుండా యోగాసనాలు వేసినందువల్ల ఇంకా శరీరం బలంగా తయారవుతుంది తప్ప లావు అవదు.

## టి. జె. ఆర్. – విజయవాడ

నోటితో బట్టలు తింటే నత్తి వస్తుందా? మూత్ర విసర్జనప్పుడు వచ్చే వాసన పీలిస్తే హానికరమా?

● నోటితో బట్టలను నమిలితే నత్తి వస్తుందని మన పెద్దలందరూ అంటుంటూ ఉంటారు. కానీ శాస్త్రీయంగా ఇది నిరూపింపబడని విషయం. మూత్ర విసర్జన ముక్కు మూసుకుని ఎవరూ చెయ్యరు. దుర్వాసన అనేది అందరికీ అసమ్మతమే! మూత్రం నుంచి వచ్చే వాసనకి ప్రత్యేకత ఏమీ లేదు. □













# అమృతాంజన్‌కే తెలుసు తలనొప్పి బాధ

మృదువైన మూలపదార్థము వల్ల ఉపయోగించుట సులభము.

క్రొత్త కార్కు అమరిక వల్ల మందు శక్తికి రక్షణ








1984 ఒలింపిక్స్ క్రీడలలో పాల్గొన్న భారత క్రీడాకారులకు అధికారపూర్వకంగా పెయిన్ బామ్ సరఫరా చేసినవారు.

## అమృతాంజన్

ఏ ఇతర బాధలు కల్గించని శీఘ్ర నివారిణిని నమ్మండి

OBM 8708 TG

# హైదరాబాద్ నోట్‌బుక్

తిరుమల రామచంద్ర

## శ్రీ నార్లగారి కన్నుమూత :–

విశ్వ కవి రవీంద్రనాథ ఠాకూర్ అస్తమించినప్పుడు నార్లగారు "ఒక కోయిల మూగవోయింది ఒక దీపిక ఆరిపోయింది ఒక నక్షత్రం రాలిపోయింది ఒక వట వృక్షం కూలిపోయింది ఒక సత్య పదికుడు కన్ను మూశాడు అని ఆంధ్రప్రభ సంపాదకీయంలో ఆవేదన కుమ్మరించారు ఆ మాటలు ఇప్పుడు ఆయనకే వర్తించాయి ఆయన ఫిబ్రవరి 16వ తేది ఉదయం నిజాం ఆర్థోపెడిక్ ఆస్పత్రిలో గుండె పోటుతో కన్ను మూశారు అన్యాయం ఎక్కడ, ఏ రూపంలో తలయెత్తినా ఎదిరించే అప్రతిమాన సాహసం, మంచి ఏ కొంచమైనా ముక్త కంఠంతో మెచ్చుకొనే ఔదార్యం మిన్ను విరిగి మీద పడినా కర్తవ్యం నుంచి కాసంతయినా కదలని కఠోర దీక్ష, సమస్యలు ఒక్కుమ్మడిగా విరుచుకొని పడినప్పుడు సర్వ దృష్టితో వివేచించి దారి చేసుకుని ముందుకు పోయే వివేకం, ప్రశంసలకు పొంగిపోక, అభిశంసలను ఆహ్వానించే ఆత్మగుణం, నమ్మిన దానిని నిక్కచ్చిగా చెప్పి చేసి చూపే నిబ్బరం, తనతో పని చేసిన వారంతా తనను మించిపోవాలనే తహతహ, దుష్ట శిక్షణకు కలాన్ని కరకు కత్తిగా వాడే పరాక్రమం, చేపట్టిన వృత్తిపై చెప్పలేనంత గౌరవం – ఇవి నార్లగారి స్వరూప రేఖలు పత్రికా సంపాదకులుగా ఆయన చూపిన ధైర్య సాహసాలు నాకు ఎన్నో గుర్తుకు వస్తాయి సంపాదకీయాలతో ప్రభుత్వ విధానాలు మార్చిన సంఘటనలెన్నో! ఆయన కలం బలం అలాంటిది

అది ఇరువైపులా పదును గలది. ఒకవైపు పరితను ఆలోచనా పరాయణుని చేస్తుంది, మరొక వైపు గుండెను నిండుగా చేస్తుంది ప్రపంచంలో ఏ మూల ఏ గొప్ప సంఘటన జరిగినా ఆయన హృదయం స్పందించేది, సంపాదకీయం స్వరూపం దాల్చేది క్విట్‌ఇండియా ఉద్యమంలో జరిగిన దౌర్జన్యకాండకు కలవరపడిన గాంధీజీ ఉపవాసం ప్రారంభించారు దానిని పలువురు పలుతీరులుగా వ్యాఖ్యానించారు కాని నార్లగారు ఆత్మ సంశోధన అనే శీర్షికతో సంపాదకీయం వ్రాశారు "మహాత్ముల జీవితం సత్యాన్వేషణ, నిరంతర సంఘర్షణ వారికి శాంతి ఉండదు, సౌఖ్యం ఉండదు, సంతృప్తి ఉండదు వారి లక్ష్యాలు ఎంత మహోత్తమమైనవో అంత కష్టసాధ్యమయినవి కాంతితో పాటు ఉష్ణాన్ని ప్రసాదించడం సూర్యమండలం ధర్మం కాంతితో పాటు శైత్యాన్ని ప్రసాదించడం చంద్రమండల ధర్మం వాటి ధర్మాలను ఎవరు మార్చ గలరు? మహాత్ముల నిర్ణయాలు సయితం అట్టివే – అని ధైర్యంగా సమర్థించి గాంధీజీని అపార్థం చేసుకొన్న వారికి కనువిప్పు కలిగించారు సంపాదకులుగా ప్రజాభిప్రాయాన్ని రూపుదిద్దడంలో ఆయనకు ఆయనే సాటి ఆయన శైలి పరితనం భావావిష్కరణ్ని, ఆలోచనాపరుణ్ని చేసి, కర్తవ్యపరాయణత తప్ప గత్యంతరం లేదనే నిర్ణయానికి తెస్తుంది ఆయన వివిధ సాహిత్య ప్రక్రియలలో రచనలు చేశారు కాని నేను మాత్రం ఆయన పత్రికా రచనను సాహిత్య స్థాయికి తెచ్చిన లక్షణకారులనుగా, ఆంగ్లంలోని వినోద విజ్ఞానదాయక వ్యాసాల వరవడిని తెలుగులోకి తెచ్చిన భగీరథులనుగా భావిస్తాను నార్లగారు 1908 లో జబ్బల్‌పూర్‌లో పుట్టినప్పటి స్థితిని, బతికి చేడిన సంసారాలలో కలిగే ఉత్పాతాలను చెబుతూ, అప్పుడూ, తర్వాత తమకు తోడ్పడిన వారిని, ఆ కష్టసమయంలో తమ కుటుంబాన్ని నిలబెట్టి తమ నందరినీ చదివించిన తల్లి శ్రీమతి మహాలక్ష్మమ్మగారిని తరుచు స్మరించే వారు కృతజ్ఞతాశ్రువులతో నార్లగారికి ముగ్గురు కుమారులు, ఐదుగురు కుమార్తెలు జ్యేష్ఠ పుత్రుడు మోహన్‌దాస్‌ఇంజనీరు తక్కిన వారంతా డాక్టర్లు ఆయన సహధర్మచారిణి శ్రీమతి సులోచనాదేవి గొప్ప ఇల్లాలు ఆమెకూ, తక్కిన వారికీ హృదయ పూర్వకమయిన సానుభూతి తెలుపుతూ, ప్రతి పత్రికా రచయితా నార్లగారి గుణాలను అలవరచు కోవాలని ఆకాంక్షిస్తున్నాను

## అమృత హృదయుడు రఘుపతిరావు

కొందరు కష్టపడి పైకి వస్తారు పైకి వచ్చిన తర్వాత మెట్లనే మరచిపోతారు, మెట్లను కూల్చడానికి కూడ ప్రయత్నిస్తారు మరికొందరు జీవితాన్ని సింహావలోకనం చేసుకొని, తాము ఎలా పైకి వచ్చిందీ మననం చేసుకుంటూ అందారా వ్రతంగా జీవితం గడిపి, ఆదర్శప్రాయులవుతారు రెండవ కోవకు చెందినవారు శ్రీ కొరిడె రఘుపతిరావు రఘుపతిరావు మెదక్ జిల్లా మంగం పేటలో జన్మించారు తన జ్యేష్ఠ సోదరుడు శ్రీ మోహన్‌రావుతో పాటు స్వయంపాకం చేసుకుంటూ చదివి మెట్రిక్ ముగించి ఉపాధ్యాయుడుగా చేరి, క్రమంగా గణిత శాస్త్రంలో ఎం ఎ అయి లెక్చరర్ అయ్యారు ఉపాధ్యాయోద్యమంలో పాల్గొని జంట నగరాల ఉపాధ్యాయ సంఘాలలో బాధ్యతగల పదవులు నిర్వహించారు ఉత్తమ ఉపాధ్యాయులుగా అటు అధికారులతోను, ఇటు విద్యార్థులతోను ప్రశంసలు పొందారు ఇలా చాలా మంది ఉండవచ్చు కాని, శ్రీ రఘుపతిరావులో విశేషం కర్తవ్య నిష్ఠ, కృతజ్ఞత, కమ్మని ప్రవర్తన తాను విద్యార్థి దశలో సికిందరాబాద్ సత్రాల అరుగుల మీద పడుకుని గడపిన కాలాన్ని, మరికొన్ని సంఘటనలనూ నిరంతరం మననం చేసుకుంటూ, విద్యార్థులకు విద్యాదానం, అడపాదడపా గుప్త ఆర్థిక దానం చేసేవారు నొప్పించక, తానొవ్వక తప్పించుక తిరిగిన అమృతహృదయుడు ఒప్పించడమే తప్ప నొప్పించని మనస్వి ఎంతటి అల్లరి విద్యార్థినయినా ఆకట్టుకొని ఆత్మీయుణ్ని చేసుకొని, అల్లరి మాన్పించి చదువులో మల్లుణ్ని చేసిన ఆచార్య సత్తముడు ఆయన సతీమణి డాక్టర్ కమల సంస్కృత ప్రాకృత విదుషి ఉస్మానియా విశ్వవిద్యాలయం సంస్కృత శాఖలో రీడరు ఆయనకు నలుగురు కుమార్తెలు శ్రీ రఘుపతిరావు ఇటీవల ఉస్మానియా జనరల్ ఆస్పత్రిలో గుండె పోటుతో కన్నుమూశారు ఆయన లాంటి అమృత హృదయులైన ఉపాధ్యాయులు పదిమంది ఉన్నా విద్యారంగం ప్రశాంతంగా ముందుకు పోతుందని నా విశ్వాసం

## ఉపశ్రుతి :–

ఏమిసార్, నార్ల వేంకటేశ్వరరావు గారితో పని చేసిన నీలంరాజు వేంకట శేషయ్యగారూ, మీరూ బోయి భీమన్నగారూ, మరికొందరు ఈ వూళ్లో వున్నారే దూరదర్శిని ఇంటర్వ్యూలో ఆయనపై మాట్లాడిన వారిలో మీరంతా లేరే? – అనడిగారు ఒకరు ఎలా ఉంటారండీ? వారు పదవుల్లో ఉన్నారా దూరదర్శిని కంట్లో పడడానికి? – అని కోప్పడ్డారు మా మాటలు వింటున్న మరొక పెద్దమనిషి □

*Printed and Published for Nageswara Rao Estates Private Ltd., by S Nageswara Rao at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3, Editor S. Radhakrishna, Phones P B X 61247, 61248 & 75667*

## గ్లాక్సో కానుక

# తక్షణ శక్తిదాయక అద్వితీయ పానీయం
# జిల్లనిపించే నారింజ రుచి గలది





**విటమిన్-సి తో**
**పరిపుష్టమైనది.**

గ్లూకోజ్ చేరిన కొత్త గ్లూకోన్-సి. మీ బిడ్డను ఉరుకుల పరుగుల ఉత్సాహంతో నింపి ఉంచే, అనుకూల మైన సత్వర శక్తిదాయక ఆహారం.

ఇది, పిల్లలలో పళ్లు, ఎముకలు, శరీర ధాతువుల పెంపుదలకు అత్యవసర మైన విటమిన్ సితో పరిపుష్టమైనది.

ఒక గ్లాసు చల్లని ఐస్ వాటర్‌లో నాలుగు టీ స్పూన్ల గ్లూకోన్-సి కరిగించి, జిల్లనిపించే నారింజ రుచిగల ఉల్లాస పానీయాన్ని తయారుచేయండి, రోజుకు రెండుసార్లు మీ బిడ్డకివ్వండి.




**ఎక్కువ ధరైన పంచదార కలపనవసరం లేదు**



# గ్లూకోన్-సి

3LL-1174 R

Regd. No. H/VJ-41 ANDHRA SACHITRA VARA PATRIKA

29-4. April. '85